# నాటకముల సంపుటి

రచన

గరికపాటి

నవరత్నా బుక్ సెంటర్

ఏలూరురోడ్ — విజయవాడ-2.

# పాత్రలు

1. శ్రీవత్స
2. అనిత
3. రవికాంత్
4. మురళీధర్
5. విజయేంద్ర భూపతి
6. నాగన్న
7. భీమన్న
8. బలరాం
9. రాజారాం
10. ఆనంద్
11. చంద్రశేఖర్

మరియు

ఇద్దరు కానిస్టేబుళ్ళు

# ప్రార్థన

శ్లో॥ అంగీకమ్ భువనమ్ యస్య
వాచికమ్ సర్వ వాఙ్మయమ్
ఆహార్యమ్ చంద్రతారాది త్వమ్
వందే సాత్వికమ్ శివమ్

ఓమ్ నమశ్శివాయః — ఓమ్ నమశ్శివాయః
ఓమ్ నమశ్శివాయ

పాట : స్వాగతమమ్మా కళామ తల్లీ
స్వాగతమమ్మా నవరస తల్లీ ॥స్వాగ॥
నీ దీవెనలే మాకు నిండుగా
నీ శోభలలో కాంతి నిండగా
అడుగు జాలందైక మత్యమున
నడిచెదమమ్మా కళామతల్లీ

స్వాగతం - స్వాగతం - స్వాగతం - సుస్వాగతం
నీపద సేవలే మాకు దీక్షగా
నీ చిరు నవ్వులే మాకు రక్షగా
నిరతము నిన్నే మదిలో నిలుపుచు
స్మరియించెదము చల్లని తల్లీ

స్వాగతం - సుస్వాగతం - స్వాగతం - సుస్వాగతం
వాణీవీణా స్వర రాగిణివై
వరమాధుర్య విమోహన గుణివై
నవరస రంజన నాట్య భంగిమల
పొంగుచు పొరలే భువన మోహినీ

స్వాగతం - సుస్వాగతం - స్వాగతం - సుస్వాగతం
స్వాగతం - సుస్వాగతం

రచన ; ఎం. ఎ. బాషా అండ్ పి. ఆర్. మోహన్

# అగ్గి రాముడు

## మొదటిరంగం ప్రారంభం

(అది విజయేంద్ర భూపతిగారిభవనంలోహాలుగది. ఉన్నత కుటుంబీకుల గృహాలంకరణతో ముచ్చటగా అలంకరించబడి వుంటుంది ఎడమవైపుగా బయటికి ఒక వాకిలి, కుడివైపుగా లోనికి ఒక వాకిలి, వెనుకగా లోనికి యింకొక వాకిలి ఉన్నాయి. వెనుక వాకిలిప్రక్కగా మేడమీదికి మెట్లు అమర్చబడి వుంటయి. గదిమధ్యగా సోఫావుంది. బయటి వాకిలివయిపు టేబుల్ వుంది. దానిమీద రేడియో, టెలిఫోను, పత్రికలు అలారంగడియారం వగైరా ఉన్నాయి, రేడియోమీద పూలకుండి వుంది లోని వాకిలివైపు చిన్న టేబుల్ వుంది. దానిమీద గాజుకూజా, గాజుగ్లాసులు ఉన్నయి.)

(తెరలేచింది)

(లోపల్నుంచి అనిత హుంషారుగా కూనిరాగం తీస్తూ ప్రవేశించింది. ఆమెచేతిలో చక్రవర్తిఫోటో వుంది. అనిత పాటపాడుతూ డాన్స్ చేస్తుంది.)

(పాట:- 1) (అనితపాట)

(పాట పూర్తయింది. లోపల్నుంచి విజయేంద్ర భూపతి ప్రవేశిం చాడు.

విజ: అనితా,

అని: ఏం మామయ్యా?

విజ : చాలా హుషారుగా కన్పిస్తున్నావ్ .... ఏమిటమ్మా విశేషం?

అని : ఏమీలేదు మామయ్యా.

విజ : ఆఁ...నాకు తెలుసులే. మీబావ కలలో కన్పించి మారాంచేసుంటాడు:

అని : పో మామయ్యా.

విజ : నాకు తెలుసమ్మా. చక్రవర్తంటే నీకు పంచప్రాణాలు. నువ్వన్నా వాడికి అంతే.

అని : మామయ్యా!

విజ : అమ్మా?

అని : బావ ఎప్పుడొస్తాడు?

విజ : వస్తాడు.

అని : అదే...... ఎప్పుడొస్తాడు అని?

విజ : వస్తాడమ్మా. చదువు పూర్తిచేసుకొని, క్యాన్సర్ స్పెషలిస్టుగా పట్టాపుచ్చుకొని మరీ వస్తాడు. చూడమ్మా అనితా! వాడికోసం నువ్వు తాపత్రయపడుతున్నావని నాకు తెలుసు. అంతమాత్రాన పరుగెత్తుకు రావడానికి వాడు విజయవాడలో ఉన్నాడా, విజయ నగరంలో ఉన్నాడా? వాడున్నది అమెరికాలో?

అని : (బరువుగా నిట్టూర్చింది)

విజ : అనితా! నీకేగాదు .. వాడ్ని చూడాలని నాకూ తాపత్రయంగానే ఉంది. వాడి రాకకోసమే నేనూ ఎదురుచూస్తున్నాను.

అని : మామయ్యా,

విజ : నా పరిస్థితి నీకు తెలియనిదా అనితా! గుండెజబ్బుతో ప్రతిక్షణం మృత్యువుతో పోరాడుతున్నవాడి, ఏ క్షణంలో నా ఆయువు నరి

పమా వ్తమై, ఆత్మ ఈ దేహాన్నివీడి పరమాత్మలో లీనం అవు తుందో చెప్పలేను.

అవి : (అదుర్దాగా) మామయ్యా!

విజ : అవునమ్మా. నా జీవితం గాలికి రెపరెపలాడే చిన్నారి దీపం లాంటిది. నా ప్రాణజ్యోతి ఆరిపోయేలోగా మిమ్మా, పెదబాబును ఒకింటి వాళ్ళనుచేసి కళ్ళారాచూసి, నా బాధ్యతను నెరవేర్చుకొని వెళ్ళిపోవాలని నా కోరిక.

(బయటునుంచి రవికాంత్, మురళీధర్ వస్తారు.)

రవి : అయితే అనితవివాహం అన్నయ్యతో నిర్ణయించారన్నమాట.

విజ : అవును.

రవి : నాన్నా.... నేను అనితను ప్రేమిస్తున్నాను.

విజ : ఆ(!

రవి : అవును. ప్రేమించడం తప్పుకాదనుకుంటాను.

అని : నేను నిన్ను ప్రేమించడం లేదు చినబావా!

రవి : అనితా!

అని : అవును. నేను ప్రేమిస్తున్నది, ఆరాధిస్తున్నది పెదబావను.

రవి : నిజంగానా;

అని : అవును

విజ : అనిత అబద్ధం చెప్పడంలేదు. తన పంచప్రాణాలు చక్రవర్తి మీదే పెట్టుకున్నది.

రవి : నా పంచప్రాణాలు అనితమీద పెట్టుకున్నాను.

విజ : చినబాబూ: మీ అన్నయ్యకు అనితకు వివాహం జరిపించాలనేది మీ అమ్మ అంతిమ కోరిక.

రవి : నాన్నా!

విజ : అవును రవిబాబు మీ అమ్మ మరణావస్తలో ఈ చిన్నకోరిక కోరింది. నేను మాటిచ్చాను.

ముర : అలాగని పోయినవారి కిచ్చిన మాటకోసం బ్రతికున్నవారిని బాధ పెట్టడం ధర్మంకాదు మామయ్యా.

విజ : మురళీధర్.

ముర : అవును మామయ్యా.

విజ : ఏమిటి నీ ఉద్దేశ్యం?

ముర : మామయ్యా! చెల్లాయిని రవిబావ మనసారా ప్రేమించాడు.

అని : అన్నయ్యా.

ముర : అవునమ్మా. నీమీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. నువ్వే తన జీవనజ్యోతిగా ఎంచి మురిసిపోతున్నాడు.

అని : ఆఁ!

రవి : ఏం అనితా, నిన్ను ప్రేమించడం నేరమంటావా?

అని : అదికాదు బావా! మరి... మరి......

రవి : నీ ప్రేమకు అర్హుణ్ణి కాదంటావా?

అని : అదికాదు బావా! నువ్వు ప్రేమించడం తప్పని అనడం లేదు. నన్ను ప్రేమించేముందు నా మనస్సు తెలుసుకోవడం నీ ధర్మం.

రవి : అనితా!

అని : అవును బావా. నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నది పెదబావనే. పెదబావే నా జీవనయాత్రలో తోడునీడ. ఆ నిర్ణయం నేను ఏనాడో చేసుకున్నాను.

విజ : విన్నావా రవిబాబు.

రవి : విన్నామామయ్యా. అనితను నేను ప్రేమించానేగాని, ఆమె ప్రేమను పొందలేకపోయాను. నిజంగా అన్నయ్య అదృష్టవంతుడు ఈ సుగుణాలరాశిని తన అర్ధాంగిగా అందుకోబోతున్నాడు.

అని : బాధపడుతున్నావా బావా?

రవి : బాధా! (నవ్వుతు)

అని : బావా!

రవి : లేదు అనితా! నీ అదృష్టానికి ఆనందిస్తున్నాము. విజానికి నీకు అన్నివిధాలా తగినవాడు అనిపించుకున్నా ఆయ్యేడు. అదీగాక నాన్న అమ్మ కిచ్చినమాట వృధా కాకూడదు.

విజ : చినబాబూ!

రవి : అవునునాన్నా! పరలోకంలోనున్న అమ్మ ఆత్మ బాధపడకూడదు.

విజ : బాబూరవీ! నీ మనసు అమృతకలశంతో సమానం. మీ అన్న దమ్ముల అన్యోన్యానురాగాలు కలకాలం శాశ్వతంగా వర్థిల్లాలి.

రవి : మీ కోరిక నెరవేర్చమని దేవుడ్ని ప్రార్థిస్తున్నాను నాన్నా.

అని : మాటల్లో మర్చేపోయాను. మామయ్యా! మీరు మందుతీసుకునే వేళయింది.

విజ : అవునమ్మా.... నేనూ మర్చిపోయాను, పదమ్మా ... కలిపిద్దువు గాని,

(అనిత విజయేంద్ర భూపతి లోనికి వెళ్ళారు.)

రవి : (బరువుగా నిట్టూర్చి బయటకు వెళ్ళబోయాడు.)

ముర : బావా!

రవి : (ఆగాడు) ఏమిటి బావా?

ముర : వూం... గ్రద్ద కష్టపడి సంపాదించుకున్న ఆహారాన్ని కాకి తన్నుకు పోయింది.... పాపం!

రవి : అంటే?

ముర : పిచ్చిబావా! ఆహారాన్ని పోగొట్టుకున్న ఆ పక్షి, క్షణకాలం బాధ పడి, మళ్ళీ ఆహారాన్వేషణలో మునిగిపోతుంది. కాని నువ్వుమన సారా ప్రేమించిన అనితను పోగొట్టుకొని జీవితాంతం బాధపడే దురదృష్టవంతుడి వయ్యావు.

రవి : బావా!

ముర : కాదంటావా?

రవి : కాదు.

ముర : అనిత వియోగబాధ నీకు ఉండదంటావా?

రవి : బాధా .... ఎందుకూ?

ముర : అనిత వివాహకరణ నీలో ఉత్సాహం కలిగించటంలేదు

రవి : ఎందుకు బావా బాధ తను మనసారా అన్నయ్యను ప్రేమించింది, అన్నయ్యగూడా అనితను ప్రేమించాడు. వారిద్దరూ భార్యాభర్తలు కావటం ధర్మం.

ముర : ధర్మంకాదు నీ ఖర్మం.

రవి : బావా!

ముర : నీ ప్రేమ పవిత్రమైందనుకున్నాను గాని, పాలపొంగులాంటిదని ఇప్పుడు తెల్సింది.

రవి : బావా!

ముర : అవును రవిబాబు తను మనసారా ప్రేమించిన ఆడది పరాయివాడి భార్య కావడం చూస్తూ చూస్తూ ఏమగాడూ సహించలేని సంఘటన, మీసమున్నవాడు రోషమున్నవాడు సహించడు ... సహించలేడు ... అదే నిజమైన ప్రేమకు అర్థం,

రవి : ఇంతకూ ఏమిటి నువ్వనేది?

ముర : లోకవైఖరిని తెలియచేస్తున్నాను. నిజంగా నువ్వు మా చెల్లెల్ని ప్రేమిస్తున్నవాడివయితే, ఆమెకోసం ఆమెపొందుకోసం నీ ప్రాణాన్ని పైతం ధారబోయడానికి వెనకాడేవాడివి కావు.

రవి : మురళీధర్.

ముర : అవును, ఈ లోకం యావత్తూ ఏకమై ఎదురువచ్చినాగూడా ఎదిరించి నా చెల్లెలి మెడలో తాళిగట్టేవాడివి.

రవి : అలాగని... ... కన్నతండ్రి మాట కాదన్నమంటావా? అమ్మ మాటకు అడ్డుపడి ఆమె ఆత్మను క్షోభ పెట్టమంటావా? కేవలం నా స్వార్థంకోసం అటు అన్నయ్యను, ఇటు అనితను బాధపెట్టి వారిదృష్టిలో కృతఘ్నుడను కావడం నాకిష్టంలేదు.

ముర : రవిబాబు!

రవి : నో...... అలా జరగడానికి వీల్లేదు.

ముర : బావా!

రవి : అవును బావా! పవిత్ర ప్రేమ నా ర్థాన్ని కోరదు, అన్నయ్యా, అనితల సుఖంకోసం నా ప్రేమనేగాదు, అవసరమైతే నా జీవితాన్నే త్యాగం చేస్తాను.

ముర : త్యాగమూర్తివి. (వ్యంగ్యంగా అన్నాడు.)

రవి : బావా! ఒక ఆడదాని శరీరం కోసం ప్రశాంత కాంతి నివాసమైన మా కుటుంబంలో కలతలు రేగనివ్వటం వీలులేదు. కంటికి రెప్పలా కాపాడుతూ నా క్షేమాన్ని కోరి తండ్రిమాట తిరస్కరించలేను. నా సహధర్మచారిణిగా ఆ దైవం ఎవర్ని ప్రసాదో ఆమె నాకు దక్కుతుంది వస్తాను.

(చరచరా లోపికెళ్ళాడు)

ముర : డామిట్.... కథ అడ్డం తిరిగింది.

(బయటనుంచి డాక్టర్ ఆనంద్, లాయర్ చంద్రం ప్రవేశించారు. ఆనంద్ చేతిలో మెడిసిన్ బ్యాగ్ వుంది.)

ఆనం :హలో మురళీధర్.

చం : ఏమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టున్నావ్?

ముర : పక్షి పంజరాన్నుంచి యెగిరిపోయే లాగుంది

ఆనం: ఏమంటున్నాడు రవికాంత్?

ముర : మనప్లానంతా తారుమారు చేశాడు

చం
 : అ(
ఆ

ముర : అవును. మా పెదబావ చక్రవర్తి...నేడో రేపో కాన్సర్ స్పెషలిస్టుగా సర్టిఫికెట్ పొంది ఇండియాకు తిరిగివస్తాడు. ఈ లోగా మా చెల్లెలు అనితను మా చినబావ రవికాంత్ కట్టబెట్టి, అతన్ని నా చేతి కీలుబొమ్మగా మార్చి, ఆస్తికి స్వాతంత్రాధిపత్యం పొందాలనుకున్నాను. ఆ ప్లానంతా రవి సర్వనాశనం చేశాడు.

చం : ఎందుకని?

ముర : రవి అనితను పెళ్ళిచేసుకోడానికి అంగీకరించలేదు.

చం : ఆఁ?

అనం : బంగారుబొమ్మలాంటి పిల్ల.

చం : అప్లాను కాదన్న రవిగూడా ఒక మగాడేనా?

అనం : కాశ్మీర్ యాపిల్ నోటికందించి రుచి చూడమంటే వాంతిచేసుకునే రోగిష్టిలా వున్నాడే.

చం : ఛీ ఛీ......

అనం : అఁ... చక్రవర్తినే మీచేతి కింద బొమ్మగా మారిస్తే...?

ముర : అది అంత సులభంగాదు.

చం : ఏం?

ము : మహా కుర్రాడు విరగతంతాడు.

అ : అమ్మో.

ము : పెద బాబ రవిబాబులాంటి అమాయకుడు గాదు కాలాంతకుడు.... అవులిస్తే పేగులు లెక్కపెట్టే రకం. అతని ముందు మన ఆటలు సాగవు.

అ : అయితే ఏం చేదాము?

చం : అవును ఎం చేద్దాం?

ము : మనిషి మనిషిగా బ్రతకాలంటే సమాజంలో గౌరవాన్ని, సుఖాన్ని పొందాలంటే ముఖ్యంగా కావాల్సింది డబ్బు. దాని కోసం ఏమైనా చెయ్యాలి. అవసరమయితే తలకాయలే నరకాలి,

చం , అమ్మ బాబోయ్.

అ : ఏమిటయ్యా మురళీధర్.... తలకాయలంటే పొరకాయలను కున్నావా?

ము : భయపడకండి మనం పుట్టుకతో దరిద్రులం ... అలాగని దరి ద్రంలో బ్రతకలేం— దరిద్రాన్ని పారద్రోలి కలకాలం సుఖంగా బ్రతకాలంటే, అదున్న మనుష్యుల్ని తల నరకక తప్పదు,

చం : అవును.

ఆ : అదీ నిజమే.

ము : చూడండి ఫ్రెండ్స్— ఈ మూడు సంవత్సరాలుగా మనం దొంగ నోట్లు ముద్రించి కోటీశ్వరులం కావాలని ఎన్నో ప్రయత్నాలు చేశాం. మన ప్రయత్నాలకు ఫలితంగా అచ్చుయంత్రాన్ని, వంద రూపాయల కాగితాలు ముద్రించే బ్లాకులు వంద నోట్లు అచ్చు వేశాం, కొన్ని వేల రూపాయల నోట్లు చెలామణి చేశాం.

చం : అవును.... మొత్తం యాభై వేల రూపాయలు నోట్లు మార్చాం.

ఆ : అవును.

ము : మనం మార్చిన నోట్లు మన పెట్టుబడికే చాలలేదు. ఇంతలో ప్రభు త్వం మన చర్యలను కనిపెట్టి సి ఐ.డి.లను పంపించింది. ఫలితంగా అచ్చుయంత్రాన్ని, ముద్రించిన నోట్లకట్టలను తగుల బెట్టాం.

శరి : అవును మన కష్టానికి ప్రతిఫలం దక్కలేదు.

ము : ప్రభుత్వం దక్కకుండా చేసింది. కోటీశ్వరులం కావాలనుకున్న మన ఆశ ఆశలాగే మిగిలిపోయింది.

ఆ : అది మన అదృష్టం.

ము : వీలులేదు— మనం దురదృష్టవంతులం కావడానికి వీలులేదు. ఒక మార్గాన ముళ్ళకంచెలు వుంటే మరొక మార్గంలో పయనించ టం నేర్చుకోవాలి.

చం : అంటే?

ము : మా మామయ్య.... విజయేంద్ర భూపతి కోటీశ్వరుడు— కొన్ని కోట్లకు వారసుడు. తనయాపదా స్తిని ఇద్దరుకుమారులకుసమానంగా

పంచి యిస్తాను. రవిబాబుకు మా చెల్లెలునిచ్చి వివాహం చేస్తే ఆస్తికి అవిత అధికారిణి అవుతుంది. రవిబాబును గుట్టుచప్పుడు కాకుండా మట్టుబెట్టి అవితను ఆస్తికి సర్వాధికారిని చెయ్యాలను కున్నాను.

ఆ : ఆః! మీ చెల్లెలి మాంగల్యాల్ని తెంచి వెయ్యాలనుకున్నారా?

ము : అవును.... అన్నయినా చెలెలయినా మట్టుపెట్టక తప్పదు. వినో గంలో మున్న అవితను కీలుబొమ్మగా మార్చి ఆడించాలను కున్నాను కాని.

చం : రవిబాబు మీ ప్లానంతా సర్వనాశనం చేశాడు.

ము : అవును.

(లోపల్నించి విజయేంద్ర భూపతి ప్రవేశించాడు)

ఆ : గుడ్ మార్నింగ్ సార్.

వి : గుడ్ మార్నింగ్

చం : గుడ్ మార్నింగు సార్.

వి : వెరీగుడ్ మార్నింగు లాయర్ చంద్రశేఖరంగారూ! మిమ్మల్ని నేనే పిలిపించాలనుకున్నాను. సమయానికి

చం : ఏమిటో విషయం

వి : ఆ విషయాన్ని మనం ఏకాంతంగా మాట్లాడుకుందాం.

ఆ మీ ఆరోగ్యం ఎలా వుంది?

వి : మీ హస్తవాసి అమూల్యం— మునుపటికన్నా నా ఆరోగ్యం మెరుగుగానే వుంది.

ఆ : వెరీగుడ్.

(ఆనందు స్టెత స్కోపుతో విజయేంద్ర భూపతిని పరీక్షించాడు నాడిని చూశాడు.)

ఆ : వెరీగుడ్— ఆ మందునే కంటిన్యూ చేయండి. రేపు కొత్త మందులు రాస్తాను.

వి : అలాగే
(డాక్టర్ ఆనంద మెడిసిన్ బ్యాగులోంచి సిరంజి తీసి. ఇంజక్షన్ బాటిల్ తీసి మందు ఎక్కించి, భూపతి చేతికి ఇంజక్షన్ ఇచ్చాడు.
ఆ : వేళకు మందు తీసుకోవడం మరచిపోవద్దు.
వి : నేను మర్చిపోయినా మా అనిత మర్చిపోదు,
ఆ : రాత్రిళ్ళు బాగా నిద్రపడుతోందా.
వి : ఆహా.....
ఆ : వెరీగుడ్ — (సిరంజి, బాటిల్ బ్యాగులో పెట్టుకొని) వెళ్ళొస్తాను.
(బ్యాగు తీసుకుని వెళ్ళిపోయాడు.
వి . మురళీధర్.
ము : ఏమిటి మామయ్యా.
వి : పది నిమిషాల్లో లాయర్ చంద్రశేఖర్‌గారితో మాట్లాడాలి.
ము : (బయటికి వెళ్ళాడు)
వి : కూర్చోండి లాయర్‌గారూ.
చం : (కూర్చున్నాడు.)
వి . నేను చెప్పిన ప్రకారం వీలునామా తయారుచేశారా.
చం : చిత్తం (కోటు జేబులోని వీలునామా తీసి యిచ్చాడు,
(విజయేంద్ర భూపతి వీలునామా తనలో చదువుకుని సంతకంచేసి చంద్రానికిచ్చాడు,
వి : అవకాశం చూసుకుని దీనిని రిజిష్టర్ చేయించండి.
చం : చిత్తం — భూపతిగారూ! నాదొక చిన్న అనుమానం
వి : నాకు తెలుసు మీరేమడగాలనుకుంటున్నారో,
చం : అవును, మీలో యింతటి పక్షపాతబుద్ధి ఏర్పడటానికి కారణం ఏమిటో ఎంత వెదికినా కన్పించడంలేదు.
వి : లాయరుగారూ.
చం : మన్నించండి నా సాహసాన్ని. పెదబాబు చక్రవర్తి — చిన బాబు రవికాంత్... ఇద్దరూ మీ రక్తాన్ని పంచుకుని పుట్టిన మీ

ప్రతిబింబాలే. ఇరవై కోట్ల విలువగల మీ యావదాస్తి. స . నంగా నడపడం న్యాయం, అలాకాకుండా... ఈ వీలునామా ప్రకారం.

వి . : లాయరుగారూ.

చం : మీ అంతరంగిక వ్యవహారాలలో తలదూర్చటం భావ్యం కాదని నాకు తెలుసు, కాని, నేను మీ శ్రేయోభిలాషిని. రేపటిరోజున ఇదేమిటని మీ ఇద్దరు కొడుకులు అడిగితే నేను ఏం చెప్పాలి,

వి , అదా మీ సంశయం.

చం , అవును సార్,

వి . లాయర్ గారూ! ఈ రహస్యాన్ని కొంతకాలం రహస్యంగానే వుంచటం మంచిది.

చం . అలాగే! వస్తాను. [వెళ్ళబోయాడు]

వి . ఆగండి

చం . [ఆగాడు]

వి – లాయర్ గారూ, రెక్కలు రాని పసి కూన మీ పాదాల ముందు వాలితే మీరేం చేస్తారు!

చం – అయ్యోపాపమని జా! తలిచి గూటికి చేరుస్తాం.

విజ : దానికొక గూడంటూ లేకపోతే ... ?

చం : రెక్కలు వచ్చేవరకూ ఆహారం పడేస్తాం... ఆ తర్వాత....

విజ : తన భవిష్యత్తును వెతుక్కుంటూ ఆ పక్షికూన పక్షిగామారి ఎగిరిపోతుంది.

చం : అంటే?

విజ : అర్థంకాలేదా లాయర్ గారూ. రవికాంత్ నా పాదాలముందువాలిన రెక్కలురాని పక్షికూన. అతని గూడేదో తెలియని స్థితిలో నా గూటికిచేరాడు. రెక్కలు వచ్చేవరకు పెంచాను. నా బాధ్యతగా చదువు చెప్పించాను. మనిషిగా తీర్చిదిద్దాను.

చం : అంటే ... రవిబాబు...

విజ : నా బిడ్డగాదు.

చం : ఏమన్నారు? రవికాంత్ మీ కన్నబిడ్డకాదా,

విజ : కాదు.

చం : ఓ .... ఐసీ!

విజ : అవును లాయర్‌గారూ. సుమారు ఇరవయిదు సంవత్సరాలకుపూర్వం నేను నాభార్య హైదరాబాద్ నుంచి విజయవాడ వస్తున్నాం. కోదాడగ్రామం దాటే సమయానికి చీకట్లు కమ్ముకుంటున్నాయి నా భార్య ఒడిలోనున్న ఐదేళ్ళ పెదబాబు మంచినీళ్ళుకావాలని అడిగాడు. దూరాన భావి ఉండటం చూచి డ్రైవర్ టాక్సీఆపాడు. నాభార్య పెదబాబును తీసుకొని మంచినీళ్ళు త్రాగించడానికి బావి దగ్గరకు వెళ్ళింది. నేను టాక్సీలో కూర్చునిఉన్నాను. పదినిముషాల తర్వాత తిరిగివచ్చిన నాభార్య చేతులలో పెదబాబులేడు.

చం : మరి ....?

విజ : పెదబాబుకబదులు కళ్ళు తెరవని పసికందు ఉన్నాడు. బావిసమీపంలో ఆ బిడ్డ దొరికాడని, తను తీసుకొచ్చానన్నది నా భార్య. పరిస్థితి నా కర్థమైంది. ఎవరో కామోద్రేకంలో కాలుజారినఆడది తన పాపానికి రూపానిచ్చి ప్రసాదించి, తనబిడ్డగా లోకంముందు నిలబెట్టలేక, పసికందు ప్రాణం తియ్యడానికి ఆ మాతృహృదయం అంగీకరించక అలా వదిలి వెళ్ళిపోయిందని నిర్ణయించుకున్నాను.

చం : అలాగా!

విజ : ముక్కుపచ్చలారని ఆ పసికందును ఒంటరిగా వదిలివెళ్ళలేక నా భార్య, తన రెండవ కుమారుడుగా భావించి మా వివాహానికి చేర్చింది. ఆనాటినుండి రవికాంత్‌గా పేరుపెట్టి నా బిడ్డగాపెంచి లోకం ముందుంచింది.

చం : అదా విషయం?

విజ : అవును లాయర్‌గారూ. రవికాంత్ నా కన్నబిడ్డకాదు, నారక్తంతో సంబంధం లేనివాడ్ని ఆ స్తికి వారసుడ్ని చేయలేక యావదాస్తి

పెదబాబు చక్రవర్తి పేర వ్రాశాను. నా భార్య ఒడిలో రెండవ బిడ్డగా పెరిగినపుణ్యానికి ఫలితంగా రవికాంత్ పేర యాభయివేలు ఖరీదుగల నిమ్మతోట మాత్రమే వ్రాసాను...... లాయర్ గారూ.

శం : సార్.

విజ : ఈ వీలునామాలో నాబిడ్డ భవిష్యత్తు దాగివుంది. దాన్నినమ్మి మీ చేతులలో పెడుతున్నాను. నేను పోయిన తర్వాత దీన్ని పెదబాబుకు అందజేయండి. అంతవరకు దీన్ని మీ దగ్గరే ఉంచండి.

శం : అలాగే సార్.

విజ : మరొక్కమాట.

శం : ఏమిటది?

జవి : మీమీద నాకు నమ్మకముంది. అందుకే ఈ రహస్యాన్ని చెప్పాను. ఈ రహస్యాన్ని మీ అంతరంగంలోనే దాచుకోండి. ఎలాంటిపరిస్థితిలోను రవికాంత్ నాబిడ్డ కాదనేనిజాన్ని బయటికిరానివ్వకండి.

శం : అలాగే భూపతిగారూ! ఈ రహస్యాన్ని నా కడుపులో దాచుకుంటాను.

విజ : చాలా సంతోషం.

(లోపల్నుంచి రవికాంత్ నిరుత్సాహంగా సూట్ కేస్ తీసుకొని ప్రవేశించాడు )

విజ : రవికాంత్.

రవి : ఏమిటినాన్నా?

విజ : ప్రయాణమా?

రవి : అవును నాన్నా.

విజ : ఎక్కడికి?

రవి : నా గమ్యస్థానానికి.

విజ : అంటే?

రవి : నా ఆత్మకు రూపాన్నిచ్చి ఈ భూమిమీద వదిలేసిన నాకన్నవారిని వెతుక్కోడానికి.

విజ : (నిర్ఘాంతపోయి) బాబు.

రవి : విన్నాను నాన్నా. మీరు లాయర్ గారితో చెప్పినదంతా విన్నాను. నేను మీ కన్నబిడ్డను కాదని తెలుసుకున్నాను.

విజ : రవిబాబూ!

రవి : లాయర్ గారూ, నేనెంత దురదృష్టవంతుడ్నో చూశారా. నిత్యం ప్రేమానురాగాలు అందించిన ఈ పుణ్యమూర్తే నా జన్మకు కారకులని మురిసిపోయాను. ఈ పుణ్యమూర్తి కన్నబిడ్డగా పుట్టినందుకు దేవుడ్ని ప్రార్థించాను. అదంతా అబద్ధమని తేలింది.

విజ : రవిబాబూ!

రవి : నాన్నా, (ఏడుస్తూ) దేవుడికి దయలేదు నాన్నా. నను మీకొడుకుగానే పుట్టించగూడదా?

విజ : బాబూ!

రవి : నాన్నా ... (కాళ్ళమీద పడి) నాన్నా. (ఏడుస్తాడు)

విజ : (రెండు భుజాలు పట్టుకుని లేపి) బాబూ! (గుండెలకు హత్తుకున్నాడు.)

రవి : వస్తాను నాన్నా.

విజ : ఒద్దురవి .... నువ్వెళ్ళొద్దు.

రవి : నాకీ యింట్లో స్థానం లేదునాన్నా.

విజ : వుందిబాబు ... నీకు ఇంట్లోనేగాదు, నా మనసులోగూడా స్థానముంది. నువ్వు నా బిడ్డవేనాన్నా ... నువ్వు నా బిడ్డవే.

రవి : కాదు... నేను మీ బిడ్డనుకాదు... నాకా అదృష్టంలేదు.

విజ : లేదుబాబు ... నువ్వు నా బిడ్డగానే పెరిగావు. లోకం ముందు నా బిడ్డగానే విల్చావు.

రవి : నాన్నా!

విజ : అవునుబాబూ. నిన్ను అర్థం చేసుకున్నానురా. నామీద నువ్వు పెంచుకున్న ప్రేమానురాగాలు అర్థం చేసుకున్నాను. నువ్వు నా

బిడ్డవేనాన్నా, నా బిడ్డవే. నువ్వు అన్నయ్య నా రెండుకళ్ళురా,
లాయర్‌గారూ.

చం : సార్!

విజ : ఆ వీలునామా చించేయండి.

చం : సార్!

విజ : అవును చించేయండి. చక్రవర్తి, రవిబాబు నాకిద్దరు బిడ్డలు. ఆస్తి సమానంగా పంచుతూ కొత్త వీలునామా వ్రాయండి.

చం : అలాగే. (వీలునామా చించేశాడు)

విజ : అరగంటలో వీలునామా వ్రాసి పట్టుకురండి. సంతకం చేస్తాను.

రవి : డిద్దునాన్నా... నా కెందుకీఆస్థి ... యింతకాలం మవ్వే నాకన్న తండ్రిగా యెంచి, అంతు తెలియని ప్రేమ పెంచుకున్నాను. ఆ ప్రేమానురాగాలు శాశ్వతంగా ఉంటే అంతేచాలు.

విజ : కాదుబాబూ. స్వార్థంతో నీ కన్యాయం చేయబోయాను. యింతలో దైవం నాకళ్ళు తెరిపించాడు. కన్నవాడే గాదు, పెంచినవాడుగూడా కొడుకేనని తెలుసుకున్నాను. ధర్మంగా, న్యాయంగా ఆస్తి మీ యిద్దరికీ చెందాలి. లాయర్‌గారూ! వీలునామా తయారుచేయండి.

చం , అలాగే సార్.

విజ : పదబాబూ. లోపలికి పద.

(రవికాంత్ సూట్‌కేస్‌తో లోనికెళ్ళాడు. విజయేంద్రభూపతి వెను కగావెళ్ళాడు.)

(చంద్రశేఖర్ జేబులోని పాకెట్ ఉప్‌రికార్డ్ బయటికి తీసి దాని వంకచూసి వికటంగా నవ్వాడు.)

(బయట నుంచి మురళీధర్, ఆనంద వచ్చారు. మురళి చంద్రం చేతిలోని టేపురికార్డర్ తీసుకున్నాడు.

చం : [ఉలిక్కిపడి] ఆఁ... అది.... అది....

ము : ఏమిటో నాకు బాగా తెలుసు

చం : మురళీధర్.

ము : అవును చంద్రం— మామయ్య చెప్పిన రవికాంత్ జీవిత రహస్యాన్ని రవి పాకెట్ టేపు రికార్డులో టేపు చేశావు. అవునా?

చం : అవును.

ము : దీనితో నాకు చాలా పనివుంది.

చం : అంటే.

ము : చక్రవర్తి నేడో రేపో చస్తాడు. మా అనితకు భర్త అవుతాడు తాళికట్టిన మూడవరోజున హనీమూన్‌కు బయలుదేరుతాడు. ఇంతలో యాక్సిడెంట్ జరుగుతుంది.

చం : ఆఁ!

ము : ఆ యాక్సిడెంట్‌లో చక్రవర్తి శాశ్వతంగా లోకానికి దూరమవుతాడు ఆస్తి యావత్తు మా చెల్లాయ్ అనిత పరమవుతుంది అనిత నా చేతిలో కీలుబొమ్మవుతుంది.

చం : ఆస్తి యావత్తూ నీకు దక్కదు.

ము : ఎందుకని?

చం : రవికాంత్ బ్రతికే ఉన్నాడు.

ము : వున్నా నిష్ప్రయోజనం రవి టేప్ రికార్డులోని మామయ్య స్టేట్‌మెంటు చాలు. అతడు ఆస్తికి వారసుడు కాడని నిరూపించడానికి

చం : మరి వీలునామా?

ము : మాయమవుతుంది.

ఆ : భూపతిగారు బ్రతికున్నంత వరకూ మీ ఆటలు సాగవు.

ము : అయితే భూపతిగారిని భూమ్మీద ఉండనివ్వం.

ఆ : నీ ప్లాను.

ము : మన క్షేమం కోసమే. (టేబులును సమీపించి, టెలిఫోను రిసీవర్ ఎత్తి నెంబర్ డయల్ చేశాడు) హలో— యస్.... మురళీధర్ హియర్....ఆఁ... బలరాంను ఒకసారి పిలవండి.... [కొన్ని

క్షణాల తర్వాత) హాలో బల ం .. నేను మురళీధర్ని పీతో చాలా ముఖ్యగ విషయం మాట్లాడాలి... సీక్రెట్.... యస్.... యస్... బిజినెస్... త్వరగా రావాలి ... ఇంటి దగ్గరే ఉంటాను. ఓకే..... ( రిసీవర్ పెట్టేశాడు]

ఆ : బలరాం గుండెలుతీసిన బంటు.

చం : రక్తపిపాసి.

ఆ : మృత్యుదేవత మరోరూపం.

ఆ : వాడితో మనకేం పని?

ము : వివరాలు మీకే తెలుస్తాయి. నేను చెప్పినట్లు మీరు నడుచుకోవాలి ఇది బాస్ ఆర్డర్. అర్థమైందా. కాదంటే మీ తలకాయలు ఎగిరి పోతాయి. అర్థమైందా?

ఆ : వూ(—

చం : బాస్ ఆర్డరు కాదంటే మాకలు చెల్లి నట్లే.

ము : కమాన్... బలరాం రావటానికి అరగంట పట్టవచ్చు— ఈలోగా బాస్ను కలుసుకుందాం.

(మురళీదర్? చంద్రం, ఆనందు బయటికి వెళ్ళారు]

(కొన్ని క్షణాల తర్వాత బయటున్నుంచి పోస్టుమేన్ కేక వినిపించింది)

పో : [బయటున్నుంచి] సార్! టెలిగ్రాం.

అనిత: [లోపల్నుంచి వచ్చింది]

పో : టెలిగ్రాం సార్–

[అనిత బయటికెళ్ళి కొన్ని క్షణాలలో టెలిగ్రాంతో తిరిగొచ్చింది. టెలిగ్రాం ఓపెన్ చేసి తనతో చదువుతుంది. ఆమెతో ఆనంద రేఖలు వెల్లి విరిసాయి.]

అనిత: ఆ(. మామా! బావ వస్తున్నాడు. చక్రవర్తి బావ వస్తున్నాడు. మామయ్యా మామయ్యా, [పిలుస్తుంది]

వి : [లోపల్నుంచి వస్తూ) ఏమిటమ్మా? ... పిహడావుడి?

అవి . చక్రవర్తిబావ వస్తున్నాడు.

విజ . ఆс.... నిజంగానా?

అవి . అవును మామయ్యా... ఇదిగో టెలిగ్రాం (ఇచ్చింది)

విజ . (తనలో చదువుకుని) బాబూ, ఎన్నాళ్ళకు వస్తున్నావు బాబూ, నిన్ను చూడాలని కళ్ళు కాయలుకాచేలా ఎదురుచూస్తున్నాను. నా ఆశ ఈ నాటికి నెరవేరింది. నా హృదయం ఆనంద తరంగాల పై తేలిపోతుంది.

రవి . ఏమిటినాన్నా? (లోపలునుంచి వచ్చాడు)

అవి . పెదబావ వస్తున్నాడు.

రవి . అన్నయ్య వస్తున్నాడా? నిజంగానా,

విజ . అవునుబాబూ, నిజంగానే వస్తున్నాడు... ఒరేయ్... ఎల్లయ్యా... మల్లయ్యా... బుల్లెయ్యా...(పిల్చి)... ఎక్కడ చచ్చార్రా?

రవి . వాళ్ళంతా తోటపనిలో ఉన్నారు నాన్నా.

విజ . అవునవును. అమ్మా అవిత, రేపీపాటికి మీబావ వచ్చేస్తాడు... వచ్చేసరికి అన్ని ఏర్పాట్లు జరగాలి. ఎన్నోరకాల పిండివంటలు చేయాలి. ఘనంగా పార్టీ ఏర్పాటుచేయాలి అవితా, వాడికి నేతి గారెలంటే చాలా యిష్టం, అన్నీ నువ్వే స్వయంగా చెయ్యాలి.

అవి . చేస్తాను మామయ్యా.

విజ . (టెలిగ్రాం అవితకిచ్చి) ఒరేయి, ఎల్లయ్యా, మల్లయ్యా, బుల్లెయ్యా, ఎక్కడ చచ్చారురా (అంటూ బయటికెళ్ళాడు)

రవి . అవితా. ఈవార్త మా ఫ్రెండ్స్ అందరికి చెప్పి, రేపు పార్టీకి ఆహ్వానించి వస్తాను. (బయటికి వెళ్ళాడు)

(అవిత ఉత్సాహంగా టెలిగ్రాంను ముద్దు పెట్టుకుని సోఫాలో కదుము వాల్చింది).

అవి . [ఫోటోలో చూస్తూ] బావా, ఎప్పుడో అయిదుసంవత్సరాల క్రితం అమెరికా వెళ్ళావు. ఇంత కాలానికి క్యాన్సర్ స్పెషలిస్టుగా తిరి

గొస్తున్నావు. నీమీదే ఆశలు పెట్టుకొని బ్రతుకుతున్న ఈ మరదల్ని గుర్తుపట్టలేవా బావా. ఏమో, నువ్వు మారిపోయావేమో ఏమైనా ఆనాటి నీ రూపాన్ని నా గుండెల గుడిలో పదిలంగా దాచుకొని ఆరాధిస్తున్నాను. [మెల్లిగా గుండెలకు హత్తుకుని] బావా! [అంటూ తన్మయత్వంగా కళ్ళు మూసుకుంది]

[స్టేజీమీదున్న రంగురంగుల లైట్లన్నీ ఒక్కసారిగా ఆరిపోయి బ్లూలైట్లు వెలిగాయి]

[బయటనుంచి చక్రవర్తి ప్రవేశించి వాకిలివద్ద ఆగాడు.)

చక్ర. అనితా.

అని. [కళ్ళుతెరచి చూచింది]

చక్ర. అనితా.

అని. [లేచి కూర్చొని] ఎవరూ?

చక్ర. నీలోని ప్రణయరాగాన్ని, నీ ప్రేమకు అనురాగాన్ని, నీగుండెల్లో దాచిన తరంగాన్ని.

అని. [వింతగా చూస్తోంది]

చక్ర. ఇంతకాలంగా నా రాకకోసం ఎదురుచూస్తున్నావు గదూ! అందుకే వచ్చాను. రా అనితా! నాకౌగిలిలో చేరి నాలో కరిగిపో. అమర సౌఖ్యాన్ని అందించి తనివితీర్చుకో. నీబావ కౌగిలే నీకు భూలోక స్వర్గం.

అని. [సంతోషంగా) బావా!

చక్ర. అనితా!

అని. బావా, [అంటూ పరుగెత్తుకెళ్ళి కౌగలించుకుంది]

చక్ర. అనితా. [అంటూ గుండెలకు హత్తుకున్నాడు]

అని. బావా.

చక్ర. ప్రియా.

అని. ప్రియతమా.

[చక్రవర్తి అనిత గడ్డంక్రింద చేయిపెట్టి మొహాన్ని పైకెత్తి, తన పెదిమలతో ఆమె పెదిమలను చుంబించబోతాడు. అనిత సిగ్గుతో దూరంగా వెళ్ళబోతుంది. చక్రవర్తి ఆమె చీరకొంగు పట్టుకున్నాడు. చక్రవర్తి పాట పాడతాడు. అతనికూడా పాడుతుంది]

[పాట – 2] [చక్రవర్తి అనితడూయెట్]

(పాట పూర్తయింది. చక్రవర్తి సోఫాలో కూర్చున్నాడు. అతని ఒడిలో తలపెట్టి అనిత సోఫాలో పడుకుంది]

అని . బావా!

చక్ర . వూఁ.

అని . మన అనురాగం ఇలాగే శాశ్వతం కావాలి.

చక్ర . అవుతుంది.

అని . బావా: [తన్మయత్వంగా కళ్ళు మూసుకుంది)
[చక్రవర్తి మెల్లగాలేచి బయటికి వెళ్ళిపోయాడు)

అని . బావా, బావా, బావా, వెళ్ళిపోతున్నావా, నన్నొదిలి వెళ్ళిపోతున్నావా. బావా, [కళ్ళు మూసుకునే కలవరిస్తుంటుంది]
[స్టేజిమీదున్న బ్లూలైట్లు ఆరిపోయి రంగురంగుల లైట్లన్నీ వెలిగాయి]

అని . బావా, బావా, ఒద్దువెళ్ళకు. నన్నొదిలివెళ్ళకు [కలవరిస్తుంటుంది]
[బయట్నుంచి మురళీధర్, చంద్రం, ఆనంద్ వచ్చారు.

ముర . అనితా, అనితా!

అని . ఒద్దుబావా, నన్నొదిలి వెళ్ళకు.

ముర . అనితా, అనితా!

అని . బావా, [లేచి కూర్చుంది] బావఏడీ?

ముర . బావా!

అని . అవును, పెదబావ, చక్రవర్తిబావ, ఏడీ?

ముర . ఏడీ? ... అనితా, కలగన్నావా?

అని . కల, అవును, కలే. నిజంగా కలే.

మురి . పిచ్చిపిల్లా, పట్టపగలే కలయగంటున్నావన్నమాట.
అవి . అన్నయ్యా, బావవస్తున్నాడు.
ముర . పెదబావే?
అవి . అవును. (సోఫాలో టెలిగ్రాం తీసి) ఇదిగో టెలిగ్రాం [యిచ్చింది)
ముర . [తనలో చదువుకొని] ఎంత సంతోషకరమైన వార్త...
అవి . వస్తున్నాడు. మాబావ రేపిపాటికి వచ్చేస్తాడు. [ఉత్సాహంగా గంతులేస్తూ లోనికెళ్ళింది]
(సీరియస్‌గా చూసి) వస్తున్నాడు.. చక్రవర్తి వస్తున్నాడు.
[టెలిగ్రాం ముక్కలు ముక్కలుగాచింపి] పిచ్చిదానా, బావ వస్తాడు, నిన్ను పెళ్ళిచేసుకుంటాడు, మూడే మూడురోజులునీతో కాపురం చేస్తాడు, ఆ తర్వాత, హ్హా, హ్హా, హ్హా, హ్హా,
చం . స్వర్గానికి వెళ్తాడు, హ్హా, హ్హా, హ్హా, హ్హా
అ . మళ్ళీ తిరిగిరాడు, హ్హా, హ్హా, హ్హా, హ్హా,

[బయట్నుంచి బలరాం వచ్చాడు]
[అతన్నిచూచి అందరూ నవ్వు ఆపారు]

బల . నవ్వు నాలుగు విధాలానష్టం మైడియర్ ఫ్రెండ్స్.
ముర . యస్.... బలరాం.... కమాన్... కమాన్.
బల . (ముందుకొచ్చాడు)
ముర . కూర్చో. (సోఫా చూపించాడు)
బల . మర్యాదలతో కాకా పట్టాలని ప్రయత్నించకు. పిల్చిన కారణం చెప్పు.
ముర . నీతో ముఖ్యమైన పని వుంది.
బల . నువ్వు ఫోన్ చేసినప్పుడే అనుకున్నాను పని ముఖ్యమైందని. ఏమిటాపని?
ముర . అదే ... మరి... మరి ....
బల . నసిగే నాయాళ్ళంటే నాకుమంట. పనిచెప్పు. రేటు నిర్ణయిస్తాను.

ముర . నిలువునా ఒక ప్రాణాన్ని తీయాలి.

బల , కష్టమైన పనే.

ముర . నీకు గూడానా?

బల . అంటే?

ముర . నీపేరు చెపితే పక్షులుకూడా నీళ్ళు త్రాగవు...అలాంటి నీకుకష్ట సాధ్యమయిన పనికూడా వుందా?

బల . మూర్ఖుడా? పని కష్టమైందన్నానుగాని, నాచేతకాదని అనలేదు.

ముర . రేటు చెప్తావా?

బల . నువ్వే చెప్పు.

ముర . పాతికవేలు.

బల . చాలా తక్కువ

ముర . మరో ఐదువేలు చేసుకో.

బల . ఆయుష్షుతీరిన అభాగ్యుడెవరు?

ముర . మా మామయ్య.

బల . ఎవరా మామయ్య

ముర , రాజా విజయేంద్ర భూపతి.

బల . ఓ, కోటీశ్వరుడన్నమాట, మిస్టర్ మురళీధర్ నీప్లాన్ నాకర్థమయింది, ఆకాశానికి నిచ్చెన వేయాలని ప్రయత్నిస్తున్నావ్. ఫలితం కఠినంగా ఉంటుందేమో.

ముర . ఆ విషయం నీకనవసరం.

చం . నీ పనివరకు నువ్వుగాని.

ఆ : అదే మాకు చాలు.

బల . ఓకే, రేటు చాలా ఎక్కువగా వుంటుంది.

ముర : ఎంత?

బల : లక్ష.

ఆ : అమ్మబాబోయ్ లక్షరూపాయలే.

చం : ఒక ప్రాణంవిలువ లక్షరూపాయలా?

బిల : (నవ్వి) మైడియర్ ఫూర్ ఫెలో స్. అది అతిసామాన్యుడి ప్రాణం కాదు. కోటీశ్వరుడి ప్రాణం, దానివెనక కొన్ని కోట్ల విలువగల ఆస్తివుంది. పోయేవాడి ఆస్తివిలువబట్టి వుంటుంది వాడి ప్రాణంవిలువ ఏమంటావ్?

ముర : ఇటీజ్ టూ మచ్.

బిల : వస్తాను (వెళుతుంటాడు)

ముర : ఆగు.

బిల : ఏం?

ముర : నీ కోరిక ప్రకారం లక్షరూపాయలు యిస్తాను. గుట్టుచప్పుడు కాకుండా పని జరగాలి.

బిల ఆ విషయాన్ని గురించి నీకు భయంలేదు. చీకటివ్యవహారాలు ముసుగులో చేయడం నా అలవాటు.

ముర : (కోటుజేబులోంచి డబ్బుతీసి) యిందా అడ్వాన్సు. పదివేలు. (యిచ్చి) పని ముగిసినతర్వాత మిగతా పైకం.

బిల : ఓకే...వస్తాను .. ఆలస్యం అమృతం విషంఅన్నారు. ఈ రాత్రికే పని ముగిస్తాను.

ముర : ఓకే.

బిల : బై బై ... (వెళ్తూ ఆగి) మిస్టర్ మురళీధర్. పని ముగిసిన వెంటనే పైకం నాకందాలి. ఆలస్యం చేయడం నీ ప్రాణహానికి మూలమవుతుంది.

ముర : ఆ భయం నీకక్కరలేదు. నీడబ్బు పువ్వుల్లోపెట్టి నీకిస్తాను. ఓకే.

బిల : ఓకే... వస్తాను (బయటికి వెళ్ళాడు)

చం : కరుణలేని కసాయివాడు.

ఆ : యమకింకరుడు.

ముర : కమాన్. మా మామయ్య తనమీద బిలహాంను నియమించినట్టు బాస్‌కు తెలియజేయాలి. మన రహస్య మందిరానికి వెళ్దాంరండి.

చం : పదవండి.

(మురళీధర్, చంద్రం, ఆనంద్ బయటికెళ్ళారు. కొన్ని క్షణాల అనంతరం బయటనుంచి విజయేంద్రభూపతి వచ్చి సోఫాలో కూర్చున్నాడు)

విజ : (సిగార్ ముట్టించాడు)

అవి : (లోపల్నుంచి వచ్చి భూపతి కాలుస్తున్న సిగార్ లాక్కుని పారేస్తుంది)

విజ : అవితా!

అవి : మామయ్యా, పొగత్రాగడం మీ ఆరోగ్యానికి అంత మంచిదికాదని డాక్టర్‌గారు చెప్పారు.

విజ : డాక్టర్లకేమమ్మా .... అలాగే చెప్తారు.

అవి : మీ ఆరోగ్యాన్ని మీరు చూచుకోవాలిగా.

విజ : అందుకు నువ్వున్నావుగా.

అవి : రండి మామయ్యా చాలా పొద్దుపోయింది. నిద్రపోదురుగాని.

విజ : కాస్సేపు యిక్కడే నిద్రపోతానమ్మా.

అవి : అలాగే (లోపికెళ్ళిపోయింది)

విజ : అవితా!

అవి : ఏమిటి మామయ్యా.

విజ : ఇలారా.

అవి : (దగ్గరగావచ్చింది)

విజ : పెదబాబు రేపే వస్తున్నాడుగదూ.

అవి : అవును.

విజ : వాణ్ని చూచి ఆరు సంవత్సరాలయింది. వాడ్ని చూడాలని నామనసు తహతహలాడుతుంది. నా బాబు ఎలా వున్నాడో!

అవి : రేపీపాటికి బావ మనింట్లో ఉంటాడు.

విజ : అవునమ్మా ... విందులు వినోదాలతో యిల్లు కళకళలాడాలి. రేపు జరగబోయే వైభవం నా బాబు కన్నులకు విందుగాఉండాలి.

అవి : చాలా పొద్దుపోయింది. నిద్రపో మామయ్యా.

విజ : ఏదమ్మా ... నీ తియని కంఠంతో ఒక పాటపాడు.

అవి : అలాగే మామయ్యా.

(భూపతి సోఫాలో వడుంవాల్చి కళ్ళు మూసుకున్నాడు. అవిత పాట పాడుతూ భూపతిని నిద్రపుచ్చుతుంది)

(పాట : - 3) (అవితపాట)

[పాట పూర్తయింది. అవిత మెల్లగాలేచి లోనికి వెళ్ళిపోయింది. కొన్నిక్షణాల తర్వాత బయటినుంచి చంద్రం ప్రవేశించాడు)

చం : సార్. సార్.

విజ : [మేలుకోలేదు)

చం : సార్! సార్!

విజ : [మేలుకొని] ఎవరూ?

చం : నేనేసార్... లాయర్ చంద్రశేఖరాన్ని.

విజ : మీరా?

చం : అవునుసార్. మీరు చెప్పిన ప్రకారం మీ ఆస్తియావత్తూ రెండు భాగాలుగా విభజించి చక్రవర్తి, రవిబాబు పేర్లతో వ్రాశాను.

విజ : మంచిది, ఏదీ వీలునామా?

చం : యిదిగో [యిచ్చాడు]

విజ : (చదువుకొని] వెరీగుడ్ ... [వీలునామామీద సంతకంచేసి చంద్రానికిచ్చాడు] దానిని సాధ్యమైనంత త్వరగా రిజిష్టర్ చేయించండి?

చం : అలాగేసార్.

విజ : వెళ్ళండి.

చం : [బయటికి వెళ్ళాడు]

(విజయేంద్రభూపతి ఫోన్‌లో నడుంవాల్చి కళ్ళుమూసుకున్నాడు, భయంకరమైన సస్పెన్స్ మ్యూజిక్ ప్రారంభమైంది. కొన్ని క్షణాలు గడిచాయి. బయట్నుంచి నిలువెల్లా ముసుగు ధరించిన ఆగంతకుడు ప్రవేశించాడు. కాళ్ళుతప్ప అతని శరీరంలోని యే భాగము బయటికి కన్పించడంలేదు అతని చేతిలో కత్తి తళతళ మెరుస్తూంది]

[ముసుగుమనిషి నక్కవలెనే పులిలా చూశాడు పిల్లిలా విజయేంద్ర భూపతిని సమీపించి కత్తితో గుండెల్లో పొడిచాడు]

విజ : అమ్మో [బిగ్గరగా అరిచాడు]
ముసు : [బయటికి పారిపోయాడు)
విజ : అమ్మో (అంటూ గాయాన్ని చేత్తో పట్టుకొని తూలుతూ పడి పోయాడు)
అవి : (లోపల్నుంచి వచ్చి భూపతిని చూచి కెవ్వున అరిచింది]
విజ : అమ్మో .... అవితా. (బాధగా అన్నాడు)
అవి : మామయ్యా .... (ఏడుస్తూ అతన్ని సమీపించింది)
విజ : అ..వి..తా, జాగ్రత్త, ((ప్రాణం విడిచాడు)
అవి : మామయ్యా (మీదపడి ఏడుస్తుంది)
(బయట్నుంచి మురళీధర్, రవికాంత్ ప్రవేశించారు)
ముర : అం హాత్య!
రవి : నాన్నా (నిర్ఘాంతపోయి) నాన్నా! (మీదపడి ఏడుస్తాడు)
(మురళీధర్ టేబుల్‌ను సమీపించి రిసీవర్ ఎత్తి నెంబర్ డయల్ చేశాడు.

అవి : మామయ్యా (ఏడుస్తుంది)

రవి : నాన్నా (ఏడుస్తాడు)

ముర : (ఫోన్‌లో) హలో, పోలీస్‌స్టేషన్, విజయేంద్రభూపతిగారి యింటిదగ్గర్నుంచి మాట్లాడుతున్నాను ఇన్‌స్పెక్టర్ రాజారాం

గారా! నమస్కారం సార్... మా మామయ్యను యెవరో హత్య చేశారు, అవును సార్, మీరు వెంటనే రావాలి. [రిసీవర్ పెట్టేశాడు)

అవి : మామయ్యా! (ఏడుస్తుంది)

రవి : నాన్నా (ఏడుస్తుంటాడు)

మురి : ఊరుకోరవీ, ఊరుకో! యిలా జరుగుతుందని ఎవ్వరూ అనుకో లేదు.

రవి : చూడు బావా. (ఏడుస్తూ) నిష్కళంక ప్రేమమూర్తియైన నాన్నను చంపడానికి ఏ దుర్మార్గుడికి చేతులు వచ్చాయో.

మురి : బావా!

రవి : చీమకయినా అపకారంచేయని శాంతమూర్తిని చంప పగసాధించా. అనుకున్నాడా కిరాతకుడు.

మురి : ఏ పాపాత్ముడు యీ కిరాతకానికి పాల్పడ్డాడో.

రవి : నిజంగా వాడు కిరాతకుడే బావా.... నాన్నా (మీదపడిఏడుస్తాడు)
(బయట్నుంచి ఇన్స్పెక్టర్ రాజారాం, కానిస్టేబుల్ వస్తారు)

మురి : రండి ఇన్స్పెక్టర్‌గారూ! రండి,

రాజా. (శవాన్ని పరీక్షించి) హూ. పెద్ద ఘోరమే జరిగింది. మిస్టర్ మురళీధర్ మీకెవరిమీదన్నా అనుమానంగా ఉందా?

మురి : లేదుసార్. మామయ్యంటే మంచికి మారుపేరు. నౌకరు మొదలు కన్నబిడ్డల వరకు అందరూ మామయ్యను అభిమానించే వాళ్లే. ప్రాణంతో సమానంగా చూచేవాళ్ళు.

రాజా; ఐ, సీ, మరి, హత్యకు కారణం ఊహించగలరా.

మురి : ఊఁ హూ,

రవి . ఇన్స్పెక్టర్ ..... వాణ్ని వదలకండి ... మా నాన్నను చంపిన ఆ కిరాతక చక్రవర్తిని పట్టి ఉరితీయండి,

రాజా, రవిబాబు.

రవి . అవును యిన్స్పెక్టర్ .... ఎంతడబ్బు ఖర్చయినా సరే... వాడు శిక్షింపబడాలి.

రాజా: రవిబాబు .... ఆవేశపడకండి... మా డ్యూటీ మేముచేస్తాం.

రవి : నాన్నా (ఏడుస్తాడు మీదపడి)

రాజా: రవిబాబు. మీ నాన్నగారిమీద మీకున్న ప్రేమాభిమానాలు మాకు తెలియనివి గావు. మీరు శాంతించండి.

రవి : శాంతి యింకెక్కడి శాంతి.... రేపు అన్నయ్య వస్తాడు... తమ్ముడూ అని అడిగితే ఏం సమాధానం చెప్పాలి

రాజా: రవిబాబూ. విధివిలాసం విచిత్రమయింది. దాన్ని మార్చేశక్తి ఎవ్వరికి లేదు. మా కర్తవ్యాన్ని మేము పాటిస్తాం. సాధ్యమయినంత త్వరగా హంతకుడ్ని పట్టి శిక్షింపచేస్తాం.

రవి : ఇన్‌స్పెక్టర్! వాడు ఉరికంబమెక్కిన మరుక్షణంలో మీ డిపార్ట్‌మెంట్ ఫండ్‌కు ఐదులక్షలు బహుమానం యిస్తాను.

రాజా: థాంక్స్.

(బయట్నుంచి చంద్రశేఖరం, ఆనంద్ వచ్చారు]

ఆ . ఎంత ఘోరం జరిగింది.

చం . ఇంతటి ఘోరం జరుగుతుందని కలలోగూడా అనుకోలేదు.

రాజా. మీరు? (ఆనంద్‌ను ప్రశ్నించాడు]

ఆ . నా పేరు ఆనంద్... భూపతిగారి ఫ్యామిలి డాక్టర్‌ని.

రాజా. మీ నివాసం?

ఆ . భూపతిగారి ఔట్‌హౌస్‌లోని ఒక గదిలో ఉంటున్నాను.

రాజా. మీరు.

చం . నేను లాయర్‌ని. నాపేరు చంద్రశేఖరం. నేనుగూడా అదే ఔట్‌హౌస్‌లోని మరొక గదిలో ఉంటున్నాను. మీజీపు రావడంచూచి ఏమయిందోనని ఇలా వచ్చాము.

రాజా. హూం.... (టెలిఫోను రిసీవర్ ఎత్తి) హలో.... గవర్నమెంట్ హాస్పిటల్.... ఇన్‌స్పెక్టర్ రాజారాం హియర్... భూపతిగారు హత్య చేయబడ్డారు.... వెంటనే శవాన్ని పోస్టుమార్టం చేయాలి. అంబులెన్స్ పంపించండి, థ్యాంక్స్. [రిసీవర్‌పెట్టి శవాన్ని సమీపించాడు)

రాజా. కానిస్టేబుల్

కాని. యస్ సార్

రాజా. యిక్కడే వుండు నేను పదినిముషాల్లో వస్తాను.

కాని. యస్ సార్.

[రాజారాం గబగబా బయటికెళ్ళాడు]

రవి. నాన్నా (ఏడుస్తుంటాడు)

అని. మామయ్యా (ఏడుస్తుంది)

[తెర వాలుతుంది]

(రెండవరంగం - ప్రారంభం)

[అది ఉద్యానవనం. రంగురంగుల పూల గొల్లలతో, వివిధజాతుల పూల తిగెలతో ముచ్చటగా ఉంటుంది. స్టేజిమధ్యగా సిమెంట్ బెంచీవుంది. నీలాకాశపు నడివీధిలో అర్ధచంద్రుడు చిరునవ్వుతో నరుగెడుతున్నాడు. తారలు మిలమిలలాడుతూ చంద్రునితో సరసా లాడుతున్నయి. మధ్యమధ్యన మబ్బు తునకలు చంద్రుణ్ని దాచి, మళ్ళీ తమదారిన తాము వెళ్ళిపోతునాన్నయి.]

[తెరలేచింది]

[అగ్గిరాముడు బెంచీమీద కుడికాలుమోపి నిలబడి వున్నాడు. అతని ఎడమచేయి చెంపకి ఆన్చివుంది. కుడిచేయి కుడికాలుమీద పెట్టాడు. అతని మెడలో బులెట్స్ బెల్టువుంది, వీపుకు తుపాకీ వుంది. కుడిచేతిలో హంటర్ వుంది. చూడగానే అతడొక బంది పోటు దొంగని గుర్తించవచ్చు]

[స్పాట్‌లైట్ అతనిమీదకు ఫోకస్ చేయబడింది]
[తెరలో వ్యాఖ్యానం వినిపిస్తుంది]

మనిషిని మనిషిగా బ్రతుకనివ్వని ఈస .. జంలో ఎందరో ఎదురు తిరిగి సమాజాన్ని ఎదిరించారు. సమాజ శక్తికి తట్టుకోలేక విరం కుశ ప్రభుత్వాన్ని, సమాజాన్ని చాటుదెబ్బ తీయాలని దొంగ లుగా, బందిపోటు దొంగలుగా, విప్లవకారులుగా మారిపోయారు. మన గుండెలలో చిరస్థాయిగా నిల్చిన అల్లూరి సీతారామరాజు, భగత్‌సింగ్, సుభాస్ చంద్రబోస్ వంటి మహావీయులు గూడా

తున్నారు. స్వాతంత్ర్యం కావాలని, సర్వమానవ సౌభ్రాతృత్వం రావాలని, దేశంలో శాంతి, అభ్యుదయం నెలకొల్పాలన్నదే వారి ధ్యేయం. సర్వ మానవాళికోసం ప్రాణాలర్పించిన మహనీయులు వారు. కాని మననాయకుని ఆశలు, ఆశయాలు వేరు. బానిసత్వాన్ని రూపు మాపాలని, మన సంపదపై ప్రతి భారతీయునికి అనుభవించే హక్కు ఉందని, ధనిక పేదవర్గాలు ఉండరాదనేదే ఇతని లక్ష్యం. అందుకే ప్రజానాయకుల ముసుగులో దాగిన రాజకీయ నాయకులు స్వార్థతత్వాన్ని వ్యాపారం పేరుతో దేశంలో జరిగే అన్యాయార్జనను అరికట్టాలని సమాజాన్ని ఎదిరించాడు. ధనవంతుల భవనాలు కొల్లగొట్టాడు. ధనాగారాలు దోచుకున్నాడు. పేద ప్రజానీకాన్ని ఆదుకున్నాడు.

ఫలితం:

దొంగగా ముద్రవేసింది సమాజం. బందిపోటుగా బిరుదు ఇచ్చింది ప్రభుత్వం, అతని ఆశయాన్ని విరోధించాలని ప్రయత్నించిన ఎందరో అతని తుపాకి గుళ్ళకు ఆహుతయ్యారు. అతని కత్తికి తమ కుత్తుకలు బలి ఇచ్చారు. ఒక చోటునుండి మరొక చోటుకు ఒక రాష్ట్రం నుండి మరొక రాష్ట్రానికి తరలుతూ భారతదేశాన్ని గడ గడ లాడిస్తున్న అగ్గిరాముడు అతడే.

రాము: హ, హ, హ, హ, హ, [వికటంగా నవ్వాడు]

తెరలో: ఆ నవ్వులో క్రూరత్వం దాగివుంది అతని చూపులో అగ్ని జ్వాల రేగుతుంది. భారతదేశ సిరిసంపద సమానంగా అందరికి అందించాలన్నదే అతని న్యాయమయిన కోరిక.

రాము: అవును వంతులు వేసుకొని వాటాలు పంచుకోడానికి ఎవరబ్బ సొమ్ము ఈ సంపద. భారతమాత అనగు ముద్దుబిడ్డల పైన

మాలో కొందరు ధనవంతులా? కొందరు దరిద్రులా? ఎందుకీ తేడా? పంచభక్ష్యపరమాన్నాలను భుజిస్తూ మెత్తని పట్టుపాన్పుమీద పవళించి గిర్రున తిరిగే గాలిపంకాల క్రింద స్వర్గ సౌఖ్యాన్ని అందుకునే వారు కొందరయితే, గుప్పెడు మెతుకులకు నోచుకోక. అరడుగుల స్థలం అందుబాటులో లేక ఆకలాకలని అడుస్తూ ప్లాట్ ఫారంమీద పొర్లాడే దరిద్రులు కొందరా? ఎందుకీ తేడా? ఏమి లేదు. భారతజాతి అంతా ఒకటే. సస్యశ్యామలమయిన మన సంపద అనుభవించే హక్కు అందరికీ వుంది, ఈ సమాజం మారే వరకూ, తేడా తొలగే వరకూ, నిద్రపోను. ఐశ్వర్యవంతుల ఇనప్పెట్టెలలో బంధీగా మగ్గుతున్న ధనలక్ష్మిని చెరవిడిపించి, స్వేచ్ఛనిస్తాను, పాతరలలో పాతుకుపోయున్న ధాన్యలక్ష్మిని బానిసత్వం నుండి విముక్తి చేస్తాను హ—హా—హ— అదే ఈ అగ్గిరాముడు లక్ష్యం— అదే ఈ అగ్గిరాముడు లక్ష్యం— అదే ఈ అగ్గిరాముడు లక్ష్యం— హ—హా—హా—

[వికటంగా నవ్వుతూ వుంటాడు. తెరలో టైటిల్స్ ప్రారంభ మవుతాయి]

[రాముడు స్టిల్ గా మారిపోతాడు.)

శ్రీ —————————— సమర్పించు.
సస్పెన్సు మరియు డిటెక్టివ్ నాటక ప్రదర్శనం.
"అగ్గిరాముడు"
రచన : యం. ఏ, బాషా.
ఇందలి పాత్రలు – పాత్రధారులు
రవికాంత్ –
మురళీధర్ –
విజయేంద్రభూపతి–
నాగన్న –
భీమన్న –

బందిపోటు బలరాం -
డాక్టర్ ఆనంద్ -
లాయర్ చంద్రశేఖర్ -
ఇనస్పెక్టర్ రాజారాం -
కానిస్టేబుల్ -
అనిత -

మరియు

అగ్గిరాముడుగా, డాక్టర్ చక్రవర్తిగా, ద్విపాత్రాభినయంలో మీ అభిమాన నటుడు. - - - - - -

సాంకేతిక బృందము :

డ్రస్ -
మేకప్ -
మైక్ -
లైటింగ్ -
ప్లేబాక్ -
అలంకరణ -
నిర్వహణ -
సమర్పణ -
సంగీతం -
డైరెక్షన్ -

[టైటిల్స్ పూర్తయినయి. రాముడు వికటంగా నవ్వుతుంటాడు)

రాము: హా...హా...హా..హా..

[నాగన్న, భీమన్న డాక్టర్ చక్రవర్తిని బంధించి లాక్కొస్తారు. అతని ముఖం కన్పించకుండా ముసుగు వుంటుంది.]

నాగ : సర్దార్.

భీమ : సర్దార్.

రాము: హుఁ
నాగ : దొరికాడు సర్దార్.
భీమ : చిక్కాడు సర్దార్.
నాగ : దొరికాడు
భీమ : చిక్కాడు
నాగ : కాదు దొరికాడు.
భీమ . కాదు చిక్కాడు
నాగ . దొరికాడురా అంటే
భీమ , చిక్కాడురా అంటే
నాగ : ఒరేయ్ దొరికాడురా
భీమ : ఒరేయ్ చిక్కాడురా
నాగ : ఛీ. వెధవా దొరికాడు.
భీమ , ఛీఛీ వెధవా చిక్కాడు.
రాము. ఎవడ్రా వాడు.
నాగ ; చక్రవర్తి
భీమ : డాక్టర్ చక్రవర్తి అమెరికా నుంచి వచ్చాడట సర్దార్ వీడి ఖర్మ కాలి మనకు దొరికాడు.
రాము: నీపేరు [ముసుగులో వున్న వ్యక్తిని అడిగాడు)
ముసు: చక్రవర్తి.
రాము: నీ తండ్రి పేరు.
ముసు: విజయేంద్ర భూపతి
రాము. ఓ..., కోటికి పడగెత్తిన కోటీశ్వరుడు విజయేంద్రభూపతి గారి ముద్దుల కుమారుడివా? అమెరికాలో ఆరు సంవత్సరాలు శిక్షణ పొంది క్యాన్సర్ స్పెషలిస్టుగా ఇండియాకు తిరిగొచ్చిన డాక్టరు చక్రవర్తివి నువ్వేనన్నమాట.
ముసు: అవును.
నాగ : సర్దార్ చిత్రం

భీమ : సర్దారు విచిత్రం

నాగ : అయ్యారే విచిత్రం

భీమ : భళారే విచిత్రం [పాతకాడు]

రాము: ఏమిట్రా విచిత్రం

నాగ : ముమ్మూర్తులా మీరు వీడిలాగే వున్నారు చిత్రం

భీమ : ముమ్మూర్తులా వీడు మీలాగే వున్నాడు చిత్రం,

రాము: ఏమన్నారు?

నాగ : అవును సరదార్ వీడు అచ్చం మీలాగే వున్నాడు

భీమ . వీడ్ని చూసి మీరే అనుకున్నాం.

నాగ . అనుకుని వచ్చులో కాలేశాం;

భీమ . కాలేసి తీసుకోలేక దచ్చాం.

నాగ . కావలిస్తే చూడండి

[రాముడు ముఖం వరకు మునుగుతొలగించి నిముషంపాటు అతని ముఖంలోకి చూశాడు; యధాప్రకారం మునుగేశాడు.]

[రాముడు మునుగులోంచి చంద్రవర్తి ముఖం చూచే సమయంలో అతని ముఖం ప్రేక్షకులకు కనిపించరాదు ]

రాము. అవును వీడు అచ్చం నాలాగే వున్నాడు,

నాగ . ఉన్నాడు

భీమ . కాదురా దద్దమా

నాగ ; ఏమిట్రా వాజమ్మా

భీము : మన సర్దారే వాడిలాగ వున్నాడు.

నాగ : అవున్రోయ్.

రాము: [ఆలోచిస్తూ అటూ యిటూ తిరిగి] హ్హా, హా, హ్హా, హ్హా, [వికటంగా నవ్వాడు.

నాగ : సర్దార్ నవ్వుతున్నార్రా.

భీమ . ఏడుస్తున్నాడని నేనన్నానా,

రాము. నాగన్నా.
నాగ . సై సరదార్.
రాము. భీమన్నా.
భీమ . సై సరదార్.
రాము. అవకాశం దొరికింది. వీళ్ళిద్దరినీ ఆధారం చేసుకోవాలి. వీళ్ళి బంధించి చక్రవర్తిగా వీళ్ళ భవనంలో పాగావేయాలి. కోట్లకొలది ఆస్తి హస్తగతం చేసుకోవాలి ఏమంటారు.
నాగ . ఏమంటావురా?
భీమ ? నువ్వేమంటావురా?
నాగ . సై.
భీమ . సై.
రాము. వీడిని తీసుకెళ్ళి మన రహస్య గృహంలో బంధించండి. వూ.
ముకు, వదలండి... నన్ను వదలండి... దుర్మార్గులారా?వదలండి [గింజుకుంటుంటాడు.]
నాగ . రారా భడవా.
భీమ . పదరా ఉడతా.

[స్టేజీ మీదున్న లైట్లు ఆరిపోయాయి.]

* * *

[స్టేజీ మీదున్న లైట్లు వెలిగాయి.]

[అనిత నిరుత్సాహంగా బెంచిమీద కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తుంటుంది. ఆమె ముఖంలో విచారరేఖలు అలముకొని వున్నాయి.

[అనిత నిరుత్సాహంగా పాటపాడుతుంది.) [పాట 4]

[పాట పూర్తయింది. ఒక ప్రక్కగా రవికాంత్ ప్రవేశించాడు]

ర . అనితా,

అనిత. [పరధ్యానంగా పలకలేదు]

ర . అనితా.

అనిత. [ఉలిక్కిపడి] ఆఁ నువ్వా బావా.

రవి . ఏమిటి పరధ్యానం.

అనిత. ఏమీలేదు.

రవి . ఇల్లొదిలి యిలా వచ్చావేం?

అనిత. ఇంటి దగ్గర ఏమీ తోచక ప్రశాంతికోసం వచ్చాను.

రవి . నువ్విలా విచారంగా వుంటే నాకెంతో బాధగా వుంది అనితా.

అనిత. విచారంగాక ఏముంది బావా. కన్నబిడ్డగా ఆదరించిన మామయ్య అకస్మాత్తుగా మరణించారు. వస్తున్నానని టెలిగ్రాం యిచ్చిన పెద బావ ఇంత వరకూ రాలేదు.

రవి . నేడో రేపో అన్నయ్య తప్పక వస్తాడు.

అనిత. ఆ నమ్మకంతోనే పదిహేనురోజులుగ ఎదురు చూస్తున్నాను. టెలిగ్రాం అంది పదిహేను రోజులు దాటాయి. బావ యింకా రాలేదు.

రవి , మార్గమధ్యంలో ఏదన్నా పనుండి ఆగాడేమో.

అనిత ఏమో.

రవి . సరే రా వెడదాం.

అనిత. నువ్వెళ్ళు బావా. నేను తర్వాత వస్తాను

రవి . చూడు అనితా గతాన్ని మర్చిపోయి నవ్వుతూ త్రికాలి గాని ఇలా బాధపడుతూ కూర్చుంటే విప్రయోజనమే. నువ్వు ప్రతి క్షణం నవ్వుతూ, అందర్నీ నవ్విస్తూ వుండాలి. అప్పుడే అన్నయ్య నిన్ను చూసి మురిసిపోతాడు.

అనిత బావా

రవి , నేను చెప్పేది యదార్థం. నాన్న మరణవార్త తెలియగానే కృంగిపోతాడు. నువ్వు నవ్వుతూ అతన్ని మురిపించాలిగాని, నువ్వే యిలా అశోక వనంలో సీతా దేవిలా వుంటే...

అనిత. లేదు బావా. పెదబావకోసం నా ప్రాణాల్నయినా యిస్తాను. బావ బాధపడకుండా చూస్తాను.

రవి . నేను వస్తాను

అనిత. అన్నట్టు నువ్విలా వచ్చావేం?

రవి . మా స్నేహితుడొకడ్ని ఇంటి దగ్గర డ్రాప్‌చేసి వస్తున్నాను. ఇంతలో ఏ కారు ఇలా రావడం చూశాను ఎక్కడికెడుతున్నావో అర్థం కాలేదు. ఒంటరిగా రావడం మంచిది కాదని ఇలావచ్చాను.

అనిత. ఓ!

రవి : నేను వెళుతున్నాను. ప్రొద్దుగూకకముందే వచ్చేయ్.

అని : అలాగే

రవి : వస్తాను (వెళ్ళిపోయాడు.

(అనిత బెంచిమీద కూర్చుంది. తెరలో పోలీస్ విజిల్స్ విన్పిస్తాయి. అనిత ఉలిక్కిపడి ఆ ప్రక్కగా చూస్తుంది. రాముడు పరుగెత్తుకొచ్చి అనితను చూస్తాడు....మళ్ళీ విజిల్స్ విన్పిస్తాయి. పరుగెత్తుకెళ్ళి పూలచెట్లలో దాక్కుంటాడు అనిత కళ్ళప్పగించి చూస్తుంటుంది. విజిల్స్ ఊదుకుంటు కానిస్టేబుల్స్ ఇద్దరు వస్తారు. నలువైపులా చూస్తారు)

1వ కాని : (అనితను చూసి) దొంగ! దొంగ! దొంగ!

2వ కాని ; దొంగ దొంగ దొంగా!

1వ కాని : ఏడిరా దొంగ?

2వ కాని : ఏడి?

(అంతలో ఇన్‌స్పెక్టర్ రాజారాం ప్రవేశించాడు)

రాజా : ఓ...అనితగారా!

అని : నేనే ఇన్‌స్పెక్టర్

రాజా : ఇలా వచ్చారేం?

అని : మనసు చికాకుగా ఉంది. గాలికోసం వచ్చాను

రాజా : ఐసీ! అనుకున్నట్టు మర్చాను...ఇటుగా ఒక దొంగ పరిగెత్తు కొచ్చాడు. ఎటువెళ్ళాడో చూశారా!

అని : దొంగా!

1వ కాని : అవును దొంగే

2వ కాని : అక్షరాలా దొంగే

అని : అదిగో...అటుపారిపోయాడు. (ఒక్క ప్రక్కగా చూపుతుంది)

రాజా : వూఁ... పదండి... వాడ్ని వదలకండి.

1వ కాని : 2వ కాని : యస్‌సార్ (అంటు అనిత చూపిన వైపు వెళ్ళారు)

రాజా : వస్తానండి (అంటూ తనూ వెనుకగా వెళ్ళాడు)

(అంతవరకు దాగివున్న రాముడు అనితను సమీపించాడు)

రాము : ఎవరున్నావూ?

అని : అది నేనడగాల్సిన ప్రశ్న

రాము : ఏమిటా దిరావణం ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?

అని : ఒక దొంగతో

రాము : నోర్మూయ్... మంచి మర్యాద లేకుండా ఏమిటా వాగుడు.

అని ; మంచి... మర్యాద (వెళ్తుంటుంది)

రాము : ఆగు!

అని : (ఆగింది)

రాము : నువ్వు ఎవరయినా నాకనవసరం.పోలీసుల బారినుండి నన్ను రక్షించావు. ప్రత్యుపకారంగా ఏం కావాలో కోరుకో.

అని : అడిగింది ఇస్తావా?

రాము : అడిగిచూడు నీకే తెలుస్తుంది.

అని : లెకలవ్యుడు ద్రోణుని కిచ్చిన గురుదక్షిణ ఏమిటో తెలుసా?

రాము : బొటన వ్రేలు

అని : మవ్వివ్వ గలవా?

రాము : (కత్తితీసి బొటనవ్రేలు కోసుకో బోయాడు)

అవి : అగు

రాము : (ఆగాడు)

అవి : మాట తప్పని మనిషిలా ఉన్నావే

రాము : మాటిచ్చి తప్పడం ఈ అగ్గిరాముడి జాతకంలో లేదు.

అవి : ఆ(: నువ్వు అగ్గిరాముడివా

రాము : అవును,

అవి : బందిపోటు దొంగ అగ్గిరాముడివి నువ్వా

రాము : అవును.

అవి : ఆ( (భయంగా వెళ్ళిపోయింది)

రాము : ఆగు. నావల్ల నీ కెటువంటి ప్రమాదము రాదు. నా ప్రాణదాతకు హాని చేసేటంతటి విశ్వాసఘాతకుడ్ని కాను. నీకేం కావాలో కోరుకో.

అవి : నాకేం వద్దు.

రాము : అలా వీల్లేదు. కోరుకో వలసింది

అవి : సమయం వచ్చినప్పుడు కోరుకుంటాను.

రాము : సరే,

(నాగన్న, భీమన్న చక్రవర్తిని లాక్కొస్తారు. అతనికి ముసుగు వుంటుంది)

నాగ : సర్దార్: ఈ భడవ పారిపోవాలని ప్రయత్నించాడు,

భీమ : మళ్ళీ పట్టుకున్నాం.

రాము : ఏరా? పారిపోవాలనుకున్నావా?(అంటు ముసుగుమనిషి చెంప మీద కొడ్తాడు)

నాగ : రోగం కుదిరిందా?

భీమ : తిక్క వదిలిందా?

నాగ : పారిపోతావా (లాగి చక్రవర్తిని కొట్టాడు ఆ దెబ్బ భీమన్నకు తగిలింది)

భీమ : పారిపోతావ్రా (ఆగి చక్రవర్తిని కొట్టాడు, ఆ దెబ్బ నాగన్నకు తగిలింది)

రాము : హూఁ వీడి కాళ్ళుచేతులు కట్టి, కటకటాల వెనుక పడేయండి.

నాగ : సైఁ సర్దార్.

భీమ : సైఁ సై సర్దార్

(చక్రవర్తిని లాక్కెళ్ళారు)

అని : ఎవరతను?

రాము : ఒక నిర్భాగ్యుడు

అని : ఎందుకతన్ని బంధించారు.

రాము : వాడి అదృష్టాన్ని అందుకోవాలని

అని : అంతటి అదృష్టవంతుడా!

రాము : అవును.

అని : నాకు మాటిచ్చావు గుర్తుందా?

రాము : మర్చిపోలేదు. నీకేది కావాలో ఎప్పుడు కోరుకున్నా ఇస్తాను,

అని : ఇప్పుడే కోరుకుంటాను.

రాము : ఏం కావాలి.

అని : ఆ నిర్భాగ్యుణ్ని వదిలేయ్.

రాము : అమ్మాయ్.

అని : అగ్గిరాముడు మాట తప్పడు గదూ.

రాము : (అనిత ముఖంలోకి సూటిగా చూస్తాడు)

అని : ఏమిటలా చూస్తున్నావు. వద్దంటున్నా మాటిచ్చావు...ఏమంటావ్?

(నాగన్న, భీమన్న వచ్చారు)

నాగ : నాయాల్ని కట్టి పడేశాం.

భీమ : నాయాల్ని కటకటాల వెనుక తోసేశాం.

అని : ఏం మాట్లాడవేఁ.

రాము : హూఁ....సరే.... ఏమైనా ఇచ్చిన మాట తప్పను. నాగన్నా, భీమన్నా... చక్రవర్తిని వదిలెయ్యండి.

నాగ : భీమ ! సర్దార్

రాజా . హూఁ...వదిలేయండి.

అని : అతని పేరేమిటన్నావ్?

రాము : చక్రవర్తి

అని : చక్రవర్తా?

రాము : అవును...డాక్టర్ చక్రవర్తి...విజయేంద్ర భూపతి కుమారుడు.

అని : బావా?

రాము : ఏమిటి- చక్రవర్తి నీ బావా?

అని అవును

రాము : నక్కను తొక్కొచ్చావ్? (నవ్వి) నాగన్నా, భీమన్నా చక్రవర్తిని పంపించే వరకు ఈ అమ్మాయిని జాగ్రత్తగా చూస్తుండండి. అతను రాగానే మన నివాసానికి వచ్చేయండి.

నాగ : పై సర్దార్

రాము : అనితా! నీ బావను పంపుతాను. తీసుకెళ్ళు

అని : అలాగే

(రాముడు వెళ్ళిపోయాడు ...నాగన్న భీమన్న అనితకు చెరొక ప్రక్క నిలబడి ఆమె ముఖంలోకి చూస్తుంటారు)

అని . ఏమిటలా చూస్తున్నారు?

నాగ . మా సర్దార్ ఇలాగే చూస్తుండమన్నారు.

భీమ : నీ పేరేమిటమ్మా?

అని : ముక్కోటి ముత్తమ్మ. [కోపంగా అంది)

నాగ : చాలా బాగుంది.

భీము. ముత్తమ్మ .... పెళ్ళయిందా?

అని : కాకపోతే పెళ్ళి చేస్తారా?

నాగ : హూఁహూఁ ... చెయ్యం .... పేపే చేసుకుంటాం. ఏరా!
భీమ. అవును చేసుకుంటాం.
నాగ : మీకు పెళ్ళయిందా?

అవి : లేదు.
భీమ : పిల్లలున్నారా?
అవి : ఉన్నారు.
నాగ : యెంతమంది.

అవి : నలభయిమంది.
భీమ : నీ వయసెంత?
అవి : యిరవై.
భీమ : వయసు యిరవై పిల్లల సంఖ్య నలభయి.

నాగ : అంటే సంవత్సరానికి ఇద్దర్ని కన్నానన్నమాట. సూపర్ వన్ కన్నమాట.

అవి : ఏయ్
భీమ : ఓయ్.
అవి : మీకు బుద్ధుందా?
నాగ : ఒకప్పుడుండేది. దాన్ని మా నాన్నకిచ్చాను.
భీమ : నేనూ మా అన్నకిచ్చాను.

అవి : పెళ్ళికాని ఆడపిల్లను యిలా అడగటానికి సిగ్గులేదు.
నాగ : పెళ్ళయిన వాళ్ళను అడిగితే మక్కెలు విరుగుతయి.
అవి : పెళ్ళికాకుండా పిల్లలు యెలా పుట్టారనుకున్నారు.
భీమ : ఓస్ ఓస్ ... ఊరుకోవమ్మా ముత్తమ్మా... భారతంలో కుంతి దేవి పెళ్ళికాకుండా కర్ణుడ్ని కనలా.

నాగ : ఊర్వశి డాన్సుచేసి శకుంతలను కనలా.
అవి : మీతో చచ్చేచావు వచ్చిపడిందే
నాగ : నామాట విని కన్నుమూసుకో. సుఖపడిపోతావ్.

భీమ : ఏదీలావ్. ఆడదాన్ని సుఖపెట్టడం నీకేం తెలుసురా తద్దమ్మా
నాగ నీకు తెలుసంట్రా వాజమ్మా. ఇదిగో ముత్తమ్మా ... నామాటవిని నన్నే చేసుకో.

భీమ : ఒద్దొద్దు .... నన్నుచేసుకో.... నన్ను చేసుకున్నావంటే రోజూ కిలో శనక్కాయలు యిప్పిస్తాను.

నాగ : నన్ను చేసుకున్నావంటే కిలో జిలేబీలు యిప్పిస్తాను.
అని : వీల్లేదు. నేను చేసుకునేది మా బావనే
నాగ : వాడెవడ్రా మధ్య.
భీమ : అన్నది వినబడలా ... వాళ్ళబావ ...ఉ.
నాగ : నాకంటే అందగాడా.
అని : అవును.
భీమ : నాకంటే సాహసవంతుడా?
అని : అవును.
నాగ : నాకంటే బాగా పాడగలడా?
అని : గలడు.
భీమ . నాకంటే బాగా ప్రేమించగలడా?
అని : గలడు.
నాగ . నాకంటే బాగా ఏడ్వగలడా?
అని . గలడు.
నాగ అయితే వాడ్ని ఏడ్వమను.
అని : అందుకు నీకు మ ళ్లీపాటే.

(యింతలో రామదుపెళ్ళిన పై పునంటి చక్రవర్తి ప్రవేశించాడు)

నాగ . చక్రవర్తి వచ్చాడురోయ్.

భీమ . మనం పెళ్లాం వదరోయ్.

నాగన్న, భీమన్న వెళ్ళిపోయారు.

అవి . బావా!
చక్ర. బావా! .... ఎవరున్నావ్వు?
అవి . నేనేబావా.
చక్ర. అంటే?
అవి . నన్ను గుర్తించలా.... నేనేబావా ... నీ అవితను.
చక్ర. నువ్వు .... అవితవా?
అవి . అవునుబావా.... నేను నీ అవితనే.

చక్ర. (పరీక్షగాచూచి] అవును... నువ్వు నా అవితవే.... అవితా

(చేతులు చాచాడు)

అవి . బావా! (సమీపించింది)
చక్ర. అవితా! (దగ్గరగా తీసుకున్నాడు]
అవి . బావా [అంటూ అతని గుండెల్లో చేరింది)

చక్ర. ఎంతగా మారిపోయావ్ అవితా! ఆరుసంవత్సరాల క్రితం నేను అమెరికా వెళ్ళినప్పటి అవితకు, ఈనాటి అవితకు వేషంలో ఎంత మార్పు. ఆనాటి అవిత లంగాఓణీలు వేసేది. ఈనాటి అవిత చీరెలు కడుతుంది.

అవి . ఆమార్పు నీలోగూడా వచ్చిందిబావా! ఆనాటి బావ లాల్చీ పైజమావేస్తే, ఈనాటి బావ సూటు వేస్తున్నాడు.

చక్ర. మార్పు నా వేషానికే గాని మనసుకుగాదు.
అవి . నేను అంతేబావా! నా మనసులో ఉన్నది నీ రూపమే.

చక్ర. నా మనసులో దాగింది నీ రూపమే.
అవి . అవిత నీ కోసమే.
చక్ర. బావ నీ కోసమే.

(దగ్గరగా లాక్కున్నాడు. అవిత సిగ్గుతో దూరంగా వెళ్ళింది. చక్రవర్తి పాట పాడతాడు. అవిత అతన్ని అనుసరించింది)

(పాట - 5)   [చక్రవర్తి. అనిత డ్యూయెట్)

[పాటపూర్తయింది. అనిత చక్రవర్తి హృదయంపైవాలింది.)

అని . బావా!

చక్ర. వూఁ.

అని : నన్ను యిలాగే శాశ్వతంగా గుండెలో దాచుకుంటావుగదూ!

చక్ర: అందుకు అనుమానమా?

అని : నమ్మకముంది.

చక్ర: అలాంటప్పుడు అనుమానాలకు తావుండరాదు.

అని : బావా (విచారంలోకి దిగజారింది)

చక్ర: ఏమిటి అనితా?

అని : మరి .... మరి ....

చక్ర: చెప్పడానికి సంకోచిస్తావేం? చెప్పు.

అని : ఎలా చెప్పమంటావు బావా?

చక్ర : ఏమిటది?

అని : ఆరుసంవత్సరాల తర్వాత తిరిగొచ్చిన నీ గౌరవార్థం, విందులు వినోదాలు ఏర్పాటుచేయడానికి బదులుగా కన్నీటిలో ముంచే విషాద దుస్సంఘటనతెలియపర్చవలసి వచ్చింది.

చక్ర : ఏమిటి అనితా?

అని : మామయ్యా .... (బాధగా అంటుంది)

చక్ర : విన్నాను అనితా! రాముడు తన అనుచరులతో చెపుతుండగా విన్నాను. ఆ రోజునుంచి నామనసు నా స్వాధీనంలో లేకుండా పోయింది. నా భవిష్యత్తుకోసం పునాదివేసి అమెరికా పంపి నన్నొక మనిషిగాతీర్చిదిద్దిన నా దైవాన్ని ఏ కిరాతకుడు దూరం చేశాడో.

అని : బావా!

చక్ర : అనితా! చదువు ముగించుకొని నాన్నను చూడాలని పరుగు పరుగున వచ్చాను. నా ఆత్రానికి అర్థం, పరమార్థం లేకుండా పోయాయి. (కళ్ళతో తిరిగిన నీళ్ళు తుడుచుకున్నాడు)

అని : విచారించకు బావా,

చక్ర : మాతృభూమిపై కాలు పెట్టగానే దుర్వార్త విన్నాను,

అని : నువ్విలా విచారిస్తూ వుంటే మామయ్య ఆత్మ శాంతించదు.

చక్ర : అవును ... అనితా! నాన్నను చంపిన ఆ కిరాతకుణ్ని ప్రాణాలతో వదలను. గాలించి గాలించి వెంటాడి వేటాడ్తాను.

అని : బావా,

చక్ర : అవును అనితా! అంతవరకు నాకు శాంతి, విశ్రాంతి లేవు. అనితా! నువ్వింటికెళ్ళు.

అని : మరి నువ్వు?

చక్ర : ఇన్‌స్పెక్టర్‌గారిని కలుసుకొని మాట్లాడివస్తాను.

అని : ముందు యింటికెళ్దాం బావా! ఆతర్వాత యిన్‌స్పెక్టర్‌గారిని కలుసుకోవచ్చు.

చక్ర : లేదు అనితా. ముందు కన్నతండ్రిని చంపిన వాడి కర్తవ్యాన్ని సాధించాలి!

అని : బావా:

చక్ర : అంతవరకు నిద్రపోను ... అనితా. నువ్వెళ్ళు.

అని : నేనూ నీతోనే వస్తాను బావా.

చక్ర : ఒద్దు ..... వివరాలన్ని రహస్యంగా సేకరించి రహస్య పరిశోధన సాగించాలి,

అని : త్వరగా వస్తావుగదూ!

చక్ర : వెళ్ళినపని కాగానే వచ్చేస్తాను. నువెళ్ళు.

అని : అలాగే ... (వెళ్ళబోయి తిరిగొచ్చి) బావా: మళ్ళీ ఆ రాముడు చేతిలో పడితే ......

చక్ర : ఫర్వాలేదు అనితా, నీ తెలివి నుపయోగించి నన్ను కాపాడావు. రాముడు మాటతప్పని మనిషని గ్రహించాను. నీకు మాటిచ్చి నన్నొదిలినట్లు తనే చెప్పాడు. ఇక నన్నె పట్టుకుంటాడని అనుకోను.

అని : జాగ్రత్తసుమా.

చక్ర : నాకేం భయంలేదు.

అని : నన్నుగూడా నీతో తీసుకెడితే బాగుంటుంది.

చక్ర : ఒద్దు అనితా నిన్ను శ్రమపెట్టడం నాకిష్టంలేదు.

అని : యిందులో శ్రమేముందిబావా, నీ కష్టసుఖాలు నావికావా?

చక్ర : (నవ్వి) అప్పుడే జీవితంలో భాగాన్ని అడుగుతున్నావన్నమాట. నా ప్రియమైన మరదలా, పెళ్ళయినతర్వాత యెలాగూ తప్పదు. అంతవరకూ కాస్త ఒంటరిగా తిరగనివ్వు.

అని : పో బావా.

చక్ర : అబ్బో ... సిగ్గు ముంచుకొచ్చిందా?

అని : కాదా మరి.

చక్ర : [వాచీచూసి) అనితా, చాలా పొద్దుపోయింది నువెళ్లు. నేను గంటలో వస్తాను.

అని . గంటలో రావాలి,

చక్ర : వస్తానన్నానుగా.

అని : వస్తాను [ఒకపక్కగా వెళ్ళింది]

చక్ర : అనిత వెళ్ళిన మార్గంవంక చూస్తూ వికటంగా నవ్వాడు]

[నాగన్న, భీమన్న ప్రవేశించారు]

నాగ : పిచ్చివాడు .... నవ్వుతున్నాడు.

భీమ : నవ్వుతున్నాడెవా పిచ్చి వాడా.

చక్ర : పిచ్చివాడిని నేనుకాదురా, మీరు, నాగనా

నాగ : సర్దార్

7

చక్ర : భీమన్నా

భీమ : సర్దార్.

చక్ర : యెలా వున్నానురా.

నాగ : సర్దార్, మీరా.

భీమ : మీరేనా సర్దార్.

చక్ర : అవునురా, యెలా వున్నాను?

నాగ : అబ్బా, అచ్చంగా డాక్టర్ చక్రవర్తిలాగే ఉన్నారు సర్దార్.

భీమ : చిత్రం, అయ్యారే విచిత్రం, భళారే విచిత్రం. [పొగడతాడు]

చక్ర : చక్రవర్తి మరదలు నన్ను గుర్తించలేకపోయింది. నేనే తనబావ చక్రవర్తి ననుకుంటుంది. అవిత నన్ను గుర్తించలేకపోయిం దంటే ఆ ఇంట్లో ఎవ్వరూ గుర్తించలేరు.

నాగ : గుర్తించలేరు.

భీమ : లేరు.

చక్ర : కనకాన్ని ఆశించి కార్యరంగంలో దూకిన నాకు కాంతగూడా లభి స్తుంది. ఇక కాంతా కనకాలు నా సొంతం. మీరుగూడా వేషాలు మార్చండి గంటలో మనం విజయేంద్రభూపతి భవనంలో ఉండాలి.

నాగ : సై సర్దార్,

చక్ర : డాక్టర్ చక్రవర్తిని మట్టుబెట్టి మనం ముందుకు సాగాలి, వాడు ప్రాణాలతో ఉంటే మనకే అపాయం.

భీమ : అందుకు ఉపాయ..

చక్ర : వాడ్ని తొలగించడమే. పంపనీళ్ళలో విషంకలిపి చక్రవర్తి కివ్వండి.

నాగ : సై సర్దార్

[నాగన్న, భీమన్న వెళ్ళారు]

చక్ర : రామూ, నీ జాతకచక్రం తిరిగింది, కోటీశ్వరుడివి కాబోతున్నావు కాంతా కనకాలు లభించబోతున్నాయి. హ, హ్హ, హ్హ, హ్హ, హ్హ, [వికటంగా నవ్వుతుంటాడు)

# పదిహేడవ రంగం

[అది కోటీశ్వరుడు విజయేంద్రభూపతి భవనంలో హాలుగది. అలంకరణంతా మొదటిరంగం మాదిరిగానే ఉంటుంది. మార్పేమీ ఉండదు.]

[తెరలేచింది]

[డాక్టర్ ఆనంద్, లాయర్ చంద్రశేఖర్, మురళీధర్ కూర్చొని వుంటారు. రవికాంత్ అటూ ఇటూ తిరుగుతూ ఉంటాడు. అనిత ఇంటి వాకిలివద్ద నిల్చొని బయటికి చూస్తూంటుంది. కొన్ని క్షణాలు అలా గడిచాయి.]

రవి : అనితా! [అంటూ తిరుగుతున్నవాడు ఆగాడు]

అని. ఏమిటి బావా?

రవి. ఏదీ? అన్నయ్య యింకా రాలేదే,

అని. ఈపాటికి రావాల్సిందే.

రవి. అసలు మమ్మ కల్పుకొన్నది అన్నయ్యేనా?

అని, అదేమిటి బావా! పెదబావను నేను గుర్తించలేననుకున్నావా?

ముర. పొరపాటు అయ్యుండొచ్చుగా.

ఆ. అవును.

చం. పొరపాటు పడడం మానవ సహజం.

అని. కాదు. అతను అక్షరాలా చక్రవర్తి బావే నాకుతెలుసు.

రవి. పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేస్తే, ?

ము. అదే మంచిది.

[రవికాంత్ కంగారుతో సమీపించి టెలిఫోను రిసీవర్ ఎత్తి నెంబర్ డయల్ చేశాడు)

రవి. హలో, పోలీస్ స్టేషన్, రవికాంత్ హియర్, ఆఁ, మా అన్నయ్య అక్కడున్నాడా? ఆఁ, ఆఁ, ఓకే, థాంక్స్. [ఫోన్ పెట్టే శాడు]

అని. (ఆత్రంగా] ఏమైంది బావా?
రవి. ఇన్‌స్పెక్టర్ రాజారాంగారు, అన్నయ్య కలిసి ఇక్కడికే బయలు దేరారట,
మధు. అయితే మరికాసేపట్లో రావచ్చు.

(బయటనుంచి నాగన్న, భీమన్న వచ్చారు)

నాగ. వస్తున్నారు.
భీమ. వచ్చేస్తున్నారు.
మధు. ఎవరు?
నాగ: వారే.
భీమ: అక్షరాలా వారే.
అ: ఎవరు వారు?

చం: ఇంకెవరు? చక్రవర్తిగారే అయ్యుంటారు. ఏమంటారు?
నాగ: ఏమీ అనం.
భీమ: ఏమీ అనలేము.

[బయటనుంచి చక్రవర్తి, రాజారాం వచ్చారు)

చం: గుడ్ మార్నింగ్ సార్.
క: గుడ్ మార్నింగ్
అ: గుడ్ మార్నింగ్ సార్.
ః : గుడ్ మార్నింగ్
రవి, అన్నయ్యా, [ఆప్యాయంగా పిల్చాడు]

చ : ఏరా రవి .... ఎలావున్నావ్?
రవి : నాకేమన్నయ్యా .... బాగానే వున్నాను. మరి నువ్వు...?

చ . కన్పిస్తూనే ఉన్నానుగదరా.

ము : బావా, ఈ ఆనంద సమయంలో విందులు, వినోదాలు ఏర్పాటు చేయడానికి, నీకు ఘనంగా స్వాగతంచెప్పే అదృష్టానికి మేము నోచుకోలేక పోయినందుకు చాలా విచారిస్తున్నాం.

చ : అందుకు నేను బాధపడటం లేదు. నాన్నగారి హత్యా వార్త నా హృదయంలో ఆరని ఆవేదనను రగిలించింది. అదే నా హృదయాన్ని క్షోభ పెడుతుంది.

ము : నీకేగాదు బావా, ఆ విచారం అందరికీను,
చ : (బరువుగా నిట్టూర్చి) బావా,
ము : ఏమిటి బావా?

చ : నాన్నగారి హత్యను గురించి నువ్వేమన్నా చెప్పగలవా?
ము : లేదు బావా!

చ : లాయర్‌గారూ.
చం : యస్ సార్.

చ : గత ఎనిమిది సంవత్సరాలుగా మా వ్యాపార వ్యవహారాలు, ఆస్తి వ్యవహారాలు మీరే చూస్తున్నారుగదూ?

చం : అవునుసార్.
చ : ఈమధ్య నాన్నగారేమన్నా వీలునామా వ్రాసారా?

చం : వ్రాసారు.
చ : ఏమని?

చం . తమ యావదాస్తి మీకు రవిబాబుకు సమానంగా పంచబడేటట్లు వ్రాశారు.

చ : అందులో అదర్శంఏమీలేదు రవిబాబుతో ఏకాంతంగా మాట్లాడాలి.
అన్యథా తల్చక మీరంతా బయటికి వెళ్ళండి.

(చంద్రం, అనంత్, మురళీధర్ బయటికెళ్ళారు)

అవి . [లోనికి వెళ్ళింది)
రాజా॥ [బయటికి వెళ్ళాడు]

నాగ . సార్‌: మమ్మల్ని ఉండమంటారా వెళ్ళమంటారా?
భీమ . మనతో ప్రత్యేకంగా చెప్పాలా?
నాగ : రారా
భీమ . పదరా

[నాగన్న భీమన్న బయటికెళ్ళారు)

చ : రవిబాబూ.
రవి . ఏమిటన్నయ్యా?

చ : అనుకోని దుస్సంఘటన జరిగిపోయింది. నాన్నగారు మనకు శాశ్వ
తంగా దూరమయ్యారు.

రవి . అవునన్నయ్యా, ఆలోటు మనకు తీరనిది.
చ . నాన్నగారు అందరితో సఖ్యంగా మెలిగేవారు కదూ?
రవి ॥ అవును.

చ : ఆయన హత్యకు వ్యక్తిగత వేధాలు కారణంకాదు. ఆయన
అందర్నీ ప్రేమించేవారు. అయితే నాన్నగారు చనిపోవడానికి
ఐమీన్ హత్య చేయబడడానికి ఒకేఒక కారణం కన్పిస్తుంది.

(బయట్నుంచి రాజారాం వచ్చాడు)

రవి ॥ ఏమిటది?

చ : మన ఐశ్వర్యం.

రవి . నాన్నగార్ని హత్య చేసినందువల్ల ఆస్తి మనకు దక్కుతుందిగాని మరొకరికి ఎలా దక్కుతుంది. ఆయన్ని చంపినందువల్ల ఏమిటి ప్రయోగం.

చ ॥ నాన్నను చంపగలిగిన వాడికి మనల్ని చంపడం కష్టం కాదు.

రవి : ఆ! మనల్నా?

చ . అవును, మనమీదగూడా హత్యాప్రయత్నం జరపవచ్చు. యేమంటారు ఇన్స్పెక్టర్.

రాజా . అవును, నా అనుమానంగూడా అదే.

రవి . మామీద హత్యాప్రయత్నం జరగవచ్చని మీ ఊహమాత్రమే.

చ ॥ కాదురవీ, నామీద హత్యాప్రయత్నం జరిగింది.

రవి ॥ ఆ! నీమీదా?

చ . అవును. అమెరికానుంచి నేను బయలుదేరినవిమానం పేల్చడానికి ప్రయత్నాలు జరిగాయి. ఇన్స్పెక్టర్ రాజారాం రామన్న ప్రమాదాన్ని పసిగట్టి విమాన ప్రమాదం జరగకుండా తన సిబ్బందితో రక్షించగలిగారు.

రవి . నిజంగానా?

చ ॥ అవును, కాని ఆ దుండగులు తప్పించుకొని పారిపోయారు.

రవి ॥ ఎంత ప్రమాదం తప్పింది.

చ : ఇకముందు ఇటువంటి ప్రమాదాలు జరిగే సూచనలు కన్పిస్తున్నాయి. నీ ఆత్మరక్షణ నువ్వు చూసుకోవాలి.

రా . సార్, మీ ఇంటిచుట్టూ బందోబస్తు పెట్టించమంటారా?

చ ॥ నోనో, ఆప్రయత్నం చేయకండి, హంతకుడు జాగ్రత్తపడతాడు

రా . అదీ నిజమే.

చ . రవిబాబూ, ఒక రహస్యం.

రవి : ఏమిటన్నయ్యా?

చ , మన భవనంలో సుమారు పదికోట్ల రూపాయల విలువగల వజ్రాలు భూస్థాపితం చేయబడి వున్నాయి. ఈ విషయాన్ని నాన్నగారు ఈ మధ్యనే లెటర్ ద్వారా నాకు తెలియజేశారు అవి మన వంశ పారంపర్యంగా వస్తున్న అమూల్య సంపద.

రవి , అలాగా.

చ : అవి మన భవనంలో ఉన్నాయేగాని ఎక్కడున్నాయో నాకుగూడా తెలియదు, నాన్నగారి హత్యకు ఈ వజ్రాలుకూడా ఒక ముఖ్య కారణం కావచ్చు.

రవి : అవునన్నయ్యా, అసలు విషయం ఎలావున్నా, ఈ వజ్రాల రహస్యం తెలిసిన వాడెవరో నాన్నగార్ని బెదిరించివుండాలి. నాన్నగారు ఈ రహస్యాన్ని వెల్లడి చేయనందున హత్యచేయబడి వుండాలి.

రాజా: అవును, అదొక కారణం కావచ్చు.

చ : ఈ దురాగతాల వెనక ఒక ముఠా వుండివుండాలి.

రాజా. అవును, ఏమైనా మీ జాగ్రత్తలో మీరు ఉండాలి.

రవి : అలాగే యిన్‌స్పెక్టర్

రా : వస్తాను [వెళ్ళిపోయాడు)

చ . రవిబాబూ, ఇవి ఎవర్నీ నమ్మే రోజులు కావు; మన మిత్రులెవరో శత్రువులెవరో గుర్తించడం కష్టం.

రవి . అవునన్నయ్యా

చ : మన కుటుంబ రహస్యాలు బయటి కెళ్ళాయంటే మనలో యెవరో ఆ ముఠాతో సహకరిస్తున్నారన్నమాట. హుఁ! సరే, వీళ్ళ ఆట కట్టించి మన సంపదను కాపాడుకోవాలి.

రవి : అలాగే అన్నయ్యా.

చ : మనిద్దర్నీ, నన్ను ప్రశాంతంగా ఆలోచించుకోనీ. నేను రెస్టు తీసుకో
వాలి.

రవి : అలాగే (బయటికి వెళ్ళాడు)

చక్రి : అవితా!

అవి : (వస్తూ) పిల్చావా బావా?

చక్రి : లేదు. అరిచాను.

అ : ఎందుకో?

చ : గలగలలాడే గాజుల గందరగోళం చేసే నీ సున్నితమైన హస్తా
లతో అరకప్పు కాఫీ అమాంతం తెస్తావని.

అ : ఇప్పటికే ఆలస్యమయింది .... భోజనానికి రా బావా!

చ : ఒద్దు అవితా, కాఫీచాలు.

అ : అలా వీల్లేదు, నీకోసం నేతిగారెలు చేశాను.

చ : నిజంగానా?

అ : అవును బావా!

చ : వంటచేసి మెళ్ళో వేసుకోక పొయ్యావా?

అ : ఛీ బావా!

చ : (అవితను దగ్గరగా లాక్కొని) కోపమొచ్చిందా?

అ : ఎందుకూ?

చ : పరిహాసం చేశానని.

అ : అది మాబావ జన్మహక్కు.

చ : (మరీ దగ్గరగా లాక్కున్నాడు)

అ : ఒదులు బావా.

చ : వదలను.

అ : ఎవరన్నా చూస్తారు.

చ : చూస్తే చూడనీ.

అ : ఛీ .... సిగ్గులేని మేళం. చూస్తే ఏమనుకుంటారు.

చ : ఏమనుకుంటారు?

అ : పెళ్ళికాక ముందే ఇలా ఐ తెగించారేమిటా అని మూతిని ముడుచుకుంటారు.

చ : అంతేగదా ఇదే అమెరికాలో అయితే ఏంచేస్తారో తెలుసా?

అ : ఏం చేస్తారు?

చ : గట్టిగా కౌగలించుకొని ముద్దులు పెట్టుకుంటారు. ఎలాగో చూపించమంటావా?

అ : ఒద్దొద్దు .... ఆ పనిమాత్రం చేయకు.

(అంటూ చక్రవర్తి చేతుల్లోనుంచి తప్పుకొని పాట పాడుతుంది. చక్రవర్తిగూడా పాట పాడతాడు)

(పాట - 6) (అవిత, చక్రవర్తి డ్యూయెట్)
(పాట పూర్తయింది. అవిత చక్రవర్తి బాహువులో చేరుతుంది]

(బయట్నుంచి నాగన్న, భీమన్న వచ్చారు. అవిత, చక్రవర్తిని చూచి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు)

నా : ఒరేయ్ భీమన్నా

భీ : ఏమిట్రా నాగన్నా!

నా : మనసార్ ... ఈ లోకంలో లేడురా.

భీ : అవునురా.

నా : సార్, (బిగ్గరగా అరిచాడు]

(అవిత, చక్రవర్తి ఉలిక్కిపడి దూరమయ్యారు]

చ : మీరా?

నా : మేమే సార్.

అ : వీళ్ళు రాముడి అనుచరులు గదూ?

చ : అవును.

అ : వాళ్ళనెందుకు తీసుకొచ్చావు బావా!

నా : సార్ తీసుకురాలేదు.

ది : మేమే వచ్చాం

అ : యెందుకూ?

నా : ఆ విషయం సార్‌ని అడగండి.

శ : అవును అనితా! వీళ్ళు వట్టి అమాయకులు. అగ్గిరాముడి మాయా జాలంలో చిక్కి తమ భవిష్యత్తును పాడుచేసుకుంటున్న విద్యార్థులు, గౌరవంగా కష్టపడి బతుకుతామన్నారు తీసుకొచ్చాను

నా : అవునండి కష్టపడతాం.

ది : నీతిగా బ్రతుకుతాం.

అ : మీరా, బ్రతకాల్సిందే...అయినా ముగ్గురు పోతర్లున్నారు వాళ్ళేరి పవిలేదు. ఇంకా వీళ్ళెందుకు బావా?

శ : ఉండనీ, చూడు అనితా. తప్పుచేయడం మానవ సహజం. చేసిన తప్పు తెల్సుకొని మంచి మార్గానికి మళ్ళాలనుకోవడం ఉత్తమ లక్షణం. మనిషిమారడానికి అవకాశం ఇవ్వాలేగాని వారిని శిక్షించడం వల్ల ప్రయోజనం లేదు.

నా : అవునండి.

ది : నిజమండి.

చ : నిజానికి వీళ్ళిద్దరూ దొంగలు, మామూలు దొంగలుగాను. అగ్గిరాముడితోపాటు ఎందరినో కొల్లగొట్టిన బందిపోటు దొంగలు. ఈనాడు తమతప్పు తెల్సుకొని మంచి మనుషులుగా మారడానికి వచ్చేశారు.

నా : అవునండి.

ది : నిజమండి.

అ : నీ ఇష్టాన్ని కాదనను, పాతేళ్ళలాగా ప్రకాశం మనింట్లో వస్తువులు కాజేస్తే ...... ?

నా : మేము డబ్బుతప్ప వస్తువులు ముట్టుకోమండి.

భీ : అవకాశం దొరికితే డబ్బుమాత్రమే కాజేస్తామండి.

అ : విన్నావా బావా.

చ : వాళ్ళమొహం .... అయినా ఇనప్పెట్టెలోనున్న డబ్బు వీళ్ళకెలా అందుతుంది,

నా : ఆ భయం మీకక్కరలేదు.

భీ , మారుతాళాలతో ఇనప్పెట్టెలు తెరవడం మాకువెన్నతో పెట్టినవిద్యండి

అ , మనకొద్దు ... పంపెయ్‌బావా.

చ . పంపితే యెక్కడికెళతారు?

భీ : అవునండి.

నా : నిజమండి.

చ : మీకు వంటపని తెలుసా?

నా : తెలుసండి

భీ : ఇంతకుముందు ఇన్‌స్పెక్టర్ జనరల్‌గారింట్లో వంటపని చేశామండి.

నా : పనిచేసిన నాలుగురోజులలో ముగ్గుర్ని పంపామండి.

అ : పైకేనా?

నా : కాదం .. హోటల్ భోజనానికి.

చ : ఏడ్చారు లెండోయ్.

నా : మేము ఏడ్వలేదండి .... ఏరా నువ్వేమన్నా ఏడ్చావా?

భీ : లేదురా ... నువ్వేడిచావేమోనని నేననుకుంటున్నాను.

చ : అవితా!

అ : ఏమిటి బావా?

చ : మనం అలా లాయర్‌గారి ఇంటికి వెళ్ళొద్దాం రా.

అ : యిప్పుడా?

చ : అవును? ఆయనతో చాలా విషయాలు మాట్లాడాలి.

ఆ : సరే పద.

[బయటికి వెళ్ళబోయారు. బయట్నుంచి రవికాంత్ ప్రవేశించాడు]

ర . ఎక్కడికన్నయ్యా?

చ : లాయర్ గారింటికి ... అన్నట్టు ... ఇనస్పెక్టర్ తాళాలు నీ దగ్గరే ఉన్నాయి గదూ.

ర : అవును.

చ . ఇలా యివ్వు.

(రవి ఇనస్పెక్టర్ తాళాలు చక్రవర్తికిచ్చాడు అవిత, చక్రవర్తి బయటికెళ్ళారు రవికాంత్ బయటికి వెళ్ళాడు. నాగన్న, భీమన్న లోపికి వెళ్ళారు)

(కొన్ని క్షణాలు మ్యూజిక్ తో గడిచాయి. బయట్నుంచి మురళీధర్, చంద్రం, ఆనంద్ వచ్చారు)

ము: (సోఫాలో కూర్చుని సిగరెట్ దమ్ము లాగుతుంటాడు)

(చంద్రం, ఆనంద్ అటూయిటూ తిరుగుతుంటారు)

చం: (ఆగి) మవ్వన్నది అక్షరాలా నిజం. చక్రవర్తి సామాన్యుడు గాదు. అవులిస్తే ప్రేవులు లెక్కపెట్టేరకం.

ఆ : అవును. అతన్ని ఆడించడం మనవల్ల గాదు.

చ : అతడే మనల్ని ఆడించగలడు.

ము : అటువంటివాడితో నేస్తం చాలా ప్రమాదం అందుకే వాడ్ని తొలగించాలి.

చ : అదే మంచిది.

అ : మనవ్యాపారం నిరాటంకంగా సాగి పత్రాలు, ఆస్తి మనం దక్కించుకోవాలంటే వాణ్ణి సఫా చేయక తప్పదు.

చ : అవును.

(బయట్నుంచి ముసుగుమనిషి ప్రవేశించాడు)

ము : బాస్ .... మీరా?
చ : గుడ్‌మార్నింగ్ బాస్
అ : గుడ్‌మార్నింగ్ బాస్

ము : బాస్ .... మీరిలారావడం ప్రమాదం... ఎవరయినా చూస్తే కొంప మునుగుతుంది.
ము : (మురళిని దగ్గరగా రమ్మని సిగ్నల్ ఇచ్చాడు)
ముర. (ముసుగుమనిషి దగ్గరగా వచ్చాడు)
ముసు:(మురళిచెవిలో ఏదో చెప్పాడు)
ము : అలాగేబాస్ .... అలాగే చేస్తాను.

(ముసుగుమనిషి బయటికి వెళ్ళిపోయాడు)

చ : ఏమంటున్నారు బాస్?

ము : అనడానికిఏముంది. రవికాంత్‌ను ఎలాగయినా లొంగతీసి అనితతో పెళ్ళి జరిపించాలట. బలరాంను పిలిపించి చక్రవర్తిని అడ్డు తొలగించాలట.

అ : ఇంకా ఆలస్యం దేనికి? ఊం .... కానివ్వు.

(మురళీధర్ టెలిఫోను రిసీవర్ ఎత్తి నెంబర్ డయల్ చేశాడు]

ము : (ఫోనులో) హలో! త్రిస్టార్ నైట్‌క్లబ్. మిస్టర్ బలరాంగారా? ఒకసారి పిలుస్తారా?

బ : (వస్తూ) నేను వచ్చేశాను మురళీధర్.

ము : బలరాం ... నువ్వా ...? [నాకిలివంక చూదాడు)

బ : వచ్చేశాను. నాతో నీకు అవసరం ఉంటుందని నాకు తెలుసు అం దుకే పిలవని పేరంటానికి వచ్చేశాను నీ పరిస్థితులు నాకు తెలుసు. డాక్టర్ చక్రవర్తి అమెరికానుండి తిరిగివచ్చాడు. నువ్వు నీబాస్ అతను వస్తున్న విమానాన్ని ధ్వంసం చేయాలని ప్రయ త్నించారు. రానున్న ప్రమాదాన్ని గ్రహించిన ఇన్స్పెక్టర్ రాజారాం తనసిబ్బందితోదూకి ప్రమాదాన్ని తప్పించాడు అవునా?

ము : ఇదంతా నీకెలాతెలుసు?

బ : బలరాంకు వెయ్యికళ్ళు మురళీధర్.

ము : నీ తెలివి అమోఘం.

బ : చక్రవర్తిని అడ్డు తొలగించడానికి నా అవసరం నీకుంటుందని తెలుసు. అందుకే వచ్చాను. ఏమంటావ్?

ము : తొలగించగలవా?

బ : అదినాకు వెన్నతో పెట్టినవిద్య.

ము : వాడ్ని ఎలాచంపుతావ్?

బల : విజయేంద్రభూపతిని చంపినట్టే.

ము : అంత సులభంగాదు

బల : నాకు అసాధ్యమన్నది లేదు.

ము : నువ్వు పట్టుబడితే?

బల : కలలోని మాట.

ము : ఒకవేళ చక్రవర్తి విన్ను గుర్తించి పట్టుకుంటే....?

బల : జరగనివవి... ఒకవేళ జరిగినా మీ రహస్యాలు బయటికిరావు.

చం : అదీ అలావుండాలి.

అ : పొరపాటునన్నా మా పేర్లు బయటికి రాగూడదు.

ము: ఏమంటావ్?

బలి: మీ రహస్యాలు రహస్యంగానే ఉంచబడతాయి.

ము: వెరీగుడ్, మరి ... నీ ప్రతిఫలం

బలి: ఐదులక్షలు

ము: ఆఁ ఐదులక్షలా?

బలి: అవును ఐదులక్షలు ... ఫైవ్‌లాక్స్

ము: ఇటీజ్ టూమచ్.

బలి: [నవ్వి] కోట్లకొలది ఆస్తి, పదికోట్ల విలువగల వజ్రాలు పొంద గోరేవాడు ఐదులక్షలు పారేయడం సముచితం. చక్రవర్తి ప్రాణం విలువ కోట్లసంఖ్యలో వుంది.

ము: ఆల్‌రైట్. పని ఈరాత్రికే జరగాలి.

బలి: చెప్పలేను. ఈరాత్రి ప్రయత్నం జరుగుతుంది. తప్పితే రేపు చక్రవర్తి తల తెగుతుంది

ము: (పాకెట్‌లోని నోట్లకట్టలు తీసి ఐదుకట్టలు బలరాంకిస్తూ] అడ్వాన్సు

బలి: ఎంత?

ము: పాతికవేలు. మిగతాది పనిముగిసిన తర్వాత.

బలి: ఓకే.

ము: నువ్వెళ్ళొచ్చు.

బలి: [నవ్వి] ఓకే ... (అంటు పాకెట్‌లోనుండి బ్రాందీ బాటిల్ తీసి త్రాగబోయాడు)

ము: స్టాపిట్.

బలి: (ఆగాడు]

ము: ఆ బాటిల్ కావాలి.

బలి: దీని వెల 12 రూ॥లు

ము: (జేబులోని వందకాగితం తీసియిస్తూ) ఇదిగో వంద

కాని, ఆ అవకాశాన్ని ఆధారం చేసుకొని నీ ఆస్తినిగూడా కలి
దక్కించుకోవాలని ప్లాన్ వేశాడని అనితతో ఉత్తరం నా చెవు
లారా విన్నాను.

రవి, ఆఁ,

ము . నేనేగాదు, లాయర్ చంద్రశేఖర్‌గారు, డాక్టర్ ఆనంద్‌గారు గూడా
విన్నారు. ఏమంటారు మాట్లాడరేం?

చం : అవునవును. విన్నాం.

ఆ , తమ్ముణ్ణి అన్యాయం చేయాలనుకోవటం అధర్మం.

రవి : ఇదంతా నిజమా?

ము . అబద్ధం చెపితే నాకొచ్చేదేమిటి?

రవి . అన్నయ్య ఇంతటి స్వార్థపరుడా?

చం : కాకుంటే నీకింతటి అన్యాయంచేయ సంకల్పిస్తాడా?

ము : తరువాత. నీమీదున్న అనురాగంకొద్దీ మామయ్య తన ఆస్తిలో నీకు
వాటా ఇచ్చారు. దాన్ని పోగొట్టుకొని అనాథుడివి కాకు.

రవి ; నమ్మలేక పోతున్నాను,

ము . మీ అన్నయ్యమీద నీకున్న అనురాగం నమ్మనీదని నాకుతెలుసు,
పిచ్చివాడా! నీ స్వాధీనంలో నున్న ఇనప్పెట్టె తాళాలు తీసుకున్నాడా
లేదా?

రవి . తీసుకున్నాడు.

ము . ఎందుకు తీసుకున్నాడంటావ్ .... ఏం? ఆ తాళాలు నీ దగ్గర
ఉండకూడదా?

చం : ఉండకూడదనే చక్రవర్తి అభిప్రాయం.

ము . ఇప్పటికైనా కళ్ళు తెరు. నీ ఆస్తిని పంచుకొని దూరంగా వెళ్ళిపో.

రవి : వెళతాను. కన్నకొడుకును కాకపోయినా నాన్న నామీదున్న ప్రేమతో
ఆస్తిలో సగభాగం వ్రాసిచ్చారు. దాన్ని కాజెయ్యడానికి అన్న
య్యకు హక్కులేదు. ఇప్పుడే తెగతెంపులు చేసుకుంటాను.

ము. భయపడకు: మేమంతా నీ క్షేమాన్ని కోరేవాళ్ళం. మా అండ నీకెప్పుడూ ఉంటుంది, వస్తాం.

[మురళీధర్, చంద్రం, ఆనంద్ బయటికెళ్ళారు]

రవి. (అటూయిటూ తిరుగుతూ] అన్నయ్యా, నువ్వెంతటి స్వార్థపరుడివా నీ కోసం, నీ క్షేమంకోసం అనితమీదున్న ప్రేమను త్రెంచుకున్నాను, తండ్రి తరువాత తండ్రి అంతటివాడివని గౌరవించాను. నా మనసులో దేవుడిగా నిల్పి ఆరాధించాను. అందుకు ప్రతిఫలం ఇదా? వీల్లేదు. ఆస్తిలో నావాటా నాకు కావాలి. అనిత నాసొంతం కావాలి. దక్కించుకుంటాను, ఆస్తిని, అనితను దక్కించుకుంటాను నువ్వెలా అడ్డు పడగలవో చూస్తాను.
[అంటూ టేబిల్‌మీదున్న బ్రాందీని చూసి అన్నిగ్లాసులు ఖాళీ చేశాడు. కొద్దిమైకంలో ఉంటాడు]

రవి: అన్నయ్యా.... కాదు, నువ్వు అన్నయ్యవు కాదు. నా శత్రువివి. నాకన్యాయం చేయ సంకల్పించిన నిన్ను సర్వనాశనం చేస్తాను.

[బయట్నుంచి అనిత ప్రవేశించింది)

రవి ; అనితా!
అని . ఏమిటి బావా?
రవి. నా అనితా (చెయ్యిపట్టుకున్నాడు)
అని. బావా... ఏమిటిది? [చెయ్యి లాక్కుంది]
రవి. నామనసు నీ కర్థంకాలేదా అనితా, ఐలవ్ యూ.
అని, నో .... ఐ డోంట్ [illegible].
రవి. వాట్?
అని. యస్.
రవి. అనితా, నన్నెందుకు ప్రేమించలేవు?
అని. పెదబావను ప్రేమించాను గనుక.
రవి. వీల్లేదు, నువ్వు వాణ్ణి ప్రేమించడానికి వీల్లేదు.

స్తూంది. ఆ ఆకారం పిల్లిలా చక్రవర్తిని సమీపించి చంప బోయింది. చక్రవర్తి గమనించి ముసుగుమనిషి చెయ్యి పట్టుకొని మెలితిప్పాడు.)

ము : (చేతిలో కత్తి వదిలాడు)

చ : (ముసుగుమనిషి ముఖంపై కొట్టాడు.)

ము : (దూరంగా పడ్డాడు)

చ : (కిందపడిన కత్తి అందుకొని బయటికోటికి అడ్డంగా నిల్చున్నాడు

ము : (లేచి నిల్చున్నాడు)

చ : ఎవర్నువ్వు ?

ము : నీ ప్రాణం తీయవచ్చిన పీడన్ని.

చ : భేష్! ఒకేవీరుడవు

ము : అవమానమా ?

చ : అందుకే నిరాయుధంగా విశ్రమిస్తున్న నన్ను చంప వచ్చావు. ఇది వీర లక్షణమా ?

ము : శత్రువులను తొలగించటమే నా ధ్యేయం.

చ : దానివల్ల ఉపయోగం.

ము : అది లక్ష్యం.

చ : నా ప్రాణం తీయడానికి నియమించబడ్డావన్నమాట.

ము : అవును, కాచుకో.

(అంటూ చక్రవర్తి మీద కలబడ్డాడు. కొన్ని నిముషాలు ఇద్దరిమధ్య ఫైట్ జరిగింది. ముసుగుమనిషి ముఖానికున్న ముసుగు చక్రవర్తి చేతిలోకి వచ్చింది.)

చ : (ముసుగు మనిషి ముఖం చూచి) బలరాం.... నువ్వా !

బ : ఎవరూ ?

చ : నేనే... నన్ను గుర్తించలా ?

బ : ఆఁ... అగ్గిరాముడు.

చ : అవును బలరాం. అగ్గిరాముడ్ని.

బ : సర్దార్! ఏమిటీవేషం ?

బ : ఉత్తమ సర్దార్! అతని శవాన్ని పోస్టుమార్టంకోసం పంపడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. దూరంగా చూచి నేను తప్పుకున్నాను.

చ : అలాగా!

బ : అయితే భూపతిని ఎవరుచంపి ఉంటారు?

చ : ఇంకెవరు? ఆ మురళీధరే చంపి ఉంటాడు. వాడు చాలా ప్రమాదకరమైన వ్యక్తి.

బ : మనకన్నానా?

చ : కీడెంచి మేలెంచమన్నారు, బలరాం.... అనితను నా భార్యగాచేసుకొని ఆస్తి స్వాధీనపర్చుకునేవరకు మళ్ళా మురళీధర్ అనుచరుడిగానే నటించు.

బ : అలాగే సర్దార్.

(లోపల్నుంచి అనిత వచ్చింది)

అ : బావా! నువ్వింకా నిద్రపోలేదా... (బలరాంను చూచి) ఇతనెవరూ

చ : నా స్నేహితుడు. నేను అమెరికానుంచి వచ్చానని తెలిసి చూడడానికి వచ్చాడు.

అ : కాఫీ తెస్తాను కూర్చోండి

బ : ఒద్దు మేడం. రేపు ఎలాగూ మావాడిపార్టీకి ఇవ్వక తప్పదుగా. వస్తానురా చక్రం వెధవా.

అ : అదేమిటి

చ : ఓ... అదా.... ఈ వెధవకు నన్ను వెధవాఅని పిలవటం ఒక వెధవ అలవాటు

బ : వస్తానురా (బయటికి వెళ్ళాడు)

అ : దొరగారికింకా నిద్ర రాలేదా?

చ : దొరసాని జోల పాటలేదుగా (దగ్గరగా లాక్కున్నాడు)

అ : ఛీ! వదులు బావా!

చ : వదలను మరదలా.

(అనిత తప్పించుకుని పోబోయింది. చక్రవర్తి ఆమె చీరచెంగు పట్టుకున్నాడు)

(చక్రవర్తి పాట పాడ్తాడు అనిత అతన్ని అనుసరించింది)

(పాట : 7) (చక్రవర్తి, అనిత డ్యూయెట్)

(పాట పూర్తయింది అనిత చక్రవర్తి హృదయంపై వాలింది
ఇద్దరూ ఏకమై నిల్చిపోయారు)

[తెర వాలుతుంది]

# నాలుగవ రంగం

[అది నిజయేంద్రభూపతి భవనంలో హాలుగది, అలంకరణంతా మొదటిరంగం ... తిరిగానే ఉంటుంది; మార్పేమీ వుండదు. తెరతీయకముందు పేజర్ సీత భూపతి ఫోటో వుంటుంది.]

[తెరలేచింది)

[రవికాంత్ భూపతి ఫోటోముందు నిలబడి చూస్తుంటాడు]

రవి : నాన్నా! నీ కన్నబిడ్డను కాకపోయినా ఎంతో ఆప్యాయంగా పెంచావు. ఆస్తిలో భాగమిచ్చావు. నాకు జన్మనిచ్చిన నా తలితండ్రులు కఠిన పాషాణులై పారవేసిన నన్ను ఆప్యాయతతో ఆదరించావు. మనిషిగా తీర్చిదిద్దావు. ప్రేమానురాగాలు రంగరించి పోశావు. నీప్రేమకు ప్రతిఫలంగా నీ బిడ్డనే అవమానించాను. అన్నయ్యను నిందించాను. నిజానికి నేనెవర్ని. ఏమో, దిక్కులేని దరిద్రనారాయణుడ్ని. నన్ను క్షమించు నాన్నా. చూశావా నాన్నా. మర్చే నా కిచ్చిన ఆస్తికోసం అన్నయ్య నన్ను మోసం చెయ్యాలనుకుంటున్నాడు. నిజానికి ఈ యావదాస్తి అతనిదేగా. నన్నడిగితే నేను కాదంటానా? అందుకే యావదాస్తి అన్నయ్యకు వదిలి కట్టుబట్టలతో వెళ్ళిపోబోతున్నాను. అన్నయ్యకు నా ముఖాన్ని చూపలేను. నావల్ల ఏదయినా అపరాధం జరిగితే నన్ను క్షమించునాన్నా.

(లోపల్నుంచి అనిత, చక్రవర్తి వస్తారు)

రవి : వెళ్ళొస్తాను నాన్నా.

చ : ఎక్కడికి?

ర : అన్నయ్యా!

చ : ఎక్కడికెళుతున్నావురా?

ర : నా గమ్యస్థానానికి.

చ : రవీ! నిజంగా వెళుతున్నావా?

రవి : చెప్పుడు మాటలకు మనుషులు యిట్టే లొంగుతారన్నది నిజం. నీ వల్ల నా ప్రవర్తన అతినీచం. నన్ను మన్నించు అనితా.

అ : పర్వాలేదులే బావా.

త : రవీ!

రవి : ఏమిటన్నయ్యా!

త : నువ్వు నాకొక మాటివ్వాలి.

రవి : చెప్పన్నయ్యా. నీమాట పాటించలేకపోతే నా జీవితానికి అర్థంలేదు!

త : మళ్ళీ ఏనాడూ త్రాగనని మాటివ్వు.

రవి : త్రాగుడువల్ల జరిగే అనర్థాలు ఎలాంటివో నాకు తెలుసన్నయ్యా. కాని — మంచితనాన్ని చూచి ఓర్వలేని దుష్టలోకం మాటలకు లొంగి ఆ పాడుపని చేశాను. మళ్ళీ జీవితంలో ఏనాడు త్రాగను.

త : నిజంగానా!

రవి : అవునన్నయ్యా. (చేతిలో చెయ్యివేసి) ఇదిగో ప్రమాణం చేస్తున్నాను.

త : తమ్ముడూ!

రవి : అన్నయ్యా .... నేనలా బయటికి వెళ్ళొస్తాను.

త : మంచిది.

రవి : (బయటికెళ్ళాడు)

త : అనితా.

అ : ఏమిటి బావా?

త : తమ్ముడు పాడైపోయాడని ఏడ్చాను. మన కుటుంబగౌరవం బజారుకు పోతుందని భావించాను. లక్షలలో నా తమ్ముడు ఒకడు. మా అనుబంధం రామలక్ష్మణుల అనుబంధం.

అ : అవును బావా! చిన్నవాడికి నువ్వంటే పంచప్రాణాలు.

త : మరి నీకో?

అ : నాకూ అంతే.

త : (దగ్గరగా లాక్కొని] నిజంగానా?

అ : అనుమానమా?

చ : నిజంగా నువ్వు స్వార్థపరురాలివి.

అ : బావా!

చ : కాదంటావా? నేను కోటీశ్వరుడినని నన్ను ప్రేమిస్తున్నావు గదూ!

అ : బావా.

చ : నీ తండ్రి పుట్టుకతో దరిద్రుడు. నీ వంశంలోని వారందరూ అనామకులు. ఒక్కసారిగా అందలమెక్కాలని, ఐశ్వర్యాన్ని అందుకోవాలని నన్ను ప్రేమిస్తున్నావు.

అ : బావా! (ఏడుస్తుంది)

చ : ఆహా .... ఎంతబాగా నటిస్తున్నావు అనితా. నువ్విలా సినిమాల్లో నటిస్తే ఆ చిత్రాలన్నీ సెంచరీ సృష్టిస్తాయి.

అ : బావాబావా చాలు. నిజంగానే నేను నటిస్తున్నాను. నీ ఐశ్వర్యాన్ని అందుకోవాలని ఆశ పడుతున్నాను. నా దరిద్రాన్ని నిర్మూలించుకోవాలని నీ భార్యను కావాలనుకున్నాను. నా అంతర్యాన్ని అర్థం చేసుకున్నావు. (ఏడుస్తుంది)

చ : అనితా..

అ : అవును బావా. నువ్వన్నది నిజం. అయినా నువ్వెక్కడ? నేనెక్కడ? గడ్డిపూవు మల్లెపూవు అవుతుందా? వస్తాను (కన్నీళ్ళు తుడుచుకుంటూ లోపలికెళ్ళబోతుంది]

చ : అనితా!

అ : (ఆగింది)

చ : ఏడుస్తున్నావా?

అ : లేదు. నువ్వన్నమాటలకు ఆనందిస్తున్నాను. బావా! నువ్వు అన్న మాటలకు నా మనసు ఆనందంలో మునిగిపోయింది.

చ : అనితా!

అ : వస్తాను [వెళ్ళబోయింది]

చ : (ఆమె చీరకొంగు పట్టుకున్నారు)

అ : (చక్రవర్తి కళ్ళల్లోకి చూస్తుంది)

చ : (నవ్వి) తమాషాకు అన్నమాటలకు ఏడుస్తున్నావా?

అ : కాదా,

చ : నీ మనసు నాకు తెలియదా అవితా! నిన్ను ఉడికించాలని అలా అన్నాను. యింతమాత్రానికే కన్నీరా?

అ : నవ్వుతూ అన్నా యిలాంటిమాటలు హృదయాన్ని గాయపరుస్తాయి బావా!

చ : పిచ్చిదానా. నీ బావను అర్థం చేసుకున్నది యింతేనా?

అ : బావా!

చ : ఈ బావ ఏనాటికి నీతోడు నీడనే కోరుకుంటాడు అవితా!

అ : బావా!

చ : అవితా (దగ్గరగా లాక్కున్నాడు)

అ : మళ్ళీ ఎప్పుడూ అలా అనకుబావా. నేనేమైపోతానో.

చ . ఏమయిపోతావ్?

అ : చచ్చిపోతాను,

చ : అవితా!

అ ; అవును బావా! నువ్వు కాదంటే నాకు మృత్యువే మార్గం.

చ : నిన్ను కాదనేదిలేదు, నువ్వు మృత్యువును కోరుకునేది లేదు.
(అంటూ దగ్గరగా లాక్కున్నాడు అవిత సిగ్గుపడుతుంది)

[చక్రవర్తి పాటపాడతాడు. అవిత అతన్ని అనుసరించింది]
[పాట– 7] [చక్రవర్తి అవిత డ్యూయెట్]
[పాటయిపోయింది. అవిత చక్రవర్తి ఒడిలో వాలిపోయికది]

చ : అవితా.

అ : ఊఁ.

చ : నీ మనసు యేమంటుంది?

అ : ఈ జీవితం ముగిసేవరకూ ఇలాగే నీకౌగిలిలో కరిగిపొమ్మంటుంది

చ : మరి నా మనసేమంటుందో తెలుసా?

అ : యేమంటుంది?

చ : సాధ్యమయినంత త్వరగా వీమెళ్ళో తాళి కట్టమంటుంది.

అ : నేను కాదన్నానా? వద్దన్నానా?

చ : అంటే నేనే ఆలస్యం చేస్తున్నాననంటావ్?

అ : అవును.

[నియమించిన ఇన్‌స్పెక్టర్ రాజారాం ప్రవేశించాడు)

చ : కమాన్ యిన్‌స్పెక్టర్.

రా. మీతో ఒక విషయం మాట్లాడాలి

చ. యేమిటది?

రా. చాలా రహస్యం.

చ. పర్వాలేదు చెప్పండి.

రా. అనాదిగా మీ వంశం పరువు ప్రతిష్ఠలతో గౌరవ మర్యాదలతో విరాజిల్లుతుంది. దాన్ని నామరూపాలు లేకుండా విక్రయిస్తున్నారు.

చ. ఎవరు?

రా. యింకెవరు? మీ తమ్ముడు రవిబాబు.

చ. ఆఁ!

రా. అవును.

చ, మళ్ళీ తాగుడు ప్రారంభించాడా?

రా. అంతటితో ఆగితే సరిపోయేది. ఇలా రండి. [చెవిలో ఏదో చెప్తాడు]

చ. ఆఁ!

రా. అవునండి, తెలియజేయటం నా బాధ్యతగా ఎంచి వచ్చాను.

చ. తమ్ముడు హద్దు దాటిపోయాడు యిన్‌స్పెక్టర్‌గారూ.

రా. అవును.

చ. వాడిప్పుడు యెక్కడున్నాడు?

రా యింకెక్కడుంటాడు. ఉండాల్సిన చోటే. ఆ కొంపలోనే. అబ్బో ....
ఆ జల్సాలు .... గానాబజానాలు ... విందులు ... వినోదాలు ....
చెప్పలేం.

అ, యేమయింది బావ?

శా. ఏమౌతుంది. ఉడుకురక్తం గదా. ఏమైనా చేయిస్తుంది.
చ. ఇన్‌స్పెక్టర్ పదండి .... వాడెక్కడున్నాడో నాకు చూపించండి.
రా. కమాన్.

(చక్రవర్తి, శాకారాం బయటికి వెళ్ళారు)

అ. (నిట్టూర్చి కూర్చుంది]

[లోపలినుంచి నాగన్న, భీమన్న వచ్చారు]

అ. వచ్చారా?
నా. వచ్చాం.
భీ. వచ్చేశాం.
అ. ఏమిటో చెప్పండి.
నా. నాకొక సందేహం.
భీ. అదే జబ్బు నాకు గూడా.
నా. ఇవ్వాళేం చేయమంటారు వేపకాయ ఇగురా?
భీ. కుంకుడుకాయల పులుసా?
నా. వంటికొమ్ము పులుసా?
అ. ఛీ.
నాగ. ఛీ అనకండి. భారతదేశంలో కోట్లాది ప్రజలు అతి ఆప్యాయంగా ఆరగించే పులుసు. రుచికి శుచికి మారుపేరు.
భీమ. పోనీ నల్లులచారు చేయమంటారా?
అవి. ఛి ఛీ.
భీమ. మీరు అలా అనకూడదు. పదిరూపాయలు పారేస్తే కిలో కుక్క మాంసందొరికే ఈ రోజుల్లో వెయ్యిరూపాయలు యిచ్చినా కిలో నల్లులు దొరకడం కష్టం.
నాగ. మీ కోసం ....
భీమ. మీ మీదున్న ప్రేమకోసం.
నాగ. మీ మీదున్న అనురాగం కోసం.
భీమ. మీ ఆరోగ్యం కోసం.

చక్ర. ఆ సంగతి నాకు తెలుసు, ఈ దుష్టసమూహం అంతా ఏక
మయి ఎదురువచ్చినా ఈ అగ్గిరాముడ్ని ఏమీ చెయ్యలేరు.

బల. మీరు జాగ్రత్తగా ఉండండి, వస్తాను.

చక్ర. భయపడకు. నాకొచ్చిన భయం ఏమీలేదు.

బల. వస్తాను .... మళ్ళీ కలుస్తాను [వెళ్ళాడు]

[లోపలినుంచి అవిత సీరియస్‌గా వచ్చింది]

అవి. [కోపంగా చక్రవర్తిని చూస్తుంది]

చక్ర. రా అవితా!

అవి. నోర్మూయ్ .... నిజంచెప్పు ... యెవరునువ్వు?

చక్ర. అవితా!

అవి. మాట్లాడవే .... చెప్పు .... నువ్వు అగ్గిరాముడివి గదూ!

చక్ర. అవితా!

అవి. చెప్పు, నిజంచెప్పు. నువ్వు అగ్గిరాముడివి గదా.

చక్ర. కాదు.

అవి. అవును. నువ్వు అగ్గిరాముడివే, బలరాంతో నువ్వు చెప్పిందంతా
విన్నాను.

చక్ర. విన్నావా?

అవి. అవును- యిప్పటికయినా నిజాన్ని ఒప్పుకో.

చక్ర. నిజమే, నేను అగ్గిరాముడ్ని.

అవి. యెందుకొచ్చావు?

చక్ర. ఆస్తికోసం, పదికోట్లరూపాయల విలువగల వజ్రాలకోసం నీ
ప్రేమకోసం.

అవి. నోర్మూయ్. వాటిని పొందడం అతి సులభమనుకున్నావా?

చక్ర. పొందుతాను.

అవి. నీ తరంగాదు.

చక్ర. చూస్తుండు, నీకే తెలుస్తుంది.

అని. మా బాబ యెక్కడ?

చక్ర. పరలోకంలో రెస్ట్ తీసుకుంటున్నాడు.

అని. ఆ! మ.... ను.. మా బాబను చంపేశావా?

చక్ర. అవును.

అని. బాబా! [ఏడుస్తుంది]

చక్ర. చచ్చిపోయిన వాడికోసం ఏడ్చి ఏం లాభం. బ్రతికున్నవాడ్ని నీకోసం నేనున్నాను. రా. కార్యాకర్తలమై మరో లోకంలో తేలిపోదాం [చెయ్యి పట్టుకున్నాడు]

అని. ఛీ.(చెయిలాక్కొని) కిరాతకుడా! మాబాబ నీకేమపకారం చేశాడని. చంపావు.

చక్ర. ఆస్తికోసం తొలగించక తప్పలేదు.

అని. నిన్ను, నిన్ను. (టేబుల్ను సమీపించి టెలిఫోను రిసీవర్ ఎత్తి నెంబర్ డయల్ చేసింది) హలో, పోలీస్ స్టేషన్, నేను అనిత మాట్లాడుతున్నాను. మాబాబ హత్య చేయబడ్డాడు. అవునండి చక్రవర్తి బాబే. మీరు త్వరగా రావాలి.

చక్ర. వస్తున్నాడా యిన్స్పెక్టర్.

అని. వస్తున్నాడు. నీ అంతు చూస్తాడు.

చక్ర (వికటంగా నవ్వుతాడు)

అని. నవ్వు. యింకా బిగ్గరగా నవ్వు, దుర్మార్గుడా, మా బాబనుచంపిన. పాపం ఊరికే పోదు, సర్వనాశనం అవుతావు.

చక్ర. [మళ్ళీ నవ్వాడు]

అని. (ఏడుస్తూ) బాబా! [సోఫాలో కూలబడింది]
[బయటునుంచి రాజారాం వచ్చాడు]

అని. రండి ఇన్స్పెక్టర్, వీడే.. మా బాబను చంపిన హంతకుడు వీడే.

రా. [నిర్ఘాంతపోయి] ఆ!

అని. వీణ్ని అరెస్టు చేయండి.

రా. చక్రవర్తిగారూ, యేమిటిది?

చక్ర. మన్నించండి యిన్స్పెక్టర్. కొద్ది రోజులుగా మా అనిత ఆరోగ్యం బాగుండడం లేదు. మతి స్థిమితంగా ఉండడం లేదు యేదో పిచ్చిపిచ్చిగా మాట్లాడుతుంది.

అని: ఆఁ. నయవంచకుడా?

చక్ర, చూశారా! ఆ చూపు చూడండి., యివి పిచ్చిలక్షణాలు.

అని. ఆఁ! (క్రోధంతో ముందుకొచ్చింది)

చక్ర. అనితా, శాంతించు.

రా. యేదనా స్పెషలిస్టుకు చూపించకపోయారు.

చక్ర. నేనూ అదే అనుకుంటున్నాను.

అని: ఎంత నాటకమాడుతున్నావురా నయవంచకుడా. యిన్స్పెక్టర్ గారిని నమ్మకండి. వీడు మా నాన్నగాదు. వీడు అగ్గిరాముడు

రా. ఆఁ! అగ్గిరాముడా?

అని. అవును, బందిపోటు అగ్గిరాముడు వీడే.

చక్ర. చూశారా చూశారా ఆ ఉన్మాదం. నేను అగ్గిరాముణ్నా?

రా. అదేమిటి అనితాదేవిగారూ! బందిపోటు దొంగ అగ్గిరాముడు ప్రస్తుతం మా కస్టడీలో ఉన్నాడు.

అని. ఆఁ!

రా. అవునండి.

అని. అబద్ధం, మీరిద్దరూ ఏకమై నాటకమాడుతున్నారు. వీడు అగ్గిరాముడే

రా. అనితాదేవిగారూ! మా దేశభక్తిని శంకిస్తున్నారు.

అని: కాదు, నిజం చెప్తున్నాను. మీరిద్దరూ ఒకటే.

చక్ర. నాగన్నా, భీమన్నా (పిలిచాడు)

(యిద్దరూ పరుగెత్తుకొచ్చారు)

నాగ : వస్తాం.
భీమ : వచ్చేశాం.
చక్ర . అవితను లోపలికి లాక్కెళ్ళండి, పిచ్చిముదిరింట్లుగా వుంది.
నాగ . అమ్మో పిచ్చే
భీమ : పట్టుకోరా.
నాగ : కరుస్తుందేమోరా,

చక్ర : వూఁ. లాక్కెళ్ళండి.
నాగ : (అవిత చెయ్యి పట్టుకున్నాడు)
అవి : (నాగన్న చెంపమీద కొట్టింది)
నాగ : అమ్మో (చెంప పట్టుకున్నాడు)
భీమ : చచ్చువెధవా. ఆడదానిచేతిలో దెబ్బ తింటావా? మవ్వా మీస
మున్న మగాడివేనా? తప్పుకో.

నాగ : (తప్పుకున్నాడు]
భీమ : (అవిత చెయ్యి పట్టుకున్నాడు)
అవి : (భీమన్న చెంపమీద కొట్టింది)
భీమ : అమ్మో [చెంప పట్టుకున్నాడు)
నాగ : బయలుదేరాడు మీసమున్న మగాడు. ఛీ ఛీ
చక్ర . వూఁ. లాక్కెళ్ళండి,
నాగన్న, భీమన్న అవిత చెరొకరెక్క పట్టుకొని లోపలికి
లాక్కెళుతుంటారు).

అవి : ఒరేయ్ .... అగ్గిరాముడు .... నీ పాపం పండింది .... నువ్వు
సుఖంగా బ్రతుకలేవు.

[అవితను లాక్కెళ్ళారు లోపలికి]

రా : అమావాస్య దగ్గరికొస్తూంది గదూ. పిచ్చి ముదిరినట్లుగా వుంది.
చక్ర : సారీ ఇన్‌స్పెక్టర్. పిచ్చిలో మీకు శ్రమకలిగించింది మన్నించండి
రా : పర్వాలేదు. ఏదయినా మంచి స్పెషలిస్టుకు చూపించండి.

వక్ర . అలాగే.

నా : వస్తాను (బయటకెళ్ళాడు]

వక్ర : (వికటంగా నవ్వి) పాపం, పిచ్చి అవిత! ఈ అగ్గిరాముడ్నే యెదిరించాలనుకున్నావా? నీ ప్రయత్నం కొండలో ఢీకొవడం. హా ... హా ... హా ... హా ... హా...

[నాగన్న, భీమన్న లోపల్నుంచి వచ్చారు]

నాగ : హా, హా, హా, హా,

భీమ : హా, హా, హా, హా,

వక్ర : రేయ్. ఎందుకురా అలా నవ్వుతున్నారు?

నాగ : మీరు నవ్వుతున్నారని.

భీమ : అంతే.

వక్ర : అవితను యేం చేశారు?

నాగ : లోపల కట్టివదేశాం.

వక్ర : వెరీగుడ్ .... ండి. మీతో పనివుంది. [బయటికి నడిచాడు]

నాగ : పదరా.

భీమ : నడవరా.

(యిద్దరూ బయటికి వెళ్ళారు]

(లోపల్నుంచి అవిత చేతికున్న కట్లు విప్పదీసుకుంటూ వచ్చింది)

అవి : దుర్మార్గుడా ... నీ ఆట కట్టిస్తాను.

[టెలిఫోను సమీపించి రిసీవర్ ఎత్తి నెంబర్ డయల్ చేసింది]

అవి : (ఫోనులో) హలో. విజయేంద్ర ఇండస్ట్రియల్ ఎస్టేట్... నేను అవితను మాట్లాడుతున్నాను. అన్నయ్యా, నువ్వేనా. ఘోరం జరిగిపోయిందన్నయ్యా. అనుకోని మోసం జరిగింది. నువ్వెం టనే బయలుదేరిరా. త్వరగా రావాలి. (రిసీవర్ పెట్టేసింది]

అవి : అగ్గిరాముడూ .. నీ అంతుచూస్తాను. [అంటూ ఆవేశంగా అటు యిటూ తిరుగుతూ ఉంటుంది)

[బయట్నుంచి రవికాంత్ వచ్చాడు]

రవి : [అవితను చూచి] అవితా,

అవి : [ఆగి రవివంక చూసింది]

రవి : ఏమిటలా ఉన్నావ్?

అవి : ద్రోహం, వంచన. దగా, మోసం,

రవి : మోసమా? , ఏమయింది?

అవి : బావా నిజం చెప్పు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావు గదూ.

రవి : అవును.

అవి : నన్ను పెళ్ళిచేసుకోవాలని నీ మనసులో ఉందిగదూ.

రవి : అవును.

అవి : చేసుకుంటాను. నిన్నే పెళ్ళిచేసుకుంటాను.

రవి : [నిర్ఘాంతపోయి] అఁ,

అవి : అవును బావా. మనస్ఫూర్తిగా నేను నిన్నే పెళ్ళి చేసుకుంటాను.

రవి : అవితా. నీకేమన్నా మతిపోయిందా?

అవి . లేదు.

రవి . కాకుంటే ఏమిటి నువ్వు అనేది? అన్నయ్యను ప్రేమించావు. పూజ సారా ఆరాధించావు. అన్నయ్యే దైవంగా నీ మనసులో నిల్పు కున్నావ్. యిప్పుడు యిలా మనసు మార్చుకుంటావా?

అవి . బావా!

రవి . నువ్వు మనసు మార్చుకున్నా నేను మార్చుకోలేదు. అన్నయ్యకు ద్రోహంచేసి కృతఘ్నుడి(ద్రోహి)ని కాలేను. నన్ను మన్నించు.

అవి . అన్నయ్యా, యింకెక్కడి అన్నయ్య

రవి . ఏమిటవితా, ఏమయింది?

అవి . పెదబావ చచ్చిపోయాడు.

రవి . [భయం, ఆశ్చర్య మిశ్రమమైన స్వరంతో) అఁ! అన్నయ్య చచ్చిపోయాడా?

అవి : హత్య చేయబడ్డాడు.

రవి : అవితా, ఏమిటి నువ్వనేది?

అవి : నిజం బావా! బావ అమెరికా నుండి రావడంతోటే మృత్యువువాత పడ్డాడు. బావ యింటికి రానేలేదు.

రవి : ఏమిటి నువ్వు మాట్లాడేది, నీ మాటలు వింటుంటే నాకు మతి పోతుంది, అవితా! యేమిటిది?

అవి : అవును బావా.

రవి : మరి, యింటికివచ్చింది అన్నయ్య కాదా?

అవి : కాదు.

రవి : యేమన్నావ్ .... అతనెవరు?

అవి : వాడే .... పెదబావ రూపంలోనున్న అగ్గిరాముడు.

రవి : అగ్గిరాముడా!

అవి : అవును

రవి : బందిపోటు దొంగా?

అవి : అవును. వాడే పెదబావను చంపి, బావలా నటిస్తున్నాడు.

రవి : ఇదంతా నీ కెలా తెలుసు?

అవి : వాడి అనుచరులతో మాట్లాడటం నా చెవులారా విన్నాను.

రవి : యెంతటి నయవంచన.

అవి : బావా! వాడ్ని ప్రాణాలతో వదలగూడదు.

(బయట్నుంచి మురళీధర్, చంద్రం, ఆనంద్ వస్తారు]

ముర, యెవరన్నమ్మా?

అవి : వాడ్నే...బావగానటిస్తూ మనందరినీ మోసంచేస్తున్న అగ్గిరాముడ్ని.

ముర: ఆ! అగ్గిరాముడా?

ఆనం: అగ్గిరాముడా?

చం : అగ్గిరాముడా?

అవి : అవునన్నయ్యా. పెదబావను హత్యచేసి ఆస్తికోసం తను మా బావగా యీ యింట్లో ప్రవేశించాడు.

ముర: నిజమా?
రవి : అవును.
ముర: పోతు అగ్గిరాముడా!
అని : అవును.
రవి : బావా! వెంటనే పోలీసులకు ఫోన్ చెయ్యి.
అని : లాభంలేదు. నిజం చెప్పినా యీ పోలీసులు నమ్మడంలేదు.
రవి : మరెలా?
ముర: అందుకు ఒకటే మార్గం. వాణ్ణి సఫా చెయ్యాలి.
రవి : అమ్మబాబోయ్ హత్య.
ముర: చెయ్యకతప్పదు రవిబాబు లేకుంటే మనందర్నీ తనుహత్యచేస్తాడు
రవి : ఆఁ!
ముర: అనితా. దీనికి నువ్వే పునాది వేయాలి.
అని : అంటే?
ముర: అతన్ని నమ్మించి విషం త్రాగించాలి.
అని : త్రాగిస్తాను. బావను చంపిన ఆ కిరాతకుణ్ణి నామరూపాలు లేకుండా నాశనం చేస్తాను.

ముర: ఫూఁ, మీరంతా నాతోరండి.
(మురళీధర్, చంద్రం, రవికాంత్, అనంద్ బయటికెళ్ళారు)
అని . బావా, (ఏడుస్తూ కూర్చొంటుంది) బావా, ఇంతటితోనే నీ ఆయువు తీరిపోయిందని అనుకోలేదు. మనజీవిత భవిష్యత్తును గురించి ఎన్నెన్నో కలలుగన్నాను. అన్నీ నాశనమయ్యాయి బావా [యేడుస్తుంది]
[అనిత ఏడుస్తు పాట పాడుతుంది]
(పాట – 8) (అనిత పాథోసాంగ్)
[పాట పూర్తయింది. బయటనుంచి మురళీధర్ ప్రవేశిస్తాడు, అతని చేతిలో పాయిజన్ సీసావుంది]
ముర. అనితా!

అవి. అన్నయ్యా (కౌగిలించుకొని ఏడుస్తుంది)

ముర. ఏడవకమ్మా .... నీ బాధ నాకు తెలుసు, బావ మనకిక లేడు. గతించిన దానికి విచారించి ప్రయోజనం. జరగాల్సిన దాన్ని గురించి ఆలోచించాలి.

అవి. అదే, ఆ కసాయివాడి ప్రాణం తీయడమే జరగాలి. వాడు గిలగిలా తన్నుకోవడం నా కళ్ళారా చూడాలి.

ముర. అందుకే దీన్ని తెచ్చాను [సీసా చూపాడు]

అవి. యేమిటిది?

ముర. విషం.

అవి. (బాటిల్ తీసుకుంది)

ముర. యెలాగయినా యీ విషాన్ని వాడిచేత నువ్వే త్రాగించాలి,

అవి. త్రాగిస్తాను. వాడి ప్రాణం తీస్తాను.

ముర. జాగ్రత్తసుమా!

అవి. నా ప్రాణంపోయినా భయపడను. వాడిప్రాణంతీయడమేనాకుకావాలి

ముర. మేము బయటే ఉంటాము.

అవి. సరే,

(మురళిబయటికివెళ్లారు. అవిత బాటిల్‌వంక క్రూరంగాచూస్తుంది)

అవి. బావా! నిన్ను చంపిన ఆ అగ్గిగాయుణ్ని నీ దగ్గరికే పంప బోతున్నాను. (పీసా జాకెట్‌లో దాచిపెడుతుంది)

(కొన్నిక్షణాల అనంతరం బయటనుంచి చక్రవర్తి ప్రవేశించాడు)

చక్ర. ఓ .... కుమారి అవితాదేవిగారా! ఏమిటలా ఉన్నారు? విహాంగా స్వర్గవాసి మీ బావగారు గుర్తుకు వచ్చారా?

అవి. అవును,

చక్ర. చూడు అవితా! ధర్మదేవత ప్రస్తుతం నా పక్షాన వుంది నేను అనుకున్నది జరుగుతుంది. చనిపోయిన మీ బావకోసం నీవు శ్రమపడడం అనవసరం. ప్రాణిస్తున్న నన్ను వరించి నీ జీవితాన్ని సార్థకం చేసుకో.

అవి , నేనూ అదే ఆలోచిస్తున్నాను.
చక్ర. యేమని?

అవి : ధర్మం నీ పక్షానవుంది. ఆస్తియావత్తు నీపరం కాబోతుంది, కోటి కోటి యింతటి ఆస్తి ఏ ఒక్కడికే సంక్రమించడం నా కిష్టంలేదు.
చక్ర , అందుకని?
అవి : అందుకని....,
చక్ర . ఏం చెయ్యాలనుకుంటున్నావు?

అవి , నిన్ను పెళ్ళాడి యావదాస్తికి అధికారిణి కావాలనుకుంటున్నాను
చక్ర , అందుకు నా కభ్యంతరం లేదు
అవి : ఆస్తి నీ హస్తగతం కాగానే సగం నా పేర వ్రాయాలి.
చక్ర . వ్రాస్తాను.

అవి . అలాగయితే నిన్ను పెళ్ళి చేసుకుంటాను.
చక్ర . కలుపు చెయ్యి.
అవి : (చెయ్యి కలిపింది)

చక్ర , [చెయ్యి పట్టుకొని దగ్గరగా లాక్కున్నాడు]
అవి : రామూ,
చక్ర : అవితా

[అవిత ఉత్సాహంగా పాటపాడుతుంది. చక్రవర్తిగూడా పాడ్తాడు]

(పాట - 8) [అవిత, చక్రవర్తి డ్యూయెట్]

(పాట పూర్తయింది. అవిత చక్రవర్తి చేతులలో ఇమిడిపోయింది)
అవి : (తప్పించుకొని) వస్తాను.
చక్ర : యెక్కడికి?
అవి : కాఫీ తెస్తాను.
చక్ర : త్వరగా రావాలి.
అవి : ఒక్కక్షణం (లోపికెళ్ళింది)

చక్రవర్తి సోఫాలో కూర్చొని సిగరెట్ ముట్టించాడు లోపల్నుంచి అవిత కాఫీకప్పుతో వచ్చింది)

అవి : కాఫీ (అంటూ చక్రవర్తికిచ్చింది)

(కప్పులో కాఫీ సాసర్లో సగం పోసాడు చక్రవర్తి)

చక్ర . పిప్టీ పిప్టీ (ఇవ్వబోయాడు)

అవి : [ఉలిక్కిపడి) ఊహూఁ .... నాకొద్దు.

చక్ర : అలా వీల్లేదు. అమృతమైనా విషమైనా చెరిసగం త్రాగినప్పుడే మన ప్రేమకు పరమార్థం ఊఁ తీసుకో

అవి . నాకొద్దు. నేనింతకు మునుపే త్రాగాను.

చక్ర : వర్వాలేదు. నాచేతితో త్రాగిస్తాను,

అవి : ఒద్దు రామూ, నేను త్రాగను,

చక్ర , అయితేనాకూవద్దు, [కప్పు సాసర్ టేబిల్ మీదుంచి లోనికెళ్లాడు]

అవి : (వాకిలివంక చూస్తూ) తాగుతాను రామూ: మాబావ పోయిన తర్వాత నేమన్నా లేకున్నా ఒకటే త్రాగుతాను, నేను చచ్చిపోయినా వర్వాలేదు. కాని- నువ్వు బ్రతికుండడానికి వీల్లేదు.

(లోపల్నుంచి చక్రవర్తి వచ్చాడు)

అవి : రామూ.

చక్ర : ఊఁ.

అవి , (టేబుల్ మీదున్న సాసర్ తెచ్చి చక్రవర్తికిస్తూ] ఊఁ.. తీసుకో.

చక్ర . మరి నువ్వూ ....

అవి : తీసుకుంటాను. (సాసర్ చక్రవర్తికిచ్చింది)

చక్ర , (సాసర్ లోని కాఫీత్రాగి సాసర్ క్రింద పెట్టాడు)

అవి : [కప్పు చేతిలోనికి తీసుకుంది]

చక్ర . ఊఁ .... త్రాగు.

అవి . త్రాగను. అగ్గిరాముడూ,(సీరియస్ గా మారి)త్రాగను (కప్పులోని

కాఫీ (క్రిందపోసింది) అగ్గిరాముడా, మువ్వ్రత్రాగిందే చిలో తెలుసా?
చక్ర . కాఫీ.
అని . కాదు. కాపిలో మిళితమైన కాలకూట విషం.
చక్ర . ఆఁ.
అని . అవును, దుర్మార్గుడా! మా బావనుచంపిన మువ్వ బ్రతకకూడదు.
(చక్రవర్తి గుండెల్లో బాధతో మెలితిరుగుతుంటాడు)
చక్ర . అమ్మా! [బాధపడతాడు]
అని . ఏం? మా బావకూడా యిలాగే బాధపడి మరణించాడు కదూ?
చక్ర . అమ్మా ... నిన్నువంచకి ... నమ్మించి మోసంతో నన్ను చంపా
అనుకుంటావా, నిన్ను బ్రతుకనివ్వను. (అనితనుపట్టుకోబోయాడు)
అని . [దూరంగా వెళ్ళింది]
చక్ర . [నిలబడలేక పడిపోయి బాధపడుతుంటాడు]
అని . (అతనివంక చూస్తుంటుంది)
చక్ర . క్రిందపడి బాదతో పొర్లాడుతూ] అమ్మా .... అమ్మా .... అ..
ప్రాణం విడిచాడు)
అని . పీడా విరగడయింది.
[బయట్నుంచి మురళి, చంద్రం, రవికాంత్, ఆనంద్ వచ్చారు)
రవి . ఆఁ! (రయంగా] చంపేశావా అనితా?
అని . చచ్చిపోయాడు.
రవి . వెరీగుడ్, ఆ శవాన్ని పట్టండి, రహస్యంగా కారులో తీసుకెళ్ళి
ఊబిలో పారవేద్దాం.
ఆనం. అవును.
చం . పట్టండి,
[మురళి, చంద్రం, ఆనంద్ చక్రవర్తి శవాన్ని బయటికి మోసు
కుపివెనుకగా రవిగూడా వెళ్ళారు]
అని . (విరగబడి నవ్వుతుంది)
[ఆ నవ్వు విషాదంగా మారి యేడుస్తుంది]
అని . బావా! (అంటూ ఏడుస్తూ సోఫాలో కూలబడింది)

# ఐదవ రంగం

(అది విజయేంద్రభూపతిగారి భవనంలో హాలుగది, అలంకరణంతా మొదటిరంగం మాదిరిగానే ఉంటుంది. హార్పె మీటుందదు)

(తెర లేచింది)

[అనిత సోఫాకానుకుని క్రిందకూర్చొని యేడుస్తూ వుంటుంది. ఏడుస్తూ తన బావ చక్రవర్తిని తల్చుకుంటూ పాట పాడుతుంది]

(పాట - 10) (అనిత సాడ్ సాంగ్)

(పాట పూర్తయింది బయటనుంచి బలరాం వచ్చాడు]

బల . చక్రవర్తి .... ఒరేయ్ చక్రవర్తి [పిల్చాడు]

అని . వచ్చావా ... రా ... నయవంచకుడా ... మీ కపటనాటకం బట్టబయలైంది. అందుకే వాడ్ని నీ అనుచరుడ్ని.... ఆ అగ్గిరాముడ్ని నామరూపాలు లేకుండా చేశాను.

బల . ఏమన్నావ్? అగ్గిరాముడ్ని నామరూపాల్లేకుండా చేశావా?

అని : అవును, [బయటనుంచి రాజారాం వచ్చాడు]

బల; ఏం చేశావు అతన్ని?

అని . కాలకూట విషాన్ని త్రాగించి వాడి ప్రాణంతీశాను.

బల<br>రాజా : ఆ! [నిర్ఘాంతపోయారు]

అని : అవును ఆ దయా దాక్షిణ్యాలులేని కఠిన పాషాణహృదయుడు మా బావను హత్యచేసాడు. అందుకు ప్రతీకారంగా విషమిచ్చి ప్రాణం తీశాను.

రాజా: అవితా! యెంతపని చేశావ్.

అవి : కావాలనే చేశాను ఇన్‌స్పెక్టర్. ప్రభుత్వం నన్ను శిక్షిస్తుందని తెలుసు ఉరికంబం ఎక్కిస్తుందని తెలుసు నా ప్రాణం తీస్తుందనిగూడా తెలుసు. అయినా మా బావలేని ఒంటరి జీవితం నాకు నిష్ప్రయోజనం. అందుకేనేను మాబావదగ్గరికే వెళ్లాలనుకున్నాను.

బల : అవితా.

అవి : అవును. వెళ్తూ పగ సాధించాలనుకున్నాను... సాధించాను. అగ్గిరాముడ్ని అంతంచేశాను. ఇన్‌స్పెక్టర్ రండి...నన్ను అరెస్టుచేయండి

రా : ఎంతపని చేశావు అవితా.

బల : చివరికి నీ వ్రేలితో నీకన్నే పొడుచుకున్నావు.

అవి : యేమన్నావు?

బల : తొందరపాటుతో నీ భవిష్యత్తునే సర్వనాశనం చేసుకున్నావు.

అవి : కాదు. నా పగ చల్లార్చుకున్నాను.

రా : యెలా?

అవి : మా బావనుచంపిన అగ్గిరాముడ్ని అంతంచేసి.

బల : కాదు, నువ్వు విషమిచ్చి చంపింది అగ్గిరాముడ్ని గాదు.

అవి : మరెవరిని?

రా : మీ బావనే.

అవి : ఆఁ మా బావనా? ఏమిటి మీరంటున్నది?

బల : అవునమ్మా. అగ్గిరాముడిలా నటిస్తున్నది ఎవరో గాదు. మీ బావ చక్రవర్తి.

అవి : ఆఁ! బలరాం నువ్వు .... నువ్వుగూడా నాటకమాడి నన్ను నమ్మించాలనుకుంటున్నావా? నువ్వు అగ్గిరాముడి తొత్తువి.

రాజా: అవితా, ఏమిటా మాటలు?

అవి . అవును ఇన్‌స్పెక్టర్. ఈ బలరాం అగ్గిరాముడి అనుచరుడు.

రాజా: కాదు వీరు సి. ఐ. డి. ఇన్‌స్పెక్టర్ బలరాం,

అని : ఆ!

రాజా: అవును అనితా. కొందరు దుండగులు దొంగనోట్లు ముద్రించి చెలామణి చేస్తున్నారని తెలిసి, ప్రభుత్వంవీరిని పరిశోధనకు నియమించింది.

బల. వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి: దొంగను దొంగగానే పట్టుకోవాలి అందుకనే దొంగగా, హంతకుడిగా వేషంమార్చి కార్యరంగంలోకి దూకాను.

రాజా. ఇంతలో మీ మామయ్య హత్యచేయబడ్డాడు. మీ బావ అమెరికా నుండి వచ్చారు.

బల. ఆయనకెటువంటి ప్రమాదం జరగకుండా అగ్గిరాముడిగా మార్చి పరిశోధన కోసం నాటకమాడాం. ఇంతలో నువ్వు మీ బావే అగ్గిరాముడని తెలియక ప్రాణం తీశావు.

అని : ఆ! బావా [ఏడుస్తూ] నేను చంపింది మా బావనా? ఇన్స్పెక్టర్ ఇది నిజమా? నేనెంత పాపిష్టిదాన్ని. చేజేతులా బావనుచంపాను. మా బావను చంపాను. (ఏడుస్తుంది]

రాజా. నువ్వింతటి సాహసానికి పూనుకుంటావనుకోలేదు అనితా.

అని. బావా. [ఏడుస్తుంది] ఎవరికోసం ఆరుసంవత్సరాలుగా కలలు గంటూ బ్రతికానో, ఎవరికోసం క్షణమొకయుగంగా గడిపానో ఎవరికోసం నా జీవితం అంకితమనుకున్నానో ఆ బావనే ఈ చేతులతో విషమిచ్చి చంపాను. బావా [ఏడుస్తుంది]

బల. ఇన్స్పెక్టర్.

రాజా. యస్ సార్.

బల. మన ప్లానంతా తారుమారయింది.

రాజా అవును సార్.

బల . చక్రవర్తిని కావాలని యిన్ని ప్రయత్నాలు చేసిగూడా కాపాడలే పోయాం. ఇది మన డిపార్టుమెంట్ కే తీరని అవమానం,

రాజా. అది మన దురదృష్టం సార్.

అని . కాదు, దురదృష్టవంతురాలిని నేను. అందిన అదృష్టాన్ని కాల ద్రోసుకున్న నిర్భాగ్యురాలిని నేను [ఏడుస్తుంది)
బయట్నుంచి కానిస్టేబుల్ యూనిఫాంలో మన నాగన్న భీమన్న వచ్చారు]

నాగ . సార్ సార్.

రాజా. యేమిటోయ్?

భీమ . రహస్యం సార్.

బల . యేమిటది?

నాగ . చెవిలో రహస్యం సార్. [అంటూ బలరాం చెవిలో ఏదో చెప్పారు)

భీమ . (రాజారాం చెవిలో చెప్పారు]

బల
రాజా : [నిని ఒక్క సారిగా] ఆ! నిజంగానా?

భీమ
నాగ . (ఒక్క సారిగా] అవును సార్

బల . కమాన్ [అంటూ గబగబా బయటికి నడిచాడు]

[నాగన్న, భీమన్న, రాజారాం అతన్ని అనుసరించారు)

అని . బాలా ఏడుస్తూ కూలబడింది)

[బయటినుంచి మురళీధర్, ఆనంద్, చంద్రశేఖర్ వచ్చారు]

అని. అన్నయ్యా ... ఘోరం జరిగిందన్నయ్యా...

ము. ఏమిటమ్మా?

అని. నేను విషమిచ్చి చంపిన అగ్గిరాముడు మరెవరోగాదు అన్నయ్యా. పెదబావ చక్రవర్తే.

ము. నేను కాదన్నానా?

అని. అంటే? పెదబావే అగ్గిరాముడని నీకు తెలుసా?

ము. తెలుసు.

అని. ఆఁ ... తెలుసా?

ము. అంతేగాదు చెల్లెమ్మా. సి. ఐ. డి. యిన్‌స్పెక్టర్ బలరాం, ఇన్‌స్పెక్టర్ రాజారాం కలిసి ఈ నాటకం ఆడించారని ముందే తెలుసు. వారి ఎత్తులు చిత్తుచేయడానికి, ఆస్తికి సర్వాధికారి కావడానికి నీచేత చంపించాను.

అని. దుర్మార్గుడా.

ము. అనాల్సి ఫర్వాలేదు.

అని. నువ్వూ ఒక మనిషివా..; ఏ పాపమెరుగని పెదబావను నా చేత చంపించావు.

ము. నువ్వు చంపుతానన్నావు. నేను విషం తెచ్చిచ్చాను అంతే.

అని. ఛీ. నువ్వు స్వామిద్రోహివి. తిన్నయింటి వాసాలు లెక్కించే స్వామిద్రోహివి.

ము. అన్నం తిన్న కంచానికి కన్నం వేయడం నా అలవాటు కాకుంటే
అస్థి యెలా దక్కుతుంది చెల్లెమ్మ.

అవి. ఆస్తికోసం యింతటి కిరాతకానికి పాల్పడతావా?

ము. చేసింది చేసి నేరం నామీద వేస్తావా?

అవి. బావా (ఏడుస్తూ] నన్ను క్షమించుబావా! క్షమించు.

అ, అవితాదేవి. నిన్ను క్షమించడానికి మీ బావ బ్రతికిలేడు,

చం. బ్రతికి రాలేడు.
ము. రాలేడు.

(ముగ్గురు వికటంగా నవ్వుతారు. అవిత బిగ్గరగా యేడుస్తుంది)

ము. మై డియర్ ఫ్రెండ్ .... మనకున్న అడ్డుకాస్తా తొలగిపోయింది.
ఇక ఈ యావదాస్థి మనదే. హ.... హ.... హ.... హ....

అ. హ.... హ... హ.... హ....
చం. హ.. హ.. హ.. హ..
అవి. బావా [ఏడుస్తూ లోనికి పరుగెత్తింది)

ము. మైడియర్ ఫ్రెండ్స్. ఈ ఆనంద సమయంలో ఘనంగా విందు
చేసుకోవాలి. ఏమంటారు?

చం. యా,
ము. బాటిల్స్.

(చంద్రం, ఆనంద్, తమ పాకెట్లలోని బ్రాంది బాటిల్స్ బయ
టకు తీసారు]
[వాటిని అందుకొని మురళీధర్ గ్లాసులను నింపాడు]

తలాఒక గ్లాసు అందుకొని త్రాగబోయారు. ఇంతలో ఐ తు ట్నుంచి రవికాంత్ ప్రవేశించారు. అందరివంకా ఆశ్చర్యంగా చూ డు బ్రాంది త్రాగబోయిన ముగ్గురు అతన్నిచూచి ఆగారు. కొన్ని నిముషాలు మౌనంగా ఒకర్నొకరు స్థిర్పాగాచూచి చూసు కున్నారు, ఆ కాలమంతా మ్యూజిక్‌తో గడిచింది)

[లోపల్నుంచి అనిత వచ్చింది)

అని . బావా.. రవిబావా,

రవి . ఏమిటి అనితా!

అని . నేను చంపింది ఎవర్నో తెలుసా?

రవి : తెలుసు., అగ్గిరాముడ్ని.

అని ; కాదు, కాదు, నేను చంపింది మీ అన్నయ్యను.

రవి : [నిర్ఘాంతపోయి] అనితా ఏమన్నావ్- నువ్వు విషమిచ్చి చంపింది మా అన్నయ్యనా?

అని : అవును బావా.

రవి : యెంత పొరపాటు జరిగింది.

అని . బావా! నేను తెలిసి తెలిసి ఈ పాపాన్ని చేయలేదు. తెలిస్తే నా ప్రాణసమానంగా ప్రేమించినబావను చంపుకుంటానా? (ఏడుస్తుంది [రవి బాధగా మౌనంగా బ్రాందీతో నిండివున్న వాయిగవగ్లాసు తీసుకున్నాడు)

రవి : ముంశీధర్! యింతటి ఘోరాన్ని అనిత చేస్తుందని నేననుకోలేదు మా అన్నయ్యను, నా ప్రాణంతో సమానంగా ప్రేమించిన మా అన్నయ్యను. నాకోసం, నా క్షేమం కోసం అహర్నిశలు శ్రమిం చిన ఆ పుణ్యాత్ముని ఈ అనిత... ఈ వయవంచకి., ఈమానవ రూప కాలసర్పం విషమిచ్చి ప్రాణం తీసింది.

శం : ఆటాపాటా లేని పార్టీ మజాగా లేదు.

ఆ : మందుతో పాటు మగువ కూడా అవసరం.

రవి : అనితా, విన్నావా మా మిత్రులకోరిక. ఆడు, పాడు.

అని : నోర్ముయ్.

రవి : (అనిత చెంపమీద కొట్టాడు)

అని : [సోఫాలో పడింది)

రవి : (నవ్వి) అనితా, చెప్పింది చెయ్యకపోతే మీ మామయ్యను చంపిన చోటుకే పంపుతాను.

అని : ఆఁ.

రవి : అవును డియర్. ఒకప్రాణం తీసినవాడికి మరొక ప్రాణం తీయ డానికి జంకను.

అని : మీ నాన్నను చంపింది నువ్వా?

రవి : అవును,

అని : దుర్మార్గుడా, కన్నతండ్రిని చంపడానికి నీ చేతులెలావచ్చాయి?

రవి : కన్నతండ్రి (నవ్వి] ఎవరు కన్నతండ్రి? విజయేంద్ర భూపతి నా కన్నతండ్రా? నో. మురళీధర్, వాడు నా కన్నతండ్రా?

ము : నో

శం : నో, నో,

ఆ : నో, నో, నో

రవి : అసలు భూపతిని ఎందుకు చంపానో తెలుసా? మొట్టమొదటిసారిగా వీలునామాలో ఆస్తియావత్తు తనకొడుకు చక్రవర్తి పేర వ్రాశాడు. నమ్మకంగా నటించి ఆ వీలునామాను రద్దు జరిపించాను రెండవ సారి వీలునామాలో మా ఇద్దరికీ చెరిసగం ఆస్తి వ్రాయమని లాయర్ చంద్రశేఖరంతో అన్నాడు.

శం : రవిబాబు క్షేమంకోసం ఆస్తి మొత్తం రవిబాబు పేర వ్రాసాను.

ఆ ముసలాడు పూర్తిగా శ్రద్ధగా చదవకుండానే వెర్రికళ్ళతో సంతకం పెట్టాడు.

రవి. ఆ వీలునామా మారగూడదని కక్షతో ఆస్తి నా వశం కావాలని ముసలాణ్ని చంపావు.

అని. ద్రోహి

రవి. అంతేగాదు. చక్రవర్తి వస్తున్న విమానాన్ని కూల్చివేయమని కొంతరు అనుచరుల్ని నియమించావు. ఇన్‌స్పెక్టర్ ఆ ప్రమాదాన్ని తప్పించాడు.

వం. అందుకే నీచేత విషమిచ్చి చంపించావా.

అని. అయితే నాకే అగ్గిరాముడని మీ అందరికీ తెలుసన్నమాట

రవి. (నవ్వి) తెలుసు అనితా! మా ఆనందం కోసం ఇంతదాకా సంతోషంగా పాడు

అని. ఆడను,.. పాడను

రవి. ఆడు

అని. ఆడను

రవి. పాడు

అని. పాడను.

రవి. (బెల్టుతీసి అనితను కొట్టాడు]

అని. బావా!

రవి. ఊఁ. ఆడు, పాడు.

(అనిత డాన్సుచేస్తూ పాట పాడ్తుంది నలుగురు గ్రాంద్ పేనిస్తుంటారు)

[పాట - 11] [అనిత డాన్సుసాంగ్]

[పాట పూర్తయింది. అనిత ఆడలేక పడిపోతుంది)

అని. బావా! [దగ్గరగా జరిగి పడిపోయింది)

చక్ర. [వస్తూ వాకిలివద్దఆగి] వచ్చాను అనితా [ఒకచేతిలో పిస్టల్ వుంది]

రవి. అఁ! అన్నయ్యా!

ము ' బావా!

రం . చక్రవర్తి

ఆనం. అ:.... చక్రవర్తి.

అవి . బావా [అంటూ పరుగెత్తుకెళ్ళి కౌగలించుకుంది)

రవి . నువ్వు బ్రతికే ఉన్నావా?
చక్ర నీ ఆట కట్టించనిదే మరణిస్తాననుకున్నావా?
ము . హూ: వాడ్ని పట్టుకోండి.

(చంద్రం ఆనంద్ ముందుకు రాబోయారు]
చక్ర . ఆగండి! అడుగు ముందుకేసారా? మీ గుండెలు చీలుస్తాను జాగ్రత్త.
ము . చక్రవర్తి!

చక్ర . నోర్మూయ్. తిన్నయింటి వాసాలు లెక్కపెట్టే స్వామిద్రోహులు. [బయటునుంచి రాజారాం, బలరాం, నాగన్న, భీమన్న. వచ్చారు. రాజారాం, బలరాం చేతులలో పిస్టల్సు ఉన్నాయి]

బల . వూ:... ముతా అంతా యిక్కడే ఉందన్నమాట.

రాజా. కానిస్టేబుల్స్.

నాగ
భీమ . యస్ సార్.

రాజా. వూ:. బేడీలు వేయండి.

[నాగన్న, భీమన్న నలుగురు చేతులకు బేడీలు వేసారు]
రాజా. వూ:. పదండి.
(నాగన్న భీమన్న నలుగురినీ బయటికి లాక్కెళ్ళారు. వెనకగా రాజారాం వెళ్ళాడు]

బల . మిస్టర్ చక్రవర్తి! విషానికి మందే విరుగుడు మంత్రాగి మీ

రైల్వే యూనియన్ [illegible] పంచవర్ష [illegible]త్సవ సందర్భమున విజయవాడ రైల్వే ఇన్‌స్టిట్యూట్ ఆడిటోరియం నందు ప్రదర్శించిన విజ్ఞానాభ్యుదయ నాట్యమండలి

**నటీ నటవర్గం :**

కరుణాకరం : శ్రీ పి. వెంకటేశ్వరరావు
మధు : శ్రీ జి. వి. మల్లేశ్వరరావు
మదన్ : శ్రీ పి. వై. రత్నం (బి. యస్. సి.)
సత్యం : శ్రీ కె. విజయగోపాల్
రమణ : శ్రీ యస్. బాబూరావు
మాష్టారు : శ్రీ టి. వి. దయాసాగర్
రత్నాలు : శ్రీ జె. బిక్షాలు (జి. జి. హెచ్. గుంటూరు)
డాక్టర్ : శ్రీ యం. డి. సమీవుల్లా బి. కాం.
గీత : శ్రీమతి శైలజ (తెనాలి)

**సాంకేతిక నిపుణులు :**

దర్శకత్వం : శ్రీ టి. జోసఫ్ బి. ఏ.

ఆర్గనైజర్ : శ్రీ టి. సుబ్బారామయ్య
[వి. ఆర్. ఆర్. ఇన్‌స్పెక్టర్]

**సంగీతం** : మాస్టర్ బాబు, కుమారి అన్నపూర్ణ (వీణ)

నేపథ్య గాయకులు : శ్రీ వి. జీవరావు, శ్రీ డేవిడ్, శ్రీమతి రాధ.

పర్యవేక్షణ : శ్రీ కె. వెంకటేశ్వర రావు
(రైల్వే టెలిగ్రాఫ్ ఆఫీస్ ఇన్‌ఛార్జి)

ది. 25_5_76 వ తేదీన మొట్టమొదట ప్రదర్శించిన
శ్రీ సర్వోదయ యూనిట్, రావెలవాడు

పాత్రవర్గం :

కరుణాకరం : శ్రీ టి వి రెడ్డి

సాధు : " ఇ. భరతారెడ్డి బియస్సి. బియిడి

మదన్ : " ఆర్. పారనాథ్, బియస్సి.

సత్యం : " యం. సుధాకరరెడ్డి

రమణ : పి. వి. యస్ రామకృష్ణ (డ్రాయింగ్ టీచర్)

మహర్షి ; " యం. సాంబయ్య

[illegible] : " ఆర్. పుల్లారావు

డాక్టరు ; " పరమహంసారెడ్డి

గీత : " శ్రీమతి శైలజ [తెనాలి]

సాంకేతిక నిపుణులు ;

దర్శకత్వం ; సర్వోదయ యూనిట్

సంగీతం ; వెంకటేశ్వరా మ్యూజికల్ యూనిట్ (తెనాలి)

సెట్టింగ్స్ ; కె. కె. రావు

నిర్వాహ ; శ్రీ టి. వి రెడ్డి

## మీ ముందు నిలిచే పాత్రలు

కరుణాకరం — [న్యాయవాది] వయస్సు 45 సం.

మధు - (న్యాయవాది కొడుకు) " 20

మదన్ - (కసితో చెరునీటిని వెలుగును చూసినవాడు) " 16

సత్యం — (విప్లవజ్వాలగా రగిలి చీకటిగా మిగిలినవాడు) " 25

రమణ — (మహానటుడు కావాలని హోటళ్లో తిరిగినవాడు) " 25

మహర్షి — (అభ్యుదయ భావాలు ఇతని ఆభరణాలు) " 2[illegible]

రత్నాలు - (న్యాయవాది ఇంట్లో దీపం) " 25

డాక్టర్ - (సత్యం తెలిసినవాడు) " 40

సీత - (సత్యానికి చెల్లెలు కావటంతో అభాగిని అయింది) " 18

శ్రీ నవజ్యోతి నాట్యకళామండలి, వంగుపాలెం కోడూరు

నటవర్గం :

కరుణాకరం - శ్రీ వై. పుష్పరాజ్

మధు - శ్రీ బర్మా ప్రసాద్

మదన్ - శ్రీ పి భాస్కరరావు [టీచర్]

సత్యం - శ్రీ సిహెచ్. క్రిజన్‌సన్

రమణ - శ్రీ సిహెచ్. మాణిక్యరావు

మహర్షి - శ్రీ సిహెచ్. నాగేశ్వరరావు [బి కాం]

రత్నాలు - శ్రీ యం. ఏసురత్నం

డాక్టర్ - శ్రీ యం ఎల్లమంద

గీత - కుమారి జి. విజయ (తెనాలి)

సాంకేతిక నిపుణులు -

దర్శకత్వం - శ్రీ సిహెచ్ క్రిజన్‌సన్

నిర్వహణ - శ్రీ సిహెచ్ మాణిక్యరావు

ఆర్గనైజర్ - శ్రీ సిహెచ్ ప్రేమయ్య

పర్యవేక్షణ - శ్రీ పి భాస్కరరావు

మ్యూజిక్ - శ్రీ సైదారావు అండ్ కృష్ణ పార్టీ (పొన్నూరు

సెట్టింగ్స్ అండ్ మేకప్ - శ్రీ కె కె రావు (గుంటూరు)

# శీలానికి శిక్ష

## మొదటి రంగం

[అది పెంకుటిల్లు, ముందుహాల్లో గోడలకు దేశనాయకులఫోటోలు, విశ్వకవుల కాలెండర్లు, ప్రకృతిచిత్రాలు తగిలించారు. రెండు కుర్చీలు, ఒక డ్రాయరు, పాతటీపాయ్ ఆ ఇంటి అలంకరణలు. తెర తొలగేసరికి గీతా, మధూలు వీపులు ఆనించుకుని మౌనంగా కూర్చునివున్నారు. మౌనం పెదాలపై చిరునవ్వులా విరిసింది. ఆ చిరునవ్వులు దిక్కులు పిక్కటిల్లేలా చేశాయి. కళ్ళలో మెరిసే ఆనందాన్ని, పెదవులపై పూచే కోరికల్ని తృప్తిగా తుడుచుకున్నారు గతంనుండి తేరుకుంటూ]

**మధు :** మాట్లాడు.

**గీత :** నిన్నుచూస్తుంటే మాటలే రావటంలేదు.

**మధు:** మూగదానివై పోతావ్ సుమా!

**గీత :** (కిలుక్కున నవ్వి అతని బుగ్గమీద వ్రేలితో పొడిచింది. అతనూ నవ్వాడు ఇద్దరూ కలిసి ఆనందంగా పాడుకున్నారు)

**మధు:** నాకో బహుమానం ఇస్తావా?

**గీత :** మనసే ఇచ్చానుగా.

**మధు:** అంతకన్నా మధురమయింది కావాలి.

గీత : నువ్వడిగితే ఏది కాదనాన్నను?

మధు, అయితే ఇంకేం? ఒక తీయనిముద్దు పారేయి మరి – (అ ప్రయత్నం చేశాడు)

గీత : ఆగండాగండి– ఇంత ఆత్రం మంచిదికాదు.

మధు: అందాలుపూరించడం – అందకుండా పారిపోవడం– మీ ఆడవాళ్ళకు అలవాటేలే.

గీత : అందిన అందాలను వాడినమందారాలుగా చేయడం మీ మగవాళ్ళకు మాత్రం అలవాటు కాదా ఏమిటి?

మధు: పూలు విరియగనే సరికాదుగీతా! వాటిపరిమళం బయటపడాలంటే జడలోనో– ముడిలోనో చేరాలి.

గీత : పాపం—ఎంతాశ (సిగ్గుతో తలొంచింది)

మధు: ఆశ మానవుడిసొత్తు గీతా! హక్కు–కూడా.

గీత : ఇంకా నయం. ఆస్తి అనలేదు.

మధు: అవునుగీతా: ఆస్తికూడా అందుకే మనిషి ఆశను నమ్ముకుంటాడే గాని హృదయాన్ని అమ్ముకోడు గీతా, పరువానికి పరవశానికి పగ్గంకావాలి, వూహలకూ, వూపిరికీ పూరటకావాలి, అందుకే... అందుకే.... నన్ను నీలోకి చేర్చుకో గీతా!

గీత : మధూ! (ఆనందంతో నోరు నొక్కేసింది)

మధు: నిజంగీతా! జీవితంలో సుఖానికి నన్నొక్కణ్నే వారసుణ్ని చేశావు! కమ్మని కౌగలింతల పులకింతలలో నన్ను నేను మరచిపోయేంత మధురమయిన మత్తు కలిగించావు.

గీత : లేదు మధూ: మత్తయిన కోరికల్ని, మెత్తని ఆశల్ని నువ్వే కలిగించావు.

మధు: అవును గీతా! ఏ దూరతీరాలలోనో అనురాగం పెంచుకుందామని, ఆనందం పంచుకుందామని. తీయనికలలు గన్నాం. మనకలలన్నీ తీపి గురుతులుగా తొలకరి మెరుపులుగా మిగిలిపోగూడదని ఏ దేవుణ్నయినా కోరుకుందాం గీతా!

గీత : మధూ! (తన్మయత్వంతో సతమతం చేసింది)

మధు: చదువుల పరిచయం హృదయాలను కలిపింది. కళలూ కవితలూ మన స్నేహానికి ఊపిరిపోశాయి గీతా! ఈ చదువూ సంస్కృతి ఇలాగే వుండాలనీ ఈ బంధం జన్మజన్మల అనుబంధం కావాలనీ నేననుకుంటున్నాను. మరి నువ్వేమంటావు?

గీత : తిరిగి జన్మంటూ వుంటే నీనీడనే ఇంతచోటు ప్రసాదించమని దేవుణ్ని వేడుకుంటాను మధూ.

మధు: మరి నేనడిగింది? (ముద్దు కావాలని సైగ చేశాడు)

గీత : ముందు నాకో మాటివ్వాలి?

మధు: వెంటనే ఆ మూడుముళ్ళు వేసి...

గీత : నన్నో తల్లిని చేస్తావు... అంతేనా?

మధు : అంతకన్నా ఆడదానికి కావలసింది మాత్రం ఏముంది గీతా! "అమ్మా" అనిపించుకునే అపురూపవరం భగవంతుడు మీకు ప్రత్యేకంగా ప్రసాదించాడు.

గీత : మీ మగవాళ్ళు యెప్పుడూ ఇంతేలే ఆడవాళ్ళను ముసలివాళ్ళను చేయాలనే చూస్తారు

మధు: అదేమిటి గీతా! పిల్లల్ని కనడం – వాళ్ళచిరునవ్వుల దివ్వెలు వెలిగించడం ఇష్టంలేదా నీకు?

గీత : పిచ్చిమధూ! కలలుగంటే, కరగిపోతాయి చెరిగిపోతాయి కూడా

మధు: చూడు గీతా! బ్రతుకుచుట్టూ నీవలపుతీగలే అల్లుకుపోయాయి గుండెల నిండా కన్నులనిండా నీ మమతలమల్లెలే విరిశాయి. నీ అడుగులో అడుగువేసి, ఎదలో యెదనుకలిపి, నవ్వులోనవ్వుగా చూపులో

నగు నన్నే ధిక్కరించి - ఎవరినో నమ్మి హృదయాన్ని అమ్మి దారితప్పిన నిన్ను క్షమించనే క్షమించను సుందరీ!

గీత : చూడు బావా,

రమ : బావ ... ఎంత మధురము ఎంత మార్దవము ఎంతమాధుర్యము, సుందరీ, ఏదీ, మరొక్కసారి. మమ్మలను "బావా" అనితీయగా పిలూ.

గీత : బావా.

రమ : ఆహా. జన్మ తరించినది సుందరీ అమృతము సేవించినంత తీయగావుంది మరొక్కసారి...

గీత : బావా.

రమ : ఆహా, ఇంకొక్కసారి.

గీత : బావా.

రమ : ఆ, బావా అని బాంధవ్యము కలిపినంత మాత్రమున చేసిన అప రాధము అదృశ్యమగుననియా నీ అభిప్రాయము లేదుసుందరీ లేదు. అవక్ర పరాక్రమశాలి - అఖండ - ప్రచండ - ప్రతాప - ప్రభా వోపేతుడు- నవరత్న ఖచిత సింహాసనాధికారము- హ స్తగతము చేసుకొని - ఆంతరంగిక భటులతో - అంతఃపుర కాంతలతో - రేయి పగళ్ళుమరిచి - పాపపుణ్యాలు విడిచి - రక్తరాజ వినోదా కితుకావాలని - పూరణ చెందుచున్న నన్ను కించపరిచి - వం చించిన నేరానికి - నిన్ను కఠినముగా శిక్షింపకుండిన - యిక మేమెందులకు? మా రాజరికమెందులకు? మా కౌరవ వంశ గౌరవ ప్రతిష్ఠలెందులకు?

గీత : అప్పప్ప ఏమిటిబావా నీ గోల?

రమ : అవమానము. సహించరాని అవమానము. ఎవరక్కడ? ఈ పిచ్చ రాలిని, బంధించండి.

గీత : నేనుచేసిన అపరాధమేమిటో తెలవిస్తారా మహరాజా?

రమ : పంచభర్తృయైన - ద్రౌపది పతులను నిండుకొలువులో ఓడిపించిన ద్యూత క్రీడా ప్రవీణ్యులైన - దుర్యోధన చక్రవర్తి కుమారుం

తనే - మోసముచేయ సాహసించిన విన్ను విజువుగా పాతైయ్య
కుండిన - మహారాజాలమైన మాకు సిగ్గువేటు - అయినా, మాకు
కోప మొచ్చినా - తాప మొచ్చినా - అవజాలమనీ - నీకుమునపటి
వరసక్రీడా వమయమ్మున - విన్నవించలేదా సుందరి.

గీత : నేనుచెప్పేది వింటావా? లేక, ఇలాగే గోలచేస్తావా?

రమ : ఏమిటా అహంకారము, సభ్యతలేకుండా.

గీత : యిప్పుడేం జరిగిందని?

రమ : [నవ్వాడు హాస్యంగా] అవును, ఇప్పుడేంజరిగింది? ఐయాంసారీ గీతా! అనవసరంగా మూడొచ్చింది.

గీత : నాటకాలగొడవలో - నా ఊపిరి తీస్తున్నావు బావా.

రమ : నన్ను వట్టి నాటకాలరాయుడు క్రిందే జమకట్టావన్నమాట. ఇన్ వల్లు. గ్రేట్ ఇన్‌సల్టు మహానటుణ్ని వట్టుకుని - మరీచులకనగా మాట్లాడితే కళామతల్లి క్షమించదు.

గీత : కళమా - కళాకారుల్ని అవమానించటం నా ఉద్దేశ్యం కాదు.

రమ : మరేమిటి మువ్వనేది?

గీత . జీవితానికి కావలసిన కనీస వసతులు - కల్పించుకోకపోతే సంఘం మనల్ని గౌరవించదు బావా. అప్పుడు మానవతకు దూరమై పోతాడు మనిషి.

రమ : గీతా, ఏమిటి నువ్వు మాట్లాడేది?

గీత : బజానున వద్ద - కళాకారుల బనుపు బ్రతుకుల్ని గురించి.

రమ : హం, బ్రతుకులు, అన్నీ అతుకులు, గతుకులు

గీత : చూడు బావా. జీవితాన్ని తెగిన గాలిపటం చేసుకుంటావా?

రమ : గాలిపటాలైతే ఏ గమ్యానికైనా చేరుకుంటయ్ గీతా. కాని,కళాకారుల జీవితాలు, సముద్రంలోపొంగే తరంగాల వంటివి.

గీత : ఇవన్నీ తెలిసి, ఈ అకలిజీవితాన్ని ఎందుకు కోరుకుంటున్నావ్.

రమ , ఆ. క. లి యిది కళాకారుల తపస్సుకి, మేధస్సుకి,భగవంతుడు మిగిల్చిన ఆస్తిగీతా.

గీత : బావా.

రవి : అవును గీతా. ఉత్తమ కళాకారుల జీవితాలు చరిత్రకందని కన్నీటి ప్రవాహాలు. ఆఫ్‌కోర్స్ సమాజం మాత్రం లేదనీ. దరిద్రం తీరలేదని ఆశయాన్ని చంపుకుంటావా? లేదు, నేను చనిపోతే, నా సమాధి మీద ఓ పూలదండ వేస్తారు. సంతాపసభ చేస్తారు గీతా.

గీత : ఆ- అరగంటసేపు మర్చిపోయాను. వెంకటబావ పేరుమార్చుకున్నాడుగా?

రవి . పేరు మార్చుకోవడం - మనిషికో ప్రత్యేకమైన సరదా గీతా,

గీత , ఏదో నాటకాలు రాస్తున్నాడుగా.

రవి : వెధవనాటకాలు నేనూ రాస్తాను. ఏం చేయను.

గీత . ఇంతకీ "మహర్షి" గా మారిపోయాడన్నమాట?

రవి . మహర్షిగదాని మనసిచ్చేవు సుమా. మట్టిపాలుచేసి ఊరుకుంటారు.

గీత . అడిగిన ప్రతివాడికి ఇవ్వడానికి కాదు బావా- మనసుంది, నచ్చిన వాడికి అడగకుండా ఇవ్వడానికి.

రవి . సరి, నేను నీకు నచ్చినవాణ్ని కాదా గీతా.

గీత . నీకేం బావా, చాలా అందంగా వుంటావు?

రవి . అందాల పోటీపెడితే, నేనే మొదటివాణ్ణి అవుతానని. మొన్న ఓ అమ్మాయి చెప్పింది గీతా.

గీత . అందుకే బావా. నువ్వంటే.... నాకు చాలాయిష్టం.

రవి . నీకేమిటి గీతా. అందరికీ ఇష్టమే. ఎందుకంటే, నటుణ్ణికదా. అసలు నేను బజారుకు బయలుదేరితే, అంతా చేతులెత్తేవాళ్ళే కొట్టడానికాదు. నమస్కారాలు పెట్టడానికి.

గీత . ఆ, వెంకటబావ గూడ ... ఇలాగే చెబుతాడు.

రవి . రంగురంగుల మాటలుచెప్పి ... మనసుకు రంగుపూస్తాడు గీతా, జాగ్రత్త.

గీత . నేనంత తెలివితక్కువదాన్నేం కాదులే బావా.

రవి , తెలివి ఎక్కువయినా ప్రమాదమేలే- ఎందుకంటే, నాలాంటివాళ్ళ కాలు అడుగునేవాళ్ళను నమ్ముకుంటే- నాలుగురోజులు హాయిగా బ్రతకొచ్చు. కాని ... నాటకాలు రాసేవాణ్ని నమ్ముకుంటే -

పగలూ, [illegible], [illegible] కలిసి [illegible] గుర్తొచ్చే [illegible] గుర్తురానుకో – వస్తా. (అంటూ బయటికి వెళ్ళిపోయారు. గిత లోపలికి వెళ్ళబోయింది. బయటనుండి మదన్ సిగరెట్ కాలుస్తూ వచ్చారు)

మ . గితారాణీ!

గిత . (వెనక్కి తిరిగింది. అతనెవరో తెలీక మదుర మూసేసింది)

మ . ఏమిటి అలా చూస్తున్నావు?

గిత . మీరు ఎవరో గుర్తులేక-

మ . (నవ్వాడు) నా పేరు.... మదన్.

గిత . మీరేనన్నమాట?

మద. నా జాతకం తెలిసిందన్నమాట?

గిత . కొందరి జీవితాలు – జాతకాలు చెప్పకుండానే తెలిసిపోతాయ్ —

మద. అయితే ఇంకేం? నేనెందుకొచ్చానో చెప్పండి చూద్దాం.

గిత . మీరు చెబితేనే బాగుంటుంది.

మ . చెప్పటం నాకెప్పుడూ అలవాటులేదు గితా.

గిత . మీరు చాల తమాషయినవారే-

మ . నాపనులు ఇంకా తమాషాగా వుంటయ్.

గిత . గారడీ చేస్తారా?

మ . గంగిద్దుల్ని ఆడిస్తాడు.

గిత . అర్థమైంది. ఇంతకీ మీరెందుకొచ్చారో?

మ . నీ కోసమే-

గిత . ఏమిటి మీరనేది?

మ . నన్ను మరీఅంత గౌరవంగా సంబోధించడం నాకు నచ్చదు గితా. కట్ కటుగా మాట్లాడటం – చట్ పట్ గా పనిచేసుకోవడం. నాకు ఖలేమోజా.

గిత . నేనడిగింది.... మీరెందుకొచ్చారని?

మ . నేను ఎవరనుకుంటున్నావు గితా?

గిత . ఇప్పటిదాకా మనిషిననుకున్నాను.

మ . పొరపడ్డావు గీతా. అందాలు పిండేసేవాణ్ణి.

గీత . తెలిసింది.

మ . ఆనందాలు పదిమందికీ పంచిపెట్టేవాణ్ణి.

గీత . యింకేమీ చెప్పక్కరలేదు.

మ . నాకు తెలుసు గీతా. చాలామంది ఆడవాళ్ళు నన్ను అసహ్యించుకుంటారు కౌగిలిరుచి తెలిక స్వర్గానికే దారిచూపిన తర్వాత...వాళ్ళను వాళ్ళే మరిచిపోయి నా గుండెలమీద నిద్రపోతారు. చెరగనిముద్ర వేస్తారు.

గీత . చాలు... ఇకమీరేం మాట్లాడకండి.

మ . నీకు అసలువిషయం చెప్పనేలేదు కదూ?

గీత . దయచేసి వెళ్ళితేచాలు .

మ . మదన్ వచ్చినతర్వాత – పని పూర్తికాకుండా వెళ్ళడం చరిత్రలో లేదు గీతా!

గీత . అంతే... అంతే...? మీరు.

మ . అనవసరంగా ఎందుకు నన్నింత గౌరవంగా పిలుస్తావు? అందంగా మదన్ అంటేచాలు, అసహ్యంగా మాట్లాడితే చాలు. కసితో ద్వేషిస్తేచాలు. నోటికొచ్చినట్లు తిడితేచాలు. నన్ను నిజంగా ప్రేమిస్తున్నావని సంతోషంగా వెళ్ళిపోతాను.

గీత . ఓ మైగాడ్! ముందిక్కడనుండి వెళ్ళిపో.

మ . వెళ్ళకపోతే?

గీత . నాకు కోపంతెప్పించకు మదన్.

మ . కోపంలో యెరుపెక్కిన నీ బుగ్గలు చూడాలనివుంది గీతా.

గీత . ఛీ. యేమిటా మాటలు? మర్యాదగా బయటికివెళ్ళు– నేను తలుచుకుంటే – ఏమైనా చేయగలను.

మ . (నవ్వుతూ హేళనగా) మరి, నేను తలుచుకుంటే – నిన్నూ – నీ అందాన్ని – ఏం చేయగలనో – తెలుసా గీతా.

త . మదన్.

మ . చూడుగీతా. ఆకలితో యెదిగినవాళ్ళు, ఆవేశాలతో ఎదిగిన అతి వాళ్ళు ఆఖరికి ఈ మదన్ కౌగిలిలో ప్రాగ్గిపోయారు.

గీత . వాళ్ళంతా విస్సహాయులు, నిర్భాగ్యులు.

మ . కాదుగీతా. వీలాంటి అహంకారులు. యవ్వనం విగిపినవారు వీతా తలొంచారు యెందుకంటావ్?

గీత . నీలో మానవత్వం వచ్చిందని.

మ . కాదుగీతా, మమత, అనురాగం పెంచిందని.

గీత . మదన్.

మ . గీతా, బెట్టుచేయడం ఆడవాళ్ళకేం కొత్తగాదు. అప్పుడే మగవారయిన ప్రతివాడికీ — ఓ పట్టుపట్టాలని ఉబలాటం పుడుతుంది. రా గీతా. జీవితాన్ని చీకటిచేసుకుంటే మనసు వేదన పడుతుంది. గుబులుగావున్న గుండెల్ని చిరునవ్వు లో పలుకరించు, రా గీతా. (అంటూ మిదికెళ్ళాడు. ఆమె భయంగా దూరంగా వెళ్ళింది)

గీత . మదన్ వెళ్ళిపో నా ప్రతికను కలుషితం చేయకు, నా భవిష్యత్తులో ముళ్ళుచల్లకు నీకు పుణ్యముంటుంది వెళ్ళు మదన్, వెళ్ళిపో.

మ . నేనేం పాపంచేశానని పుణ్యంకావాలి నాకు? పిచ్చి గీతా జీవితంలో అనుభవించలేనిదీ, కూడనిదీ ఏదీలేదు అందులో అందరాలలో వున్న ఆడది. నవరసాలు నాట్యంలో ప్రదర్శించగలిగే. నవనవలాడే ఆడది యెదురుగా వున్నప్పుడు - యెవరు తడుకున్నప్పుడు తిరిగి వెళ్ళడమే మహాపాపం.

గీత . మదన్

మ . యేం కావాలి నీకు?

గీత . ముందు మవ్వెళ్ళితే చాలు.

మ . ముద్దుగా నాలుగుముద్దులు అందించుమరి.

గిత, అది జన్మలో జరిగేపని కాదు.

మ. ఏ కోపం మరో జన్మకూడా యెత్తుతాను?

గిత. ముందిక్కడనుండి వెళ్తావా లేదా?

మ. వెళ్ళలేను గితా. వెళ్ళిపోలేను. నా కళ్ళముందు. నగ్నంగా నాట్యం చేస్తున్నట్లు నువ్వు కన్పిస్తుంటే – ఎలా వెళ్ళగలను? ఎటు వెళ్ళగలను? అందుకేగితా? నువ్వే రా! నా గుండెలదాకా రా! నా హృదయం చల్లారేదాకా రా! నా కోరిక తీరేదాకా రా! రా గితా రా! (అంటూ చేతులుచాపుతూ ఆమెమీదకు వెడుతుంటే – ఆమె తప్పుకుంది.)

గిత. యేమిటీదౌర్జన్యం? పికిది న్యాయంకాదు. దయచేసివెళ్ళిపో మదన్.

మ. చూడు గితా! వెళ్లూ వెళ్ళూ వెళ్ళూ అంటే నాకు చాలాకోపం వస్తుంది. అయినా నన్ను అవమానించడం నీ వుద్దేశ్యం అయితే నిన్ను బలవంతం చేయడం నా సిద్ధాంతం అవుతుంది.

గిత. మదన్.

మ. మనోహరంగా కూటవినని నీలాంటి రంగురంగుబొమ్మల్ని ఎలాలొంగ దీసుకోవాలో ఈ మదన్ కు కొత్తేమీగాదు. రా.

గిత. వసు పో.

మ. ఒక్కసారేగా.

గిత. పీల్లేదు.

మ. గితా!

గిత. వెళ్ళిపో.

మ. ఎంత అణకువగా చెప్పినా – అర్థం చేసుకోలేకపోతే. నేనేం చేస్తానో తెలుసా? భవిష్యత్తులోకి సాగిపోయే నీ బ్రతుకు తీగను త్రెంచివేస్తాను.

గీ. మదన్.

మ. నీ రాతను తుడిచివేస్తాను.

గీ. నో ర్మయ్.

మ. నీ జాతకాన్ని మార్చేస్తాను.

గీ. మదన్, మదన్, నామీద నీకేమిటి పగ?

మ. పగకాదు గీతా! ప్రేమ, అభిమానం.

గీ. నీకు హృదయం లేదూ?

మ. ఉందిగనుకనే . మనిషిలా అడుగుతున్నాను. నాకున్న ఒక్కొక్క నరములో .... ప్రేమ .. అనురాగం ... మమత మానవత నిండి ఉన్నాయిగనుకనే నువ్వింకా మాట్లాడగలుగుతున్నావు గీతా. నేను నువ్వనుకునేంత నీచుణ్ణికాదు. ఒక కన్నెని కౌగిలింతలో పులకించిపోవాలి అంటున్నాను, ఒక్క తీయ ముద్దుతో నన్ను ముగ్ధుణ్ణి చేయమంటున్నాను. ఎర్రవిఱిగ్గల్ని ఒకే ఒకసారి నా పెదాలకు అందించమంటున్నాను. ఇవన్నీ తప్పులయితే నీ ఇష్టమొచ్చినంతసేపు నన్ను నీ చేతుల్లో బంధించు విగించు, ఆడించేయి. నేను సిద్ధంగావున్నాను. కమాన్ గీతా. కమాన్. (చేతులు చాపాడు)

గీ. యూ ఫూల్ (కోపంతో పళ్ళు బిగించింది)

మ. గీతా పెదాలపై పూరే మధువులూ. నిగలో విరిసిన మల్లెలు-యవ్వన పరువాలు- ఉప్పొంగే కలశాలూ - అన్నీ వృధా చేసుకుంటావా? వద్దు గీతా. నామీద నీకు ప్రేమ లేకపోయినా కసితోనయినా కౌగలించుకో కైపెక్కించి అయిదుచేసి కక్షతీర్చుకో రా గీతా. రా (అంటూ ఆమె వద్దంటున్నా వినిపించుకోకుండా కౌగిలించుకున్నాడు. గీత పెనుగులాడి చెంపమీద కొట్టింది. మదన్ చెంప చేతితో పట్టుకున్నాడు, యింతలో బయటనుండి సుహాసిని వచ్చింది.

గిత కలాంమసుని లోనికివెళ్ళింది. మదన్, మహర్షి ఒక నొకరి చూసుకున్నారు.

మహ. దెబ్బ తగిలిందా?

మద లేదు. ఆమె వేసిన ముద్రలు చెరుపుకుంటున్నాను.

మహ జీవితమ్మీద ... కాలం ఎన్నో చెరగని ముద్రలు వేస్తుంది.

మద . వాటిని చెరపవలసింది నేనుకాదు, ఈ సంఘం, ఈ మనుషులూ, ఈ సంస్కృతి.

మహ, సంఘంలో నువ్వూ ఒక మనిషివేగా?

మద . మనిషినే... కాని నన్ను మానవతకు దూరం చేసింది ఈ సంఘం.

మహ (నవ్వుతూ) నువ్వే దూరమైపోతున్నావు.

మద . దానికి కారణం తెలుసా?

మహా. నీ అంతరాత్మ నడిగిచూడు.

మద . అదీ చచ్చిపోయింది ఇప్పుడు, ఎప్పుడో, ఎప్పుడో చచ్చిపోయింది సజీవదహనమైపోయింది. అందుకే దారి మార్చుకున్నాను.

మహ. ముళ్ళదారుల్లో నడిస్తే — బ్రతుకునిండా గాయాలవుతాయి.

మద . గుండెపగిలి ముక్కలై పుండుగా మారినతర్వాత బ్రతుకుమీద గాయాలకు భయపడనవసరం లేదు.

మహ. మనిషిలా జీవించడం నీ కిష్టంలేదన్న మాట?

మద . జీవితాన్ని కసిగా అనుభవించడం నాలాంటివాళ్ళకు చాలా అవసరం.

మహ. నీ అవసరాలకోసం యితరుల బ్రతుకులమీ నిప్పులు పోస్తావా?

మద వాటిని అక్షింతలుగా భావించేవాళ్ళు దొరికితే అదృష్టవంతులవుతారుగా.

మహా. యిది ఒక అదృష్టమే: నిముష నిముషానికీ తలొంచి ... మనిషి
మనిషికి చేజాపి- చట్టానికి సంఘానికీ, భయపడుతూ- నరకాన్ని
ప్రత్యక్షంగా అనుభవించటం కూడా - ఒక అదృష్టం దాన్నిమళ్ళా
కరు పంచుకోవాలి,

మద. గీతను ప్రేమిస్తున్నావా?

మహా. ప్రేమించటం సరదాకాదు.

మద. యేమిటి నువ్వు మాట్లాడేది?

మహా. విషాదాన్ని, పరీవాన్ని ఇతరుల బ్రతుకులమీద చల్లను అంటు
న్నాను.

మద. మదన్‌కు యెదురుచెప్పేవాళ్ళు యింతవరకూ యెవ్వరూలేరు.

మహా. బ్రతుకుమీద ఆశ - భవిష్యత్ మీద తీపి నాకు లేదు.

మద. నువ్వు అబద్ధాలు నిజాలుగా మార్చేవాడివి,

మహా. యేమిటి నీ ఉద్దేశ్యం?

మద. నీ అంతరాత్మ నడిగిచూడు వస్తా. (వెళ్ళబోయాడు)

మహా. యింకెంతకాలం సాగిస్తావు ఈ అరాజకాలు!

మద. బ్రతుకు స్వర్గం అయ్యేదాకా.

మహా. స్వర్గాన్ని చేతులారా నువ్వే నరకం చేసుకుంటున్నావు?

మద. కాంతివిలువ తెలిసేదాకా చీకటి వుండాలిగా,

మహా చావు సిద్ధంగా వుందనే మనం బ్రతుకుతున్నామా?

మద. బ్రతుకులన్నీ యెప్పుడోసారి చావు తన్నుకుపోతుంది మహార్షీ!
వస్తా. (వెళ్ళబోయాడు)

మహా. మళ్ళీనా?

మద. ఇప్పుడు నువ్వు రాకుండావుంటే మళ్ళీ నేను రావలసిన పని ఉం
దేదికాదు వస్తా [అంటూ చరచరా బయటికి వెళ్ళాడు గీత ఎదురుస్తు
బయటికొచ్చింది.]

మహా. యేడుస్తున్నావా గీతా?

గీత. నాకు మిగిలింది ఏడుపేనా బావా [దుఃఖం ఆగలేదు]

మహా. కళామూర్తి కన్నీళ్ళు భూమాత భరించలేదు గీతా.

గీత. బావా!

మహా. తరతరాల పాపపంకిలంలో తడిసి - ముద్దయి పసిడిపంటలు పండే తెలుగుగడ్డ - విస్ఫారమై విశ్వేర్యమై మట్టిగానే మిగిలిపోతుంది గీతా.

గీత. నీ సాహచర్యానికి యెలా కృతజ్ఞతలు తెలుపను బావా ఎలా అభినందించను?

మహా. నాకో సహాయం చేస్తావా గీతా?

గీత. నీకూ మనసుకావాలా బావా?

మహా. ఇష్టంలేని మనసును అడిగి పుచ్చుకునేంత అవివేకిని కాదులే గీతా.

గీత. ఏం చేయమంటావు బావా?

మహా. మెరిసే కన్నులమంటి కురిసే కన్నీళ్ళకు - అర్థం చెప్పాలని వుంది.

గీత. నా బ్రతుకును బజారుపాలు చేస్తావా బావా!

మహా. గీతా.

గీత. నీ అభ్యుదయ భావాలకూ - కవితావేగాలకూ నన్నో కథావస్తువును చేసి - సాహిత్యంతో - చైతన్యంతో - వళ్ళంతా గాయాలు చేస్తావా, నేనేం తప్పుచేశాను బావా? ఆడదానిగా పుట్టిన నేరం కన్నా - యింకేం చేశాను?

మహా. రావణుడు గడ్డతో సహా పెకలించుకుని లంకకు మోసుకెళ్ళిన సీత కూడా ఆడదే గీతా.

గీత. అందుకే బావా. అవమానాలూ, అనుమానాలూ సహించలేక అగ్నిలో దూకింది.

మహా. విందు కొలువులో వలువలు వూడదీస్తుంటే కురులు విప్పుకుని మానాభిమానాలు కాపాడుకున్న ద్రౌపదిగూడా ఆడదేగా.

గీత. ఐదుగురు భర్తలున్నా అడవుల పాలుగాక తప్పలేదుగా.

మహా. వయసు తరిగిపోతున్న కొలదీ వచ్చేది ముసలితనమే గీతా.

గీత. అయినా ఆడదానికి అగ్నిపరీక్షలు భగవంతుడు ఎందుకు పెట్టాడు బావా?

మహా. నీ ప్రశ్నకు సమాధానం లేదు గీతా.

గీత. నా ప్రశ్నకి గూడా పరిష్కారం లేదు బావా?

మహా. ఉంది గీతా. అందుకే నేను కలంపట్టాను.

గీత. ఏపనీ లేనప్పుడు ఏదో ఒకటి చేయాలిగా.

మహా. నాకెంత పేరుందో నీకేం తెలుసు?

గీత: ప్రతి మనిషికి.... ఏదో ఒక పేరు ఉంటుంది బావా.

మహా: అయితే ... మనుషుల్ని చంపేవాడు - మానవతను పెంచేవాడు ఒకటేనంటావా?

గీత. మంచి చెడులమధ్య దూరం నాకుతెలుసు బావా.

మహా: తెలిస్తే... నువ్విలా మాట్లాడవు గీతా చంద్రమండలం వెళ్లేవాడికి తిరుపతికొండ మెట్లు ఎక్కేవాడికి – పెద్దతేడాలేదంటే – నిన్నేమనాలో అర్థం గావటంలేదు.

గీత: నన్నింతవరకే జమ కడుతున్నానన్నమాట.

మహా: లేదుగీతా. నువ్వునటివి. మహానటివి. నీలో ప్రకాశించే కళాతేజం.... ప్రపంచపు అంచులదాకా ... ప్రసరించాలి.

గీత: స్వార్థానికి హద్దుండాలి బావా.

మహా: ఆకాశానికి అంతుందా గీతా?

గీత: బావా.

మహా: అవును గీతా, మనిషి బ్రతకాలంటే – స్వార్థం కావాలి. కూడబెట్టడానికి – కుబేరుడు కావడానికి స్వార్థం కావాలి. ప్రేమించడానికి–

పేరు గడించడానికి స్వార్థం కావాలి. అసలు భవిష్యత్తులో నడయవిస్తున్న మనిషి ప్రతి అడుగూ స్వార్థమ్మీదే .. నడుస్తుంది. ఎంతోమంది జీవితాలు ఈ స్వార్థపు సోపానాలమీదే స్థిరపడ్డాయ్. చిగురించాయి కూడా.

గీత : గుండెల్ని బద్దలుచేసే .... స్వార్థానికి లొంగి - అంతరాత్మను మోసం చేసుకోలేను బావా. వస్తా! (వెళ్ళబోయింది)

మహా: ఆ.... గీతా అసలువిషయం చెప్పడమే మర్చిపోయాను మొన్న "కొంపలు తగలడాయ్" అనే గేయం రాశాను... విన్నావుగా?

గీత : "కొంపలారి పోతున్నయ్" అనికూడా చెప్పావుగా-

మహా: అవునవును... నిప్పు రాజుకున్న తర్వాత - పీల్చుకుపోవడం — ఆరిపోవడం జరుగుతుందిగా- ఇవ్వాళ గుళ్ళో సాహితీసదస్సు వుంది. వస్తావుగదూ?

గీత : సారీ బావా! నేను అరదాన్ని.

మహా: నే నాగరికతాలోకంలో ... పిడే పై చేయి.

గీత : చేయిదాటిన తర్వాత ... మనం కావాలనుకున్నవీ, కోరుకున్నవీ ఏమీ తిరిగిరావు బావా. నువ్వెళ్ళిరా-

మహా: చూడుగీతా. మొన్న గుళ్ళో ఉపన్యాసం చెబితే, చెప్పగూడదు గాని ... ఎన్నిచప్పట్లు- ఎన్నిదండలు- అచ్చం మల్లెపూలతో గుచ్చినదండలు - తల మునిగిపోయిందంటే- నమ్ము—

గీత : ఇప్పుడు నాకు తలమునిగిపోయేంత పనుంది బావా. వెళ్ళిరా- (అంటూ లోపలికివెళ్ళింది. మహర్షి నిట్టూర్చి బయటికి వెళ్ళాడు. తెర జారింది)

# రెండవ రంగం

(అలంకరణ మొదటిరంగంమాదిరేవుంది, గీత విచారంగాకూర్చుని వుంది మధు గులాబి తీసుకుని బయటనుండి వచ్చారు)

మధు : గీతా.

గీత : (చూసింది – విరాళవిందిన ప్రేమతో)

మ : ఈ గులాబి ఎంత అందంగావుందో చూడుగీతా.

గీత : దేవుని పాదాలపదకు చేరినప్పుడు ఇంకా అందంగా వుంటుంది మధూ కాని.... గండు తుమ్మెదలు దాని విందుజీవితాన్ని కలుషితం చేయకముందే కాపాడటం మంచిది

మ : ఏమిటి గీతా? పరధ్యానంగా మాట్లాడుతున్నావు

గీత : రక్షణలేని పువ్వులాగా ... నా జీవితం ...

మ : అదేమిటిగీతా. మధు జీవించివుండగా నీకేమీ అన్యాయం జరగదు జన్మజన్మలకూ ... నువ్వే- నేను భార్యభర్తలం గీతా.

గీత : మధూ!

మధు: చూడుగీతా. పరీక్షలు పూర్తికాగానే ఇంటికివెళ్ళి నాన్నమఒప్పించి పెళ్ళిఏర్పాట్లు చేస్తాను అప్పటిదాకా.... నిన్ను నా గుండెల్లోదాచుకుంటాను.

గీత : మధూ.

మధు: నువ్వు నాకు తోడుగావుంటే – అన్ని సంపదలూ ఉన్నట్లే. నీ నవ్వుల పువ్వులు వికసిస్తేచాలు, నా హృదయం పరవశించి పోతుంది,

గీత : నిజంగా నేనంటే నీ కెందుకింత అభిమానం?

మధు: నీకు నిండయిన హృదయం వుందిగీతా. ఆ హృదయంనిండా నేను న్నాను. అందుకే – అందుకే గీతా నువ్వంటే నాకిష్టం. (అంటూ ఆమెబుగ్గ గిల్లాడు)

గీత : అబ్బ. ఏమిటి చిలిపిచేష్టలు–

మధు: అందమయిన ఆడపిల్ల – అందుబాటులో వుంటే– మగవాళ్ళు ఏం చేస్తారో మరి?

గీత హద్దులు దాటితే – పెద్దలు కోప్పడతారు. దయచేసి.... వెళ్ళండి.

మధు: మరి ... మన మామూలు...

గీత : మామూలా– అదేమిటి?

మధు: (ముద్దు అన్నట్లు తెలిపాడు)

గీత : అబ్బాయిగారికి ఎంతాశ (అతని బుగ్గమీద చిటికెవేసి వెళ్ళబో యింది– మధు.... ఆమెపైట లాగాడు) అబ్బ యెవరలనా చూస్తారు.

మధు: చూడనీ – తొందరగా పెళ్ళయినా చేస్తారు.

గీత : మరీ అకతాయివై పోతున్నావు.

మధు: నువ్వు ఆకురాయివై పోవడంలేదు?

గీత : ఛీ పో– మొండి (అంటు వెళ్ళబోయింది – మధు అడ్డగించాడు. ఇదరూ డ్యూయెట్ పాడుకున్నారు. పాటచివర విడిపోతారు. క్షణం పిళ్ళద్దిం.. బయటనుంది మహర్షి వచ్చాడు. ఓ మహాకవి పోజులో నిలబడి ఆలోచిస్తున్నాడు. ఇంతలో రమణ వచ్చాడు.)

రమ : ఏమిట్రోయ్ కవీ దీర్ఘాలోచనలో వడ్డావు?

మహా: యేం లేదురా. మద్రాస్ వెళదామని-

రమ కూడు మహాన్షి. అక్కడ మానవకలు తప్పిపోయా ఎ న్నిన వాళ్ళంతా బ్రతుకుతున్నారు. శిలాన్ని ఎకమా పేవాళ్ళు. పిగ్గుల విరజిమ్మేవాళ్ళు- ఆత్మగౌరవాన్ని అమ్ముకునేవాళ్ళు - ఆమహా నగరంలో ఖరీదులేని వస్తువులు. అందుకే మహాన్షి. కళామతల్లి కుళ్ళికుళ్ళి ...ఏడుస్తూంది.

మహా: వ్యక్తిత్వం లేనివాళ్ళు- ఇక్కడావున్నారు రమణా

రమ : వాళ్ళగొడవ మనకెందుకులే-

మ. : నీ గొడవేమిటో చెప్పు-

రమ : నేనోకథ చెపుతా. నాటిక రాసిపెడతావా?

మ : శ్రి చేదాం చెప్పు.

రమ : అయితే నన్ను పూర్తిగా మూడ్ లోకెళ్ళిపోనీ- (అంటూ ఆలో చిస్తూ రెండడుగులు నడిచాడు) అ.... వచ్చినది మహాన్షి. మూడ్ వచ్చినది- ఇప్పుడు మా నటన ప్రశంసనీయం. నటులూ - మహా నటులూ అందరూ మనకు తల వంచవలసిందే అహా. మూడ్ వచ్చినదిగాని ఏదో మాటాడుచుంటిని- మహాన్షి. నేనో చిన్నకథ చెబుతానని గదా చెప్పితిని.

మ : అవును మహాశయా చెప్పితిరి, చెప్పితిరి.

రమ : అది ఒక ఉద్యానవనము:

మ : ఆ వనమందొక మేడ. మేడపైన,

రమ : కాదు మహాన్షి. ఆ ఉద్యానవనమున కొంచెము విశ్రమించుదమని జని- అచ్చటి పూ వరిమళాలు తృప్తిగా నాఘ్రాణించి—

తిరిగి అంతఃపురమున కరుగుచుండగా - నదివీధిలో ఒక అడ్డు వచ్చినది మహర్షి.

మహా: (నవ్వేదు) ఓరేయ్ నాటకాలు ఆడేవాళ్ళను చూసి నవ్వక-నాగరికత్తెవాళ్ళను చూసి నవ్వుతారా ఆడవాళ్ళనీ పిచ్చిగాని.

రమ : ఊఁ అంతే నవ్వుకోవిన నాకింత వేదన. ఆ వేదన యేల కలుగును ఆ సన్నుతాంగి మమ్ములను చూసియే నవ్వింది.. వాడి వాడి అమ్ములను రువ్వినది మహర్షి.

మహ: చాలా అదృష్టవంతుడివి

రమ : ఏమో మహర్షి తలచుకున్న కొలది- గుండెను తొలిచినట్లే అవుతున్నది ఏలనో మనసంతా, వెర్రిగంగులెత్తుచున్నది. అపగలాడి వాలుచూపులు మదీయ హృదయ కుసుమాన్ని గాయము చేసినవి.

మహా: ఇంతకూ మందేమీ వేయలేదా?

రమ: కొంచము ఊరట కలిగినపిమ్మట - వళ్ళంతా తడుముకుని- చూసుకుంటేనుగదా - మా అవయవాలలో చిన్న లోపము కానవచ్చినది మహర్షి.

మహా, అదేమిట్రా?

రమ : అవును మహర్షి ఉన్నవి, ఉన్నచోట వున్నవిగాని గుండె మాత్రము.. మొరటి గురుతులో లేక - యెక్కడో వేగిపోవుచున్నట్టు అయినది. అందుకే.. మేము ఆ పూబోడివెంటను చేరితిమి ఆ సుకుమారి.. సగౌరవంగా తన మందిరానికి ఆహ్వానించినది కూడ.

మహా: ఆమె అందంగా ఉందన్నమాట?

ర : ఆహా, ఆ వయ్యారి అందము గురించి – ఒక ప్రబంధము వ్రాయ వచ్చు మహర్షీ.

మ : రంభ – ఊర్వశి – మేనక – తిలోత్తమలు ....

ర : ఆమె కాలిగోటికి సరితూగరు మహర్షీ, అంతఃపుర కాంతలతో సరి తూగవలసిన నెచ్చెలి, ఒక సామాన్యుని ఇంట తన సౌందర్యానికి ముసుగు వేసుకోవుట, ఎంత సిగ్గుచేటు. ఎంతశోచనీయం.

మ : ఇంతకూ ఏం చేశావో చెప్పరా.

ర : ఆ అందాలబాలగు అక్కున చేర్చుకుని – ముచ్చట తీర్చుకోవాలని – ముచ్చటపడిపోయాను.

మ : ఒప్పుకుందా మరి.

ర : మహర్షీ, ఏల నీకి తొందర? వినుమూ, వళ్ళు పులకరించి పోవుట లేదుగదా.

మ : లేదులేవోయ్ – త్వరగా ఆఘోరించు –

ర : సుందరీ. మమ్మూలను చూసి – తలువుచాటున వేని – ఎందుకువివ్వితివి? మా గుండెలను ఎందుకిలా లాగితివి? అని, ముద్దుగా వేసితిని. ప్రశ్న.

మ : నిన్ను ప్రేమించానందా?

ర : ఆ లేతపెదవులనుండి, ఆ తీయనిమాట వస్తుందనే, ఆశ కాని, ఆ బేల కన్నీరు కార్చినది.

మ : ఎందుకురా?

ర : నేనూ ఆ ప్రశ్న వేసితిని ఆమె మరీమరీ, వెక్కి వెక్కి ఏడ్చినది. అప్పుడు మాకు ఆ జవరాలుమీద జాలి కలిగినది. దేవీ! ఏమిటా

కన్నీరు? ఎందుకిలా వెక్కి వెక్కి ఏడ్పుచుంటివి? అని గుచ్చి గుచ్చి అడిగితిమి.

మ : ఏం చెప్పింది?

ర : హృదయం ఒకసారే ముక్కలయ్యే మాట చెప్పినది. యువరాజా, నేను అందరినీ చూసి వచ్చేతాను మా ఇంటి తలుపులు ఎప్పుడూ తెరిచే వుంటయ్. అని చెప్పినది.

మ : అప్పుడు గదా, మా చిత్తము చిత్రవధ అయినది; అసలు మేము విశ్రాంతికొరకు ఆ ఉద్యానవనమ్మునకు ఏల పోవలె? పోయితిమి పో - గృహోన్ముఖులమై - పట్టణ మధ్యంబున కేల నేగవలె? ఏగితిపో, ఒక వలపుకింత, ఏకాంతముగా మమ్ములను చూసిఏల నవ్వవలె?

మ : నవ్వెనుపో- ఆ సుకుమారి పుట్టుపూర్వోత్తరాలు గుర్తింపకయే ఇంటిలోని కేల నరుగవలె?

ర : అరిగితిపో - ఆ వయ్యారి ఏల వెక్కి వెక్కి ఏడ్వవలె?

మ : ఏడ్చెనుపో-

ర : మేము యుక్తాయుక్త విచక్షణ విస్మరించి ఆమెను గుచ్చి గుచ్చి ఏల....

మ : [నవ్వాడు. రమణ కృతికలిపాడు]

ర : ఎలావుంది మనకథ?

మ : బాగుందిరా- చాలా బాగుంది- నా కలంలో బంగారు నాభావం జీవం ఇప్పుడు చూపిస్తాను. తప్పకరాస్తాను.

ర : ఓ, ఐయాంసారీ మహర్షి వస్తా! [వెళ్ళబోయాడు]

మ : ఒరేయ్ రమణా!

ర : అన్నట్లు పీకేమీ చెప్పలేదు గదరా?

మ : ఎందుకు చెప్పలేదు? ఉద్యానవనము-నదివీధి- వాలుచూపులు- వీధి వాకిలి- నవ్వులూ - పువ్వులూ- తర్వాత పిడ్గులు—

ర : అవేం కాదురా, ఇవ్వాళ నాకు సన్మానం.

మ : యెవర్రా చేస్తుంది?

ర : ఎవరో చేస్తే నోరు మూసుకుని కూర్చుని చేయించుకో దానికి- నేను మామూలునటుణ్ని కాదు మహర్షీ మహానటుణ్ని।

మ : నువ్వే ఏర్పాటు చేసుకున్నావన్న మాట.

ర : షైకూ- శాలువా- పూలదండలూ యిచ్చిమరీ చేయించుకుంటున్నాను అంతేకాదు — చప్పట్లు కొట్టడానికి కాఫీ ఇప్పించి - ఓ పాతిక మందిని రెడీచేశాను కూడ.

మ : [నవ్వాలని ప్రయత్నించాడు] ఒరేయ్ రమణా ఇప్పుడిప్పుడే నీలో మిలిష్టరయ్యే సూచనలు కన్పడుతున్నాయి రా—

ర : ఒరేయ్ మహర్షి, మొన్న పరిషత్తులో గెల్చుకున్న రెండు వెండి కప్పులూ, షీల్డూ- మార్వాడీ షాపులో మర్యాదగా తాకట్టుపెట్టి- చేయించుకుంటున్నామురా వస్తా [అంటూ రెండడుగులు లోనికివేసి శాలువా భుజంమీదుగా కప్పుకుని వచ్చాడు] చూడు మహర్షీ, ఇప్పుడు నేనెలా వున్నాను?

మ : ఓ మహాకవిలా వున్నావు?

ర : కవులతో పోల్చకురా బాబూ. కాఫీనీళ్ళు కూడా దొరకవు.

మ : అదిసరే— ఇవ్వాళ మేము ఫోటో తీయించుకోబోతున్నాం- ఆ శాలువా— —

ర : కావాలా?

మ : కావాలని కాదు, మొన్నెవరో చేసిన సన్మాన సందర్భంగా- దీన్ని

కప్పారు. ఇవ్వాళ కోటు తీయకుండాల అని చెప్పారు.

ర : ఒరే మహర్షి ఓకే ...తీసుకో. [శాలువా తీశాడు] ఒరేయ్ హంగుల కోసం- అందం కోసం - నేనీ శాలువా కప్పుకోలేదురా - చౌకా బిరుగులా- బతుకులా- బయటపడకుండా వుండాలని కప్పుకున్నాను. ఇంకో గంట ఆగితే ... బ్రహ్మాండమైన కాశ్మీరు శాలువా నా భుజాలమీద వుంటుందిరా- తీసుకో మహర్షి [మహర్షి మీదకు విసిరేశాడు]

మ : (శాలువా సర్దుకున్నాడు) రమణా.

ర : ఒరేయ్ సభలో పాల్గొనడానికి- సన్మానాలు చేయించుకోవడానికి- యీ జోడీ శాలువాలు అక్కరలేదురా, ప్రజాభిమానం, కళాప్రతిభ కావాలి వస్తా (రెండడుగులు వేశాడు బయటికి)

మ : కోపం వచ్చిందా రమణా.

ర : [నవ్వాడు] చూడు మహర్షి ఎన్నో ఏళ్ళుగా కాఫీలు తాగి తాగి — కోపాన్ని కరిగించి- కరిగించి, కరుణరసంగా మార్చుకున్న మన లాంటి ఉత్తమ కళాకారుల కళ్ళల్లో, యింకా కోపాలూ, తాపాలూ యెక్కడున్నాయిరా.

మ : ఎందుకురా అలా బాధపడతావ్?

ర : మొదటిసారిగా నేను వేదికమీద నటించినప్పుడు నా ప్రతిభకు మెచ్చుకుని మ్రోగించిన చప్పట్లు విన్నప్పుడు నా కోపం చల్లారిపోయింది. ఒరేయ్ ఇప్పుడు కోపంవచ్చి, గుండెను పగులగొట్టుకుని- గట్టిగా ఏడ్చినా, వచ్చేదిమాత్రం కన్నీళ్ళు కాదు మహర్షి, వస్తా [వెళ్ళబో యాడు- సత్యం బయటనుండి ఎదురయ్యాడు)

స : ఏమిటీ కన్నీటి కబుర్లు?

మ : కళాప్రతిష్ఠకు- కన్నీళ్ళే ఖరీదు. అంటుంటే యింకా యీ కాలం క్షమిస్తుందేమిటి అంటున్నావు? (గిరి లోపలినుంచి వచ్చింది)

గీత : ఎంతసేపయ్యిందన్నయ్యా వచ్చి?

వ : ఇప్పుడే అమ్మా

గీత : మరి... వెళ్ళరావి ...

రమ : మామూలే గీత. మనం ఉద్యోగాలకోసం. వెళ్ళడం బయలు దేరితే నో వేకెన్సీ బోర్డు-మన కెదురవుతాయ్ అంతే బావా?

వ : అవున్రా! సర్టిఫికెట్ చూపితే - సత్యంపేరు వినగానే సరే - పోయిరా అంటున్నారు.

గీత : ఎందుకని?

వ : అంతేనమ్మా! సత్యం కేవలం సత్యాన్ని రక్షించడానికే పని కొస్తాదట-

మహ: అంతే బావా! వ్యాపార సంస్థల్లో సత్యం చచ్చిపోయిందిగా-

రమ : ఫ్యాక్టరీల్లో కూడ-సత్యం నలిగిపోయింది గీతా?

గీత : చైర్మనుగారు...ఏమన్నారన్నయ్యా?

వ : మొన్నటి మాటనిన్న-నిన్నటి మాట యీ రోజు- అంటూనే వుంటాడమ్మా! ఆయనకేం మహారాజు.

గీత : ఇకమనం ఎలా బ్రతకాలన్నయ్యా?

వ : బోలెడు దుఃఖం వుందిగా గీతా, తృప్తిగా తాగి కడుపు నింపు కుందాం, అసలు మన కళ్ళలో కన్నీళ్ళు వుండాలేగాని... యీ జన్మకు కరువేలేదు గీతా,

గీత : అన్నయ్యా .

వ : అవునమ్మా, అంతే .. అంతే.

మహ: కష్టపడి చదివి ... బియ్యేడిగ్రీ సంపాదించాడు బావ. ఇప్పుడు దాన్ని తాకట్టుపెట్టినా-కొనేవాడూ లేడు. పాపం అనేవాడూ లేడు.

రమ : సారా బట్టీలకూ- పావిన త్తులకూ- పర్మిషనువుంది. గీతా. కాని....

చదువుకున్న వాడు బ్రతకడానికే-కనీసం బానిసలౌతున్నారా, ఒక్క
కోటి టిక్కెట్ మాలిన చట్టం.

న : అందుకే-అందుకే.... ఎంతోమంది శాస్త్రజ్ఞులు విశ్వకవులూ-
యీ కసాయి మూకల కాళ్ళకింద నలిగిపోతున్నారు ఎదవుల
దేశాల్లో, పద్మశాల కుటీరాల్లో. మంచిని మానవతనూ-చిత్రవధ
చేస్తున్నారు మానభంగాలూ-మారణ హోమంతో, యీ రాయల
రాజ్యాన్ని రాక్షస రాజ్యంగా మారుస్తున్నారు.

మహా: తిరగబడేవాళ్ళంటే-ఉపేక్షచూపని అధికారులు, తాపేదారీ
వాళ్ళంటే, ఉలిక్కిపడతారు.

న : అందుకే మహర్షీ నాకు ఉద్యోగం అక్కర్లేదు.
గీత : అదేమిటన్నయ్యా?

న : అవునమ్మా, గుక్కెడు చైతన్యం తాగుతాను.

గీత : అన్నయ్యా!

న : బ్రాందీలా, విస్కీలా, తాగి, వదలి బాధ్యతలు విస్మరించి-
ప్రతిదాన్ని మర్చిపోయిన, పాలకుల కళ్ళు తెరిపిస్తాను. ఈ దేశ
పురోభివృద్ధికో, మెట్టునై, భావితరాల పేరుమీద, చైతన్య ప్రకం
తినై, అధికారపు మత్తులో ఉన్న పెత్తందార్ల నరనరాల్లో ప్రవహి
స్తాను అ[illegible] అహంకారుల అణువణువులో చేరి, అడుగడుగునా,
అగాధం సృష్టిస్తాను.

గీత : అన్నయ్యా.

న : అదే నేను చేయవలసిన పని గీతా. నాకు మిగిలిన పనికూడా అదే,
ఆస్తులు అమ్ముకుని, అహోరాత్రులు శ్రమించి, చదివి సంపాదిం
చిన విద్యని తగ్గించి, తక్కువగా చూసి, పదేపదే ఎగతాళిచేస్తుంటే,
ఇంకా నేనెందుకు క్షమించాలి యీ పెద్దరికాన్ని? ఒరేయ్ రమణా.
యీ కళలూ, కవితలూ జీవితాన్ని ఉద్ధరించలేవురా.

చ : ఎద్దేవిస్తాయని కాదు బావా, ఇలాగే నాటకాలు ఆడీ ఆడీ, సినిమాలో చేరిపోతే....

: అవ్వాయగాని — మిగిలివున్న మానవత, ఖండగానిపోదు— ఒరేయ్ నాటకాలు ఆడి బాగుపడిన వాళ్ళు కవిత్వాలతో బ్రతుకుల్ని దిద్దుకున్న వాళ్ళు, మన దేశంలో లేరు ఉండరు కూడా.

సహా: లేరనికాదు బావా. ఉన్నారు....కాని....

న : మహర్షి ఈ దేశంమీది, ఈ సంపదమీది, కనిపించే ప్రతివస్తువు మీద. పేదవాని అనుభవించే హక్కు ప్రతిమనిషికీ వుంది కాని... మనం... పశువులకన్నా హీనంగా బ్రతుకుతున్నాం. విసిరేసిన విస్తళ్ళలోని మెతుకులకోసం వెదికే కుక్కల విషయం మనకన్నా అంతచాకిరీ చస్తే...దానికి ప్రతిఫలం? అర్థాలి. ఒక్క కష్టజీవి కండల్లో స్రవించిన చెమటబిందువు ఖరీదు పన్నెండొట్లు ఒక్క కార్మికుని శ్రమకు ఫలితం? వేసి విట్టారు. కూటికోసం...కుల సమ్మాన శీలాలు తాకట్టుపెట్టే నీచస్థితికి దిగజారినా కనీసన్యాయం కూడని యీ స్వార్థపరుల వికటంకశత్వాన్ని ఎందుకు క్షమించాలి?

కమ : ఇలా గొంతెత్తి పెద్దగా అరిస్తే...వాళ్ళు విరగ్గొడతామంటున్నారు బావా - పోలీసులు.

సహా: అవును బావా. సమసమాజ స్థాపన కావాలన్నా. ఈ సంపదలో మాకూ భాగం వుండన్నా—తుపాకి తూటాలు దూసుకుపోతున్నాయ్ గుండెలో - ఎంతమంది మహనీయులు తమ పవిత్రమైన రక్తాన్ని చిందించలేదు? ఆ త్యాగమూర్తుల రక్తంలో మండి - మళ్ళీ త్యాగం గాని-రక్తంగాని-చిగురించిందా? కనీసం మిగిలినవారి బ్రతుకుల్ని అయినా-సరిచేసిందా?

న : ఈ మూఢ విశ్వాసాలు ముందు విరగ్గొట్టాలి? కృతజ్ఞతలేని చట్టాల కోటగోడలు పడగొట్టాలి, మతాధికారంతో-రాజకీయాధికారంతో

భావితరాల బాటలు వేసే - పెత్తందార్లనుపట్టి అధికార భ్రష్టుల్ని చేయాలి. సమధర్మం-సమభావం-ఒగురింపజేయాలి.

శమ : విప్లవం కావాలంటావా బావా?

శే : ఏదేశంలోనైనా-విప్లవంతోనే సమత పుట్టిందిరా-

గీత : చూశావన్నయ్యా. ఈ విప్లవాలనీ-ఉద్యమాలనీ బ్రతుకుల్ని చీకటి చేసుకుంటారా?

శ : ఏమిటమ్మా నువ్వనేది?

గీత : దేనికైనా అర్హత కావాలి. జేబులు కొట్టాలన్నా జైలుకు వెళ్ళాలన్నా తగినవాళ్ళే కావాలి. మనం పేదవాళ్ళం మా జీవితాలు అరిటాకుల ముళ్ళ పొదల్లాంటి అధికారం మీద పడితే నష్టం మనకే-

వ : నిజమే గీతా, కాని.... ఈ బానిస బ్రతుకులు ఎంతకాలం ఈ ఆకలి బాధలు ఎన్నేళ్లు? అందుకే అమ్మా విప్లవం కావాలంటున్నాను-

మహా: ప్రజా విప్లవం కావాలి

శమ : చైతన్య విప్లవం కావాలి.

శ : శ్రమజీవుల బ్రతుకులు బంగారుమయంచేసే ప్రజావిప్లవం కావాలమ్మా

మహా: గీతా దేశప్రగతికి ప్రయోజనానికి రావలసింది విప్లవం అందుకే...

నా కలంలో చైతన్యం పోస్తాను-

శమ : నేనూ నా గుండెలో-విప్లవజ్వాల వెలిగిస్తాను.

వ : ఆ జ్వాలను.... దేదీప్యమానంచేసి ఆకాశానికి ఎగురవేయండి. బానిస బంధాలతో - తరతరాల చీకటిలో - వెలుగుకోసం-వెదికే ఈ పేద ప్రజల కన్నీళ్లు తుడవండి ఈ కసాయిపాలకుల కల్మషత్వాన్ని అంతంచేయడానికి-విప్లవఖడ్గం ధరించండి. గెవ్వుపొందలా

అల్లుకుపోయిన స్వార్థపు బెడదుల్ని తెగనరకండి. అప్పుడేగాంధీ అప్పుడే విముక్తి అప్పుడే శ్రమకు తగిన ఫలితం॥

రమ : ప్రజావిప్లవం –

మహ: వర్ధిల్లాలి.

వ : ప్రజావిప్లవం –

రమ:

మహ: వర్ధిల్లాలి

గీత : ముందు భోజనాలకు రండన్నయ్యా

వ : పదమ్మా

రమ : బావా మూడ్‌లో అసలువిషయం చెప్పడమే మర్చిపోయాను, ఇవ్వాలి నాకు సన్మానం మీరంతా రావాలి.

వ : అమోరించాల్లే టోంచేసివెళ్లు. (లోపికి వెళ్ళాడు)

రమ : వద్దుబావా. అన్ని ఏర్పాటు అక్కడే చేశాను వస్తా (చరచరా బయిటికి వెళ్ళాడు. మహర్షి గీత లోపికి వెళ్ళారు. తెరజారింది)

# మూడవ రంగం

(అలంకరణ మొదటిరంగం మాదిరేవుంది. గీత జడ అల్లుకుంటూ కూర్చొంది. అప్పుడే బయటినుండి వచ్చిన మదన్ ఆమెను నిలువెల్లా చూస్తూ నిలబడి పోయాడు ఆమె అతన్ని అసహ్యంగా చూసి ఒక మూలకు వెళ్ళింది)

గీత . మళ్ళీ ఎందుకొచ్చావు?

మ . చెప్పానుగా వస్తానని?

గీత . దయచేసి యిక వెళ్ళు

మ . యిప్పుడేగా వచ్చింది?

గీత . చెప్పేదినీకే. మర్యాదగా వెళ్లు.

మ . (నవ్వాడు) వెళ్తాను. వచ్చినపని పూర్తికానీ.

గీత , నా మనసు పరాధీనమైంది. నేను మరొకరికి అంకితమైపోయాను. నా జీవితాన్ని పాడుచేయకు వెళ్ళు.

మ . చూడుగీతా. అందంగాపుట్టిన ప్రతి ఆడదీ మొదట యెగిరెగిరిపడుతుంది వెర్రెక్కిన తర్వాత నరసాల రుచి మరిగిన తర్వాత ఒదిగొదిగి వుంటుంది.

గీత . ముందు నువ్వు వెళ్తావా లేదా?

మ. నేను చెప్పేది పూర్తికానీ మరి.

గీత. ఇక నువ్వేం చెప్పక్కరలేదు.

మ. చెప్పకపోతే నీకు అర్థం కావటంలేదుగా.

గీత. మదన్.

మ. తప్పించుకోవాలని నన్నో తప్పుడుమనిషిగా జమకట్టాలని ప్రయత్నించకు కసికసిగా మాట్లాడి నన్ను కైపెక్కించకు గీతా.

గీత. ఛీ! నీకు బుద్ధిలేదూ?

మ. ఇప్పుడు తెలిసిందా నీకు?

గీత. అనవసరంగా మాట్లాడి బుద్ధి చెప్పించుకోకు

మ. నీలాటి బుద్ధిమంతురాలు ఇంతత్యాగానికి పూనుకుంటే నేనేం కాదు గలను? లేకీ శిక్షేమిటో చెప్పి కౌగిలిలో బంధించటమేనా?

గీత. కాదు — కటకటాలలో

మ. (నవ్వాడు) చూడు గీతా. నువ్వు ఆడదానివి.

గీత. ఆదిశక్తిని గూడా.

మ. అందమైనదానివి కూడా.

గీత. నీ పాపం పండేదాకా.

మ. వలపు పండే శుభసమయంలో ఇవేం మాటలు గీతా.

గీత. ఆడవాళ్ళంటే ఏమిటో నీకు తెలుసా?

మ. "పువ్వులన్ని పడతులకోసం - పడతులంతా పురుషులకోసం" అని ఓ కవిరాజు గీతా చదువుకోలా?

గీత. చదివాను, నీలాంటి దుర్మార్గులకు త్వరలోనే నాశనం వుందనికూడా చదివాను.

మ. గీతా! గీత రాముడు పుట్టినప్పుడే రావణుడు పుట్టాడు.

గీత: అందుకే సీత అగ్నిలో దూకింది.

మ. ధర్మరాజు పుట్టినప్పుడు కురురాజు పుట్టాడు.

గీత . అందుకే ద్రౌపది కురులు విరబోసుకుంది.

మ . పిచ్చిగీతా నువ్వెప్పుడు బాగుపడతావు?

గి . మీలాంటి నీచుల సమాధి కట్టిన తర్వాత

మ . గీతా నా మాటవిను. అనవసరంగా ఎందుకు చెడిపోతావు?

గీత . ముందిక్కడనుండి వెళ్ళిపో-

మ . మాదు గీతా పుట్టినప్పుడే భయాన్ని వదిలేసి మంచీ మానవతలు దూరం చేసుకున్నాను. వ్యక్తిత్వం వచ్చినతర్వాత నీతి- నిజాయితీలను ప్రక్కకునెట్టాను. అవిపోగా నాకు మిగిలింది కసి నీమీద కాదు. ఈ సమాజమ్మీద ఈ సంస్కృతిమీద. ఈ మానవమృగాల సృష్టించిన సాంప్రదాయాల మీద అందుకే అందుకే గీతా. నిన్ను మర్యాదగా అడుగుతున్నాను.

గీత . యింతసేపు నేమా మర్యాదగానే చెప్పాను.

మ . గీతా గుండెల్లో సుడులుతిరిగే కసిని, కన్నులలో మెరిసే కరక్కశత్వాన్ని చూసి- యీ సంఘం యింతవరకూ నోరెత్తలేదు. యే చట్టం నన్ను బెదిరించలేదు.

గీత . అందుకే బరితెగించావ్.

మ . లేదుగీతా. చెడిపోయాను పూర్తిగా అగాధంలో పడిపోయాను. యిప్పుడు నాలో సహనం లేదు ఓర్పు అంతకన్నా లేదు రా గీతా. కవ్వించి - కవ్వించీ నన్ను మరీ పశువునుచేయకు నవ్వుతూ నా మధువులు కురిసే ఆ లేతపెదవులు ఒకసారి నోటికందించు సిగ్గుతో ఎరుపెక్కిన గులాబీలాంటి బుగ్గల్ని - ముద్దెట్టుకోనీ - ముగ్ధుణ్ణికాని, మువ్వా మురిసి ఈ లోకాన్ని మర్చిపో హాయిగా నా వడిలో నిదురపో రా గీతా. ఒక్కసారి (అంటూ చేయిపట్టుకుని మీదికి లాక్కున్నాడు. ఆమె విదిలించుకుని దూరంగా వెళ్ళింది)

గీత. ఛీ. నువ్వు మనిషివా? పశువ్వా?

మ. [నవ్వుడు తమాషాగా] ఆ రెండూ కాదు. ప్రాణంపోయినా విస్కీ బ్రాందీ జిన్నూ రమ్మూ త్రాగినవాణ్ణి మాత్రం కాదు. నీలాటి అందమైన అమ్మాయిని ప్రేమించిన యువకుల హృదయాలు తృప్తిగా త్రాగినవాడ్ని. ఈ రోజుల్లో తమ పవిత్రమైన శీలాలు మన కంకాళాలలో దాచి పెట్టుకుంటున్నస్త్రీ కడుపారా త్రాగి తై పెక్కి కళ్లు తిరిగి పాపపుణ్యాల ప్రసక్తిని వదిలేసి విలాసాల ఒడిలో వీధి వీధిన తిరుగుతున్నవాణ్ణి గీతా. ఒక్క నిముషం కాలాన్ని వృధా చేసుకుంటే రేపటి అనంత సాగరంలో ఒక్క మధుకణాన్ని మట్టిపాలు చేసిన వాళ్ళమౌతాం రా [అంటూ కౌగలించుకుని ముద్దెట్టుకునే ప్రయత్నం చేస్తాడు ఆ పెనుగులాటలో ఆమె తప్పుకోబోయింది కాని, అతని చేతిలో ఆమె జాకెట్ వెనకభాగం దొరికింది చిరిగింది. పైటచెంగుతో ఆ లోపాన్ని కప్పుతుంది.

గీత. మదన్! నీకు దణ్ణంపెడతాను వెళ్ళిపో!

మ. దణ్ణం దేవునికిపెట్టు అందం నా కప్పగించు.

గీత. నోర్ముయ్!

మ. కోపంలోకూడా నువ్వెంత అందంగావున్నావో ఒక్కసారి నా కళ్ళలోకి చూసుకోగీతా [దగ్గరకు వెళ్ళాడు]

గీత. నీకు పుణ్యం వుంటుంది దయచేసి వెళ్ళిపో మదన్.

మ. వెళ్ళడానికే వచ్చానుగీతా.

గీత. నా బ్రతుకు నాశనం చెయ్యొద్దు వెళ్ళు.

మ. ఎవరికో ఒకరికి అర్పించవలసిందేగా నీ బ్రతుకు.

గీత. అందుకే నిన్ను వేడుకుంటున్నాను. నేనిదివరకే ఒకరికి అంకితమైపోయాను.

గిత . ఎలా చెప్పను? ఏమని చెప్పను మధూ?
మ . అంటే—
గిత . నేను ఆడదాన్ని మధూ, యింతకాలం పెద్దలు సృష్టించిన హద్దులమీద నిలబడ్డాను. కాని, కాలం,
మ ఏం చేసింది?

గిత . మనిద్దరిమధ్య బిరిగీచింది.

మ , ఆబిర తెగించడానికే, మనకు పెళ్ళి జరగాలి గితా.
గిత . మన పెళ్ళి, దేవుడు మనకిచ్చిన అదృష్టాన్నిటితో పెళ్ళి అపురూపమైంది, అపూర్వమైంది మధూ, కాని, కొందరికే ఆ అవకాశం కలిసివస్తుంది.

మ . అదేమిటిగితా. మన పెళ్ళి జరగదనే అనుమానంగా వుందా?
గిత . జరగకుండా వుంటేనే మంచిది మధూ.
మ . గితా.

గిత . నాకు అప్పుడే పెళ్ళిచేసుకోవాలని లేదు.
మ . గితా ఏమిటి నువ్వనేది!!
గిత . సంసారబాధ్యతలు స్వీకరించాలని నాకులేదు మధూ.
మ . ఎందుకిలా మాట్లాడుతున్నావు గితా.

గిత . మళ్ళీ మళ్ళీ నాచేత ఎందుకుచెప్పించాలని ప్రయత్నిస్తావు మధూ.
మ . మరి నన్నెందుకిలా చేశావు?
గిత . నేనెందుకిలా అయ్యానో – నీకేం తెలుసు?
మ . నన్ను ప్రేమించినట్లు నటించావన్నమాట?

గిత . నటించడానికి ప్రేమించవలసిన అవసరం లేదు మధూ.

మ . పెళ్ళి చేసుకుందామని – చేతిలో చేయి వేయలేదా నువ్వు?
గిత . ఎదలో ఎదనుకూడా కలిపాను.

మ . ప్రేమపేరుతో వలపు ఊయల వూగించలేదా నన్ను?

గీత : ఊహలతో వూపిరాడక ఇన్నాళ్ళూ వూగిసలాడిపోయాను [illegible]
మధూ.

మ . మరి ఎందుకిలా మారిపోయావు?
గీత . ఇప్పుడు నేనేం చెప్పలేను మధూ.

మ . మనపెళ్ళికి మాత్రం అభ్యంతరం చెప్పకుగీతా.
గీత . అలా జరగడానికి వీల్లేదు మధూ.

మ . ప్రేమించినట్లు నమ్మించి- నటించి - నన్నెందుకు నవ్వులపాలు
చేశావు. నేనేం పాపం చేశాను?

గీత . మధూ మధూ.

మ . చెప్పుగీతా. నా గుండెల్ని అగ్నిగుండాలుగా మార్చాలని ఎందుకు
ప్రయత్నిస్తున్నావు? నన్ను కావాలనుకునే దానివైతే ఈ ఒక్క
విషయం చెప్పు గీతా.
గీత . ఏమీ చెప్పలేని నిస్సహాయస్థితిలో వున్నాను మధు. నన్నేమీ,
అడక్కు - దయచేసి వెళ్ళిపో.
మ . గీతా!

గీత వెళ్ళుమధూ. నామీద ఏమాత్రం గౌరవమున్నా. వెంటనే వెళ్ళిపో
మ . అలాగేగీతా కాని ... ఒక్కటిమాత్రం చెప్పివెళ్తాను.
గీత . ఏమిటి?

మ . నిన్ను మొదటిసారిగా చూసినప్పుడు నా హృదయాన్ని పోగొట్టు
కున్నాను కాదుగీతా పగలగొట్టుకున్నాను, ఆశల చిగుళ్ళను చే
తులా నరికివేస్తున్నావు.
గీత . మధు.

మ . చూడుగీతా, ఎప్పుడొచ్చినా - నవ్వుతూ నవ్విస్తూ నన్ను నీలో
ఆహ్వానించేదానివి "నన్ను స్వర్గానికి తీసుకువెళ్ళుగీతా" అనగానే
మధురంగా పాడేదానివి, ఆ పాటతోనే లోకాన్ని. జీవితాన్ని

యింతకాలం మర్చిపోయాను మరణాను ముగ్ధుడ్నయ్యాను కాని,
గీతా విధి ఎదురుదెబ్బ తీసిందని నా యెదను గాయించేశావు,

గీత. నా గుండెలలో రగులుతున్న అగ్నిగురించి నేనెవరికి చెప్పుకోను మధూ ఎలా చెప్పుకోను.

మ. పోనీ .... ఒకపాట అయినా పాడగలవా?

గీత. జీవితం విషాదం అయిందని ఎలాపాడను మధూ-

మ. నేను వెళ్ళటానికైనా నువ్వుపాడాలిగా గీతా.

గీత. మధూ!

మ. నీతో స్నేహం చేసిన నేరానికి ఆఖరిసారిగా ఒక్కపాట అయినా వినిపించలేవా గీతా?

గీత, పాడతాను మధు నీ కోసం ఆఖరిగీతం పాడతాను. (అంటూ విషాదంగా పాడుకుంటూ ఓ ప్రక్కకువెళ్ళింది మధు చప్పట్లుకొట్టబోయి ఆగాడు)

మ. క్షమించుగీతా. జీవంలేని నవ్వులూ తాళంలేనిచప్పట్లు నిన్ను బాధ పడితే క్షమించు వస్తా. (వెళ్ళబోయాడు)

గీత: మధూ

మ: యింకేం కావాలిగీతా?

గీత. చిన్న సహాయం చేయగలవా?

మ. (పెదాలమీద నవ్వాడు విరాళగా) అదేమిటిగీతా. అడగకపోయినా మనసిచ్చాను నీకు ఇష్టంగా ముచ్చటగా వున్నంతసేపు/దాన్ని నీ వద్దనే వుంచుకుని విసిగేసి వీధిలోపడేసినా విరిచిముక్కలు చేసినా నిన్ను యేమన్నాను? చెప్పుగీతా ఏం కావాలి!

గీత, నన్ను నీచంగా చిత్రించకు మధూ.

మ. విచిత్రంగా ఆడుకుంటున్న ఆ భగవంతుడ్ని ఎలా ప్రశ్నించాలో అర్థంగాని నాకు నిన్నెలా చిత్రించమంటావు గీతా?

గీత. మధూ.

మ . వస్తాగీతా. నీ మనసు తేలికైనప్పుడు - గుండెలు బ్రాపరేపయ్యి నప్పుడు - మమ్మల్ని గుర్తుచేసుకో. అప్పటిదాకా నీ కోసమే ఎదురుచూస్తూ వుంటాను. (వెళ్ళిపోయాడు)

గీత : మామా [అంటూ సత్యంఫోటో దగ్గరకు వెళ్ళింది ఏడుస్తూ] అన్నయ్యా నన్ను కళామూర్తిని చేసిన ఆదర్శమూర్తి వెళ్ళి పోయాడన్నయ్యా. చీకటి కడుపున ఆరనిజ్యోతి వెలిగిందాలని తపించి- తపించి నా జీవితంలో వెలిగిన మహత్తర కళాతేజం ఒక్క నిముషంలో ఆరిపోయిందన్నయ్యా. ఆరిపోయింది! ఏడుస్తూ లోపిక వెళ్ళబోయింది - బయటనుండి రమణ మహర్షి వచ్చారు]

మహ. మళ్ళి ఏడుస్తున్నావా గీతా?
గీత : లేదుబావా నేనెందుకేడుస్తాను?

మ . చూడుగీతా. సత్యం వెలిగించిన సమిధలం మేము. ఈ చిన్నిసమి ధలు సమరజ్వాలలై స్వార్థపరుల హృదయంలో చిట్టెంరాళ్ళుగా మారిన గుండెల్ని కాల్చివేసి మహోజ్వల జ్వాలుగా మారడానికి నీ కన్నీరు చమురుగా పోశారు. త్యాగాన్ని సహనాన్ని పోసి నవసమాజ నిర్మాణానికి సమైక్యతా పునాదులు కట్టడానికి మా యిద్దర్ని వెలిగించు గీతా.

గీత . నేనే చీకటిగా మిగిలిపోయాను బావా.
ర . చీకటిని చీల్చడానికి స్వార్థాన్ని కూల్చడానికి మేమున్నాంగీతా, సత్యం జీవించాలి

గీత . అంటే.... అన్నయ్య కేమైనా ....
మ . విప్లవజ్వాల ఆరడానికి వీల్లేదుగీతా.
గీత . అంటే....

ర . మహోగ్రరూపం దాల్చిన మానవతాజ్వాల యీ దేశ కళానికి హానికున్న స్వార్థాన్ని మసిచేయాలి. చట్టాన్ని - శాసనాన్ని

పెద్దరకం పేరుతో పెత్తపు జారులతో బిగించిన అధికారుల అంత రాంతరాల్లో చేరి- చైతన్యం వెలిగించాలి, అనంత కాలాంతరాల్లో ప్రచండజ్వాలగా ప్రతిఫలించాలి.

గీత. ఏమాటలు నా కర్థంగావడం లేదు బావా?

మ. మనసత్యం అనంత విప్లవయజ్ఞానికి మహోగ్రరూపం ధరించాడు.

గీత. అధికారం కళ్ళుతెరిస్తే-

ర. అవును గీతా. అధికారం కళ్లుతెరిస్తే.... సరియైన ప్రశ్న. మహర్షి నేను వెడుతున్నాను. [రెండడుగులు వేసి]

మ. ఒరేయ్. ఎక్కడికి?

రమ. మూడ్‌లోకి వెళ్ళి సమాధానం వెదకుతాను (ఆలోచించాడు) ఆ... వచ్చినది మహర్షి గీతవేసిన ప్రశ్నకు సరియైన సమాధానం వచ్చినది. ఈ దేశంలో అధికారం కళ్ళుమూసి - యెన్నో ఏళ్ళు గతించినవి.

మ. అందుకే రమణా! ఎన్నో ఏండ్లు గతించినవి- కానీ శక్తిహీనసరిలిన్. కమల్ మోడ్చిన మందభాగ్యుండు ఒక్కండును తిరిగి లేచి రాడిక అన్నాడు విశ్వకవి జాషువా!

రమ. శాశ్వతంగా కనులుమూసినవారిని ఉద్దేశించి అన్నమాటలివి. కాని- వీళ్లు? పెత్తందారులు.... నాయకత్వాన్ని గుప్పెట్లో బిగించి అందలాలమీద దొర్లుతున్న అధికార దురంధరులు. పదవులు పట్టుకొని తరతరాలుగా వ్రేలాడుతున్న మహా మంత్రగాళ్ళు గాఢనిద్రలో మునిగిపోయారు, వీళ్ళనులేపడానికి, ఎన్ని వేలకంఠాలు దిక్కులు పిక్కటిలేలా అరిచినా- లేపనే లేవరు.

మహ. గీతా వాళ్ళను లేపడానికి ఒక్కటే ఆయుధం,

రమ. అది విప్లవజ్వాల, ఆ జ్వాలను చైతన్యంతో రగిలించి, గుండెల లోతులలో అంటుకుపోయేలా మందవేస్తేనేగాని ... కనీసన్యాయం జరగదు గీతా,

గిత . మీకోసం గాలింపచేసేవాడో కూడా తెలుసా బావా?

రమ . ఎర్రటోపీలూ, బ్రదమీసాలూ, తుపాకులూ, పోలీసులు.

గిత . మీకిచ్చే బహుమానం కూడా తెలుసా?–

మహా, తెలిసేం; సంకెళ్ళు, జైళ్ళు.

గిత . యిన్ని తెలిసి యెందుకిలా బయలుదేరావు

రమ . అవమానము క్షమించరాని మహాపరాధము. ఒక్కొక్కటే సమూహము సహోదరిపై చేతన్య స్వతంత్రంపై; పిరికితనంతో ప్రవర్తింప జేయాలని ప్రయత్నం చేస్తున్నది ఆ సహాయపు సహించరానిది గీతా.

గిత . బావా.

మహా. అవును గీతా, మన భవిష్యత్తును బంగారం చేసుకోవటం.... మన వంతు కర్తవ్యంకాదా చెప్పు.

గిత . చెప్పను ముట్టుకుంటే నీవేమి కాలుతుంది బావా. (యింతలో బయటనుంచి సత్యం వచ్చాడు)

స . ఏమిట్రా మీటింగ్?

రమ . అబ్బే ఏంలేదు బావా. చచ్చినవాళ్ళను లేపడానికి మందులున్నా యేమోగాని, ఈ బ్రతికిచచ్చినవాళ్ళను మేల్కొలపడానికి ఎన్ని గొంతులు కావాలి అంటున్నాను అంతే.

స . ఏమ్మాగీతా. ఏమిటలా వున్నావు?

గిత. ఏం లేదన్నయ్యా? బాగానే వున్నాను.

స : నాకు తెలుసమ్మా? మృత్యువును వెదుక్కుంటూ వెళుతున్న వీని వ్యక్తిత్వంగురించి నువ్వెంత క్రుంగిపోతున్నావో నాకుతెలుసు.

గిత . అన్నయ్యా,

స . అవునమ్మా. యికనేను మీతోకలిసి, ఆనందాన్ని పంచుకునే అంత కాలంలేదమ్మా.

గిత . ఏమిటన్నయ్యా నువ్వనేది?

ర. ఏం జరిగింది బావా?

మ. ఏవరైనా వెదకుతున్నారా బావా?

న. చట్టమే వెదకుతుంది మహర్షి?

గీత. అన్నయ్యా?

న. అవునమ్మా? చట్టానికి లొంగిపోయి కర్తవ్యానికి ద్రోహం చేయలేను.

రమ: మరేంచేస్తావ్ బావా?

న. మీ అందరికీ కొన్నాళ్ళు దూరంగా వెళ్ళిపోతాము.

గీత. అన్నయ్యా

న. నేను పారిపోవడంలేదమ్మా? యిన్నాళ్ళు నన్ను నమ్ముకున్న మిత్రులని కాపాడటానికి, నేను నమ్ముకున్న సిద్ధాంతాన్ని రక్షించడానికి వెళ్ళకతప్పదు.

గీత. సమసమాజ స్థాపనకోసం -అర్పణచేసిన ప్రతిఅణువూ శరీరంలో ప్రవహించే ప్రతినెత్తురుబొట్టుకూ ఫలితం యిదా అన్నయ్యా,

న. గీతా.

రమ. యుగయుగాల దోపిడిలో మిగిలిన తరతరాల చీకటిని చీల్చడానికి చేపట్టిన విప్లవజ్వాల అడవుల్లో వెలిగిస్తావా బావా?

న. లేదు రమణా, ఈజ్వాల ఆరేదికాదు- యిది మనం వెలిగిస్తే వెలిగేవాము. అందరూకలిసి- చైతన్యంపోసి వెలిగించే మహోజ్వల జ్వాల - ఎన్నటికీ ఎడారులపాలు కాకూడదు. అసలు ప్రతి మనిషికోసమూ ఒకజ్వాల రగలాలి. ప్రతి గుండె అగ్నిగుండంగా మారాలి. ప్రతిచేయీ ఆకాశాన్నంటే ఎర్రకాగడా కావాలి. అంతే రమణా, అంతే:

గీత, అయితే ... నేను... నేను ...

మ.హా. మేమున్నాం గీతా. మీ భవిష్యత్తును తీర్చిదిద్దడానికి ప్రాణాలైనా అర్పిస్తాం.

న. చూడమ్మా నాలాంటి అన్నయ్యలు యింకెంతమంది తల్లుల్ని—

పిల్లలిక్కి - చెల్లెళ్ళను వదిలేసి - సమరజ్వాలలకై పోతున్నారో —
నీకు తెలీదు గితా.

గిత , అన్నయ్యా.

వ , అవునమ్మా సత్యానికి భాగస్తులై పవాళ్ళుగా చట్టానికి నేరస్థులుగా
కవిస్తాను త్యాగానికి వారసులయిన వాళ్ళంతా - స్వార్థానికి బలి
కాక తప్పదు, రమణా, మ ర్షి నీకు బావలేకాదు. యికనుండి
విలువైన అన్నయ్యలు కూడ. పిత్యం బ్రతికినంతకాలం సంస్కృ
తిు ఏ లోపంరాదు గితా.

గిత . అయ్యో భగవాన్ [అనగానే బాయట విప్లవనినాదాలు విన్పిం
చాయి రమణ, మహర్షి వాకిలిదాకా వెళ్ళి చూసివచ్చారు]

వ . కర్తవ్యం పిలుస్తోంది గితా, వస్తా [వెళ్ళబోతాడు]

గిత . అన్నయ్యా,

రమ . బావా సమాజరిరాసానికి పూనుకున్న కర్తవ్యంకన్నా గిత భవి
ష్యతు బాగుచేయడం మా లక్ష్యం. నిశ్చింతగా వుండుబావా.

వ . వస్తానమ్మా (వెళబోయాడు]

గిత . అన్నయ్యా అన్నయ్యా....

వ . కర్తవ్యాని కట్టవే దానికి కన్నీళ్ళు చాలవమ్మా. అభ్యుదయా
ఎక సంస్కరణ నిర్మించడానికి మనమంతా పునాదులు వేయాలి.
లేకపోతే ఈ దేశం బాగుపడదు గితా. అందుకే నేను వెళ్ళాలి
వస్తా [అంటూ గబగబా బయటకి వెళ్ళిపోయాడు]

గిత . అన్నయ్యా [పావురుమంది]

రమ. యిప్పుడు ఏడ్వటానికి సమయంకాదు గితా,

గిత నాకు మిగిలి దే ఏడుపుబావా.

మహ. ఎడుపు కొంత రి ఆడవాళ్ళకు ప్రత్యేకంగా భగవంతుడు ప్రసాది
స్తాడు గితా అందుకే ఏ చీకటిజీవితాన్ని వెలిగిస్తాం.

గిత . నాకు అదృష్టం లేదుబావా.

మహా. అదేమిటి గీతా.

గీత. నేను అందరిలా పుట్టలేదు అగ్నిపరీక్షల్లో పుట్టాను చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకున్నాను. బట్టకట్టడం నేర్చినతర్వాత - తండ్రిని దూరం చేసుకున్నాను. కంటికిరెప్పలా కాపాడిన అన్నయ్య .... యిప్పుడు వెళ్ళిపోతాడు యిక నేనెవరికోసం బ్రతకాలి? ఎందుకు బ్రతకాలి?

రమ. చూడు గీతా, చావుకూడా అందరికీ అనుకున్నప్పుడూ కోరుకున్నప్పుడూ రాదమ్మా. మధు యెక్కడున్నాడో చెప్పు - అతనితో మాట్లాడి పెళ్ళి జరిపిస్తాం.

గీత. ఈ పెళ్ళి జరగదు బావా

రమ. గీతా.

గీత. జరగడానికి వీలు లేదు.

మహా. యెందుకని గీతా?

గీతా: కారణం చెప్పడానికూడా నోరు కట్టుబడిపోయింది బావా నన్నేమీ అడగొద్దు.

రమ: గీతా నీకు మేము పరాయివాళ్ళం కాదు,

మహా: నీ కోసం ఏంచేయడానికైనా సిద్ధంగా వున్నాం గీతా, కట్నాలూ కానుకలూ కావలసివస్తే...నా భాగం ఆస్తివుంది. అమ్మి .. లక్షణంగా పెళ్ళి జరిపిస్తాం గీతా.

గీత: వద్దు బావా. మీరంతా త్యాగానికి ప్రాముఖ్యతనిచ్చి ఆత్మీయత మంచితనంతో కట్టిపడెయ్యవద్దు. మీకు దణ్ణం పెడతాను దయచేసి నన్నేమీ అడక్కండి బావా! అంటూ లోనికి వెళ్ళింది ఏడుస్తూ)

రమ: మధు ర్తి గీత ఏడుస్తుంది మరు మోసం చేయలేముకదా.

మహా: ప్రేమికులు పడిపోయారంటే అంతకిపి మరొకటి వుండదు. అసలా ప్రేమనుండి విడిపోవాలంటే పెద్ద భూకంపం రావాలి.

రమ: మరి గీత ఎందుకలా మారింది!

మహా: పద తెలుసుకుందాం. (లోనికి వెళ్ళారు. తెరపడింది)

# నాలుగవ రంగం

[కమలాకరంగారి రెండంతస్తులమేడ అందంగా ఆధునాతనంగా వుంది ముందుహాలో ఖరీదైన ఫర్నిచర్ వుంది డ్రాయర్ మీద పుస్తకాల దొంతర పూలకుండీ - ఫోను. ఫ్యానూ వగైరా వున్నాయి. సిల్కు డోర్ కర్టన్స్ వాకిళ్ళకు వ్రేలాడుతున్నాయి, రెండు వాకిళ్ళ మధ్యభాగంలో రేడియోస్టాండ్ వుంది. గోడలకు దేశనాయకుల ఫోటోలు ప్రకృతి చిత్రాలు తగిలించినారు - గోడ గడియారం రాత్రి ఎనిమిది గంటలు మ్రోగింది. రత్నాలు లోపలనుండి వచ్చి ఫర్నిచర్ శుభ్రంగా తుడిచి రేడియో ఆన్ చేశాడు రేడియోలో చక్కని సినిమాపాట వచ్చింది- ఇంతలో మేడదిగి గీత ముందుహాలో కొచ్చింది- రేడియో అపుచేసి ఓ కుర్చీలో కూర్చుని వీక్లీ తిరగవేస్తూంది. రత్నాలు ఆమెను పలకరించాలని ప్రయత్నం చేశాడు]

రత్నా : అమ్మాయ్‌గారూ

గీత : (తలెత్తి చూసింది)

రత్నా : నాపేరు రత్నాలండీ.

గీత : తెలుసు.

రత్నా : నేనీయింట్లో పనివాణ్ణి-

గీత : అదీ తెలుసు.

రత్నా : మీరీయింటికి రాకపూర్వం.... అమ్మగారికి....నేనే అమ్మాయ్ గారూ.

గీత : (చూసి ఏమీ అనలేకపోయింది)

రత్నా : చూడండి అమ్మాయ్‌గారూ

గీత : నువ్వీయింటి పనివాడివి. పనివాడివి... అంతేకాదు.. . అయ్యగారి
మాటల పెద్దలు మాట్లాడానికి నీకన్నా-ఎవ్వరూ లేరు- అంతేగా?
రత్నా : మీకు కోపం వచ్చినట్లుంది?
గీత : లేదు రత్నాలు. లేదు.
రత్నా : ఎంత చల్లగా పిలిచారమ్మాయిగారూ నిజంగా మీ పిలుపులో
ఎంత తియదనం - ఎంత కమ్మనదనం వుందో చెప్పటం చాలా
కష్టం అమ్మాయిగారూ.
గీత : నువ్వు చదువుకున్నావా రత్నాలూ?
రత్నా : చదివానులెండి ఉద్యోగం చేయడానికి పనికొస్తుం దనుకున్నాను
కానీ వూడిగం చేయడానికి వుపయోగపడింది. అయినా అమ్మాయి
గారూ ఈ రోజులలో డిగ్రి సంపాదించినా లాభం లేదులెండి.
గీత : ఇంతకీ నువ్వు చెప్పేదేమిటి?
రత్నా : అయ్యగారికి నేనంటే చాలాయిష్టం అమ్మాయిగారూ,
గీత : ఆయన చాల మంచివారు
రత్నా : కాదమ్మాయిగారూ, మంచి హృదయం గలవారు. గుండెలనిండా
ఆత్మీయత నిండినవారు
గీత : అవును
రత్నా : మిమ్మల్ని చూస్తుంటే నాకేమనిపిస్తుందో తెలుసా అమ్మాయి
గారూ.
గీత ; చెప్పకుండా ఎలా తెలుస్తుంది?
రత్నా : చెబితే అర్థం చేసుకోవడంలో అర్థం లేదమ్మాయిగారూ.
గీత : రత్నాలూ
రత్నా : ఇక్కడే పిలవండమ్మాయిగారూ.
గీత : నీకెవరూ లేరా?
రత్నా : ఇప్పుడెవరూ లేరండీ, కాని ఆ పిలుపులో దూరం అయిపోయిన
నా చెల్లిగొంతు వినిపిస్తూంది నా చెల్లి అచ్చం మీలాగె వుండేది.

గీత : ఆవిడెక్కడుంది?

రత్తా : మనకు చాలా దూరంలో పిలిస్తే వినపడనంత దూరంలో వుందమ్మాయి గారూ.

గీత : అంటే, ఆమె...

రత్తా : చనిపోయిందమ్మాయిగారూ.

గీత : రత్తాలూ.

రత్తా : అమ్మాయిగారూ ఆమె పేరేమిటో తెలుసామీకు? ప్రగతిబాగుండి కదండి.

గీత : ప్రగతి, చాలా బాగుంది

రత్తా : అవునమ్మాయిగారూ. ప్రగతి చాలా బాగుండేది. కాని, కాని, ప్రగతిని, ,: మావూరి ప్రేమపిపి అంటే మా సమితికి ప్రెసిడెంటు–

గీత : ఏం చేశాడు?

రత్తా : ఈ దేశంలో నాయకత్వం చేపట్టిన స్వార్థపరులు. ప్రగతిని ఏం చేస్తారో తెలీదా అమ్మాయిగారూ. ప్రగతి పంతులమ్మగా పని చేస్తుండేది– పదినెలలు పనిచేసినా, జీతం యివ్వని అధికారాన్ని కోపగించుకుంది, ప్రగతి నోరెత్తిందనే కోపంతో, సమితి ప్రెసిడెంటు ప్రగతిని ఒంటరిగా చూశాడు. అధికార గర్వంతో అహంకారపు ఎత్తుగడలతో, స్వార్థం పెచ్చరిల్లిన కళ్ళతో ప్రగతిని చెరిశాడు అమ్మాయిగారూ, మానభంగం చేశాడు.

రత్తా : అవును రత్తాలూ. పదవుల మత్తులో, ప్రగతినిచూసి వోర్వలేక పోయి వుంటాడు

రత్తా : అప్పుడు, నా ప్రగతి ఏంచేసిందో తెలుసా?

గీత : తెలుసు రత్తాలూ, ఆత్మహత్య చేసుకుంది, ప్రగతి ఆత్మహత్య చేసుకొంది అంతేగా–

రత్తా : అప్పుడే అమ్మాయిగారూ. నా ప్రగతి నన్ను దగ్గరకు పిలిచింది.

"ఒరేయ్ అబ్బాయ్యో నేను చచ్చిపోతున్నాను. ఈ నాయకుల చేతులో నీ ప్రగతి నాశనమై పోయింది శిలంపోయిన ప్రగతి జీవించలేదు ప్రగతికోసం నువ్వెంత ఏడ్చినా లాభంలేదురా" అంటూ కన్నుమూసిందమ్మాయిగారూ.

గీత : నీ కెంత అన్యాయం జరిగింది రత్నాలూ.

రత్నా : అయినా నాకేం ఫర్వాలేదమ్మాయిగారూ ఇప్పుడు మీరున్నారుగా నా ప్రగతిని మీలో చూసుకుంటూ హాయిగా కాలం గడుపుతాను నా చెలిని మీ కళ్ళలో చూసుకుంటూ తృప్తిగా జీవిస్తానమ్మాయి గారూ.

గీత : అలాగే రత్నాలూ. అలాగే-

రత్నా : (కళ్ళుతుడుచుకున్నాడు) ఇప్పుడు చెప్పండమ్మాయిగారూ మీరీ యింటి యజమానులు నేనీయింటి పనివాణ్ని. నన్నేం చేయమంటారు?

గీత : ఏమీ చెయ్యొద్దు రత్నాలూ. నవ్వుతూ, నవ్విస్తూవుంటే చాలు—

రత్నా : అదేమిటమ్మాయిగారూ అయ్యగారూ అంతే అసలు నేనీయింట్లో వుంది ... (ఇంతలో కిరుణాకరు మేడదిగి హాలోకొచ్చాడు)

కరు : మమ్మల్ని నవ్వించడానికి నవ్వులబాటలో నడిపించడానికి [గీత ఓ ప్రక్కకు వెళ్ళింది సిగ్గుగా]

రత్నా : బాబుగారూ.

కరు : నిన్నావుగా గీతా ఇన్నాళ్ళు గుండెలనిండా విషాదాన్ని. కన్నుల నిండా నిశీధాన్ని-ఈ అమాయకుని నవ్వులతోనే వెలిగించాను. ఆదరిక్కులేని నాకు. దీపం వెలిగించే భాగ్యం కలవయిన యీ మేదకూ, ఆదేజ్యోతిగా మిగిలిపోయాడు. ఇప్పుడు నీ రాకవలన, చీకటి విరిగిపోయింది, శూన్యమయమైన నా హృదయంలో వెన్నెల నిండిపోయింది, ఇదంతా నా అదృష్టం గీతా!

గీత : లేదండి? ఇదంతా నా అదృష్టం, జీవితంలో ఎన్నడూ వూహించని

కలలు, నన్ను స్వర్గసోపాన శిఖరమునుంచి ఆకాశమంత, అంతస్తులో ప్రతిష్ఠింపజేశాయి, నేనే అదృష్టవంతురాలిని-

కరు . గీతా!

ర : బాబుగారూ?

కరు . ఏమిట్రా?

ర . అమ్మగారిని చూస్తుంటే చనిపోయిన లక్ష్మీదేవిగారు మళ్ళి మనింట్లో తారాడినట్లుంది గదండీ!

కరు . (గీతను వింపాదిగా చూశాడు) అవున్రా! నిజం చెప్పావు! లక్ష్మి అందెలు ఘల్లు ఘల్లుమని మోగిన మనింట్లో ఇప్పుడు గీత కాలి మెట్టెలు చప్పుడు చేస్తున్నాయి. ఇంతకాలం బ్రతుకుమీదరోత, జీవితమ్మీద అసహ్యం పుట్టిన నాలో గీత క్రొత్త ఆశలు చిగురింప జేసింది. ఒరేయ్ ఏనాడో చేసుకున్న పుణ్యంకొద్దీ మళ్ళీ మనింట్లో లక్ష్మీదేవి వెలిసిందిరా.

గీత, ఎందుకండీ...నన్నిలా పొగుడుతారు?

కరు . ఇది పొగడ్త కాదుగీతా! ఆస్తికీ ఆడంబరాలకూ తిరుగులేని వంశం మాది విలాసాలకూ వినోదాలకూ అంతులేని కుటుంబంకూడా. అయినా లక్ష్మి కన్నుమూసిన తోడువలన జీవితంలో అన్నిఆశలూ అనురాగాలూ కూడా కన్నుమూశాయ్. నువ్వొచ్చిన తర్వాత మళ్ళి నవ్యకాంతులు వెల్లివిరిశాయి నయనాల్లో ఎన్నో ఆశలు మెరిశాయి

ర . బాబుగారూ, తమరేమీ అనుకోనంటే ఒక్క మాట అడుగుతాను

కరు , అడుగు రత్నాలూ! ఒకటేమిటి? వంద అడుగు ఇన్నేళ్ళా నాయింట్లో పనివాడివి నువ్వే అయ్యావు. నవ్వుల దివ్వెగా వెలిసిన పువ్వుగా నువ్వీ యింట్లోవుండి నన్ను బ్రతికించావ్. మళ్ళి బ్రతుకిచ్చావు. ఎన్నయినా అడుగు రత్నాలూ!

ర . ఏం లేదు బాబుగారూ! అమ్మగారు రేనిలోటు తీరిందిగా

కరు . ఏం చేయమంటావో చెప్పు-

ర . చినబాబును యింటికి తీసుకురండి బాబూ; అమ్మగారే స్వయంగా చూసుకుంటారు

కరు . అత్రపత్నం విన్నవే చేశావు రత్నాలూ.

ర . బాబుగారూ.

కరు . చినబాబు యీ రోజూ యింటికొస్తున్నాడు

ర . అమృతం తాగినంత తీయని కబురు చెప్పారు బాబుగారూ. ఇక మనింట్లో ఏకొరతా వుండదు బాబూ, అలా బయటికి వెళ్ళొస్తాను.

కరు . వెళ్ళిరా బిడ్డల కోర్కె తీర్చలేని తండ్రి తండ్రిగాకుండా జన్మ నిచ్చిన భగవంతుడే నన్ను మర్చిపోయాడు. జీవితాన్ని కసి కొద్దీ చీకటిలోకి నెట్టివేశాడు. విధికూడా పగతో నన్ను పక్కదారి పట్టించింది నువ్వే నాకు రెండుకళ్ళయి రెండో పెళ్ళిచేసి శూన్యమయమైన నా హృదయాన్ని యీ యింటిని దేవాలయం చేశావు. వెళ్ళు రత్నాలూ, వెళ్ళు.... ఇదిగో డబ్బు (అంటూ పర్సుతీసి పదిరూపాయలనోటు యిచ్చాడు)

ర . బాబుగారూ,

కరు . ఇంకో పది కావాలా రత్నాలూ.

ర . అక్కర్లేదు బాబుగారూ. ఎప్పుడూ మీదయవుండాలేగాని యీ పదులూ పాతికలూ నాకెందుకు; డబ్బుకన్నా విలువైనా మీ ఆత్మీయత చెరిగిపోకుండా కరిగిపోకుండా వుంటే చాలు బాబూ అదేపదివేలు.

కరు . ఒరేయ్. చేసినమేలు మర్చిపోయేంత కృతఘ్నుణ్ని కానురా నేను. వెళ్ళు. (రత్నాలు నమస్కరించి బయటికి వెళ్ళాడు) నన్ను క్షమిస్తావా గీతా

గీతా . అంతమాట అనకండి.

కరు . ఇన్ని సంపదలూ సంస్కృతివున్నా నన్ను వెలుగు లోనికి నడిపించే ఇల్లాలు పోయిన తర్వాత నేనేమీలేనివాణ్నయ్యాను. చివరకు చినబాబుకూడా యిల్లు విడిచి వెళ్ళాడు. తిరిగి వస్తాడనే ఆశ..

పన్నగిలి పోయింది. కాని గితా, మన పెళ్ళి జరిగిన మరునటి రోజే వచ్చాను గితా.

గిత : ఈ విషయం ముందుగా నాతో ఎందుకు చెప్పలేదండి?

కరు . నేను చేసిన మొదటి పొరపాటు అదే గితా, చెప్పు దానికి నోరు రాలేదు అయినా నేని పెళ్ళి చేసుకుంది .. నాకో యిల్లాలు కావాలని మాత్రం కాదు గితా। ఈ యింట్లో జ్యోతికావాలని— ఇందులో నా తప్పేమన్నా వుంటే-క్షమించు.

గితా . అంతమాట ఎందుకులెండి.

కరు . జీవితంలో అన్ని సుఖాలు అనుభవించిన నేను-ఏ సుఖానికి నోచుకోని నన్ను-నా యింటికి యిల్లాలుగా – ఒక తల్లిగా తీసు కొచ్చాను. వయసు చావక ముందే లక్ష్మిచనిపోయింది- ఉద్యోస్తా తని అకవడిన కొడుకు వూరు విడిచివెళ్ళి- రావంం మానేశాడు. ఇప్పుడు...నేను దారితప్పాను. ఒక్కసారి కాలుజారితే- తిరిగి తీసుకోలేనంత అని నీతి బురదలో కూరుకుపోయాను. అప్పుడే... నువ్వు నాకారు క్రిందపడబోవటం నిన్ను యింటికి తీసుకు రావడం జరిగింది—నువ్వు యింట్లో అడుగుబెట్టగానే జ్యోతి వెలిగినంత పనయింది ఆ వెలుగు శాశ్వతంగా వుండాలనే నీ మెళ్ళోతాళి గట్టాను గితా। ఇల్లు విడిచివెళ్ళిన నా బాబు కూడా-నీ రాకతో యిం టికి చేరాడు నిజంగా నువ్వు దేవతవు గితా।

గిత . ఎందుకండీ నన్నలా పొగిడేస్తారు?

కరు , తప్పు గితా। ఇందులో నా తప్పేముంటి? నేనెవరికి అన్యాయం చేశాను?

గిత లేదండి మీరు...ఎవరికీ జీవితంలో అన్యాయం చేయలేదు. ఎడా రిలో ఏ నుడిగానికోరాలి, ఎండిపోతున్న ఓ గులాబీని చిగురిం పజేశారు. కొత్త వెలుగు మొలిపించారు. ఇందులో మీ తప్పేమీ లేదండి।

కరు . చూడు గీతా! పోలీసేత్కు న్యాయవాదిగా బాధ్యతకు నేనెప్పుడూ అన్యాయం చెయలేదు. తప్పులు చేసిన వాళ్ళకూ తప్పుడు సాక్ష్యలతో ఉరికంబాలకు ఎక్కాపలసిన వాళ్ళకు శిక్షకు బదులు, నాశక్తి మేరకున్యాయం పంచిపెట్టాను కాని...దేవుడే నాకు అన్యాయం చేశాడు. న్యాయాన్ని రక్షించడానికి- ధర్మాన్నితూకం వేయ్యడానికి అనేకసార్లు నన్ను జీవిత పోరాటంలో ఓడిపోయేలా చేశాడు గీతా!

గీత . లేదండీ! న్యాయం ఎప్పుడూ ఎక్కడా ఓడిపోలేదు. న్యాయానికి ఓటమే జరిగితే ఈలోకమే చీకటైపోతుంది.

కరు . గీతా. పెళ్ళి చేసుకోవాలని గుండె వగుళ్ళయే కొత్తదిగుళ్ళు మొలకెత్తాని నేనెప్పుడూ ఆశించలేదు కాని.. గీతా!నిన్ను మొన్నటి వరకు నా కష్టసుఖయోగక్షేమాలయినా- పట్టించుకోని నా చిన బాబు ఒక్కరోజు ముందు వచ్చివుంటే నేనే పరీక్షలోనూ ఓడిపోయే వాణ్ని కాదుగీతా

గీత . అన్ని మనం ఆలోచించినట్లు జరిగితే యిక ఆ దేవుడితో పనేముంటుంది చెప్పండి! అందుకే .. అప్పుడప్పుడూ... న్యాయానికి చిన్న చిన్న పరీక్షలు పెడుతూ వుంటాడు అంతమాత్రాన మనం ఓడిపోయినా న్యాయం ఓడిపోదండీ ఓడిపోగూడదు, ఓడిపోవడానికి వీల్లేదడి కూడా. ముందు మీ రెళ్ళి చిన బాబును యింటికి తీసుకురండి.

కరు . అలాగే గీతా. నువ్వు బాబుకోసం స్వీట్లు తయారుచెయ్యి. వాడికి తీపిఅంటే చాలాయిష్టం. వస్తా (అంటూ బయటికివెళ్ళారు గీత విట్టూర్పి లోనికివెళ్ళింది. క్షణంనిళ్ళబ్దం బయట కారుహారన్ మ్రోగింది. మధు డ్రైవర్ సహాయంతో ముందుకొచ్చారు. జేబులో నుండి కొంతడబ్బుతీసి అతనికిచ్చారు డ్రైవర్ లెక్కించిజేబులో పెట్టుకుని ఓనమస్కారంచెప్పి బయటికి వెళ్ళిపోయాడు. మధు

లోపలికివెళ్ళ ప్రయత్నంలో ఒకుర్చీతగిలి పడబోయి తమాయించు కున్నాడు)

మ . రత్నాలూ, ఒరేయ్ రత్నాలూ! (కొంతస్థాయిపెంచి రెండుమూడు సార్లు పిలిచాడు. గీత బయటకొచ్చింది మధునిచూసి, కంపించి పోయింది. "మధూ" అనిపెద్దగా అరవబోయింది కాని...... మాట అంగిలిదాటిరాలేదు. కన్నీళ్ళువచ్చాయి. మధు రాకతో మనసు మరి కలతతిరిగింది, చరచరా లోపలికివెళ్ళబోయింది) వెళ్ళిపోతున్నావా రంగి?

గీత . [కాళ్ళకు ఏదోబంధంపడ్డట్టు ఆగిపోయింది)
మ . గుడ్డివాణ్ణి అయితేమాత్రం గుర్తుపట్టలేననుకున్నావా?
గీత . మధూ- [అస్పష్టంగా గొణిగింది]
మ . కనులులేకపోతే, నీ కాళ్ళచప్పుడు పసిగట్టలేననా? నాన్న యింట్లో వున్నాడా? రంగి, ముందునాన్నను పిలు.

గీత . మధూ-మధు (అదురుతున్న పెదాలతో అనుకుంది)
మ . మాట్లాడవేం రంగి?
గీత . నేను రంగినికాను బాబూ [విషాదం గొంతులోచేరి కంఠాన్ని మార్చింది]

మ . రంగివికాదా నువ్వు?
గీత , కాదుబాబూ, రంగినిపన్లోంచి తీసేశారు.
మ . యెందుకని?
గీత . పెళ్ళి చేసుకుంది.

మ . రంగికూడా పెళ్ళయిపోయిందా!

గీత : పెళ్ళిళ్లు దైవనిర్ణయాలు అంటారుగా బాబూ.
మ . యింతకీ నువ్వెవరు?
గీత , కొత్తగా పనిలో చేరాను బాబూ.

మ . చిన్నప్పట్నుంచి రంగి యింటిపనులూ, వంటపనంతా చేస్తుండేది, తల్లిపోయిన తర్వాత నిజంగా తల్లిగాని తల్లిగా, ఎప్పుడేదికావాలో వెంటనేచేసేది. నవ్వించడానికి నమ్మకంగా పనిచేయడానికి రంగి చాలా మంచిది. యింతకీ నీ పేరు చెప్పావుకాదు?

గీత . ఏపేరుతో పిలిచినా పలుకుతాను బాబూ.

మ . పిలవడానికి ఏదో ఒకపేరు కావాలిగా. అసలు మీ అమ్మా నాన్నా పేరుపెట్టకుండానే, పెంచారా నిన్ను?

గీత . లేదుబాబూ. అందరికన్నా చిన్నదాన్నని, అందరూ నన్ను "చిన్నమ్మా" అనేవారు-

మ . ఓ... నీ పేరు చిన్నమ్మ అన్నమాట.

గీత , అవునుబాబూ.

మ . నాకో సహాయంచేస్తావా చిన్నమ్మా.

గీత . ఎందుకుచేయను బాబూ. అసలునేను ఏదోఒకటి చేయడానికేగా పనిలో కుదిరింది? ఏంచేయమంటారు

మ . నాకిప్పుడు కనులుపోయాయి చిన్నమ్మా.

గీత . లేదుబాబూ. నా రెండుకళ్ళూ మీవే అనుకోండి.

మ : ఒకసారి గీతకూడా ఈ మాటేఅంది చిన్నమ్మా కాని...ఏంచేసిందో తెలుసా? చివరకు నా రెండుకనులూ పోవడానికి కారణమయింది.

గీత . చినబాబూ [బావురుమంది]

మ . ఏడుస్తున్నావా చిన్నమ్మా ప్రాణానికి ప్రాణమై గుండెకు గుండెనై నన్ను దివ్యలోకాల్లో నీలకాంతుల్లో ఓలలాడించే నేను నా గీత నా కోసం ఒక కన్నీటిబొట్టు కార్చలేదు చిన్నమ్మా కనీసం... ఒక నిట్టూర్పుఅయినా విడువలేదు

గీత . లేదుబాబూ, ఆమె కుళ్ళికుళ్ళి, కన్నీరంతా యింకేలా ఏడ్చి-ఏడ్చి జీవచ్ఛవంలా మిగిలిపోయింది బాబూ? [బాధపడింది]

మ . గీత నీకుతెలుసా చిన్నమ్మా.

గీత . బాగా తెలుసు,

మ . అయితే, యిప్పుడామె ఎక్కడుంది?

గీత . మీరు గుర్తుపట్టలేనంత దూరంలో-

మ . ఏమిటి చిన్నమ్మా నువ్వనేది? గీతకేమైంది?

గీత . పెళ్ళయింది,

మ . చిన్నమ్మా [గతుక్కుమన్నాడు]

గీత . నిజమే బాబూ.

మ . గీతకు పెళ్ళయిందా, కనులుపోయినా, ఆమెకోసమే జీవిస్తున్న నన్ను ఏంచేయాలని- శోకితలొంచింది?

గీత . శోకికాదు చినబాబూ, ఎగతాళికి ఈ సంఘానికి తలొంచింది. అంతేబాబూ అంతే-

మ . ఈ గుడ్డివాడికి చివరకు తిపిగురుతులే మిగిల్చిందన్నమాట.

గీత . మీకు కళ్ళెందుకు పోయాయి చినబాబూ?

మ . కనులుండీ గుడ్డివారుగా మారిన - గీతలాంటి వాళ్ళను చూడకుండా వుండేందుకే చిన్నమ్మా.

గీత . గీత మీరనుకునేంత పిచురాలు కాదులే బాబూ.

మ . ఆ ఉద్దేశ్యంతోనే గీతను నాత్రికుకు అర్పణచేశాను. అంతేకాదు చిన్నమ్మా? గీత శ్రేయస్సుకోసం, నా సమస్తాన్ని మూసగాచేసి, ఓ మహాకళామూర్తిని చేసాను. చిన్నమ్మా కాలేజీలో చదువు తున్న రోజులలో.... మా యిద్దరికి కళలమీద ఆసక్తి నటనమీద భక్తి కలిగా.... ఓ మహాకవి రచించిన మహాశిల్పి నాటిక ఆడాలని అందులో గీతకు ప్రధానమైన పాత్రనియమించి నా ప్రాణంపోసి ఆమె జీవించేలా చేశాను చిన్నమ్మా.

గీత . అవును చినబాబూ మీ గురించి గీత ఎప్పుడూ చెపుతూవుండేది.

మ . ఏమని చిన్నమ్మా?

గీత . మీరుబాగా నటిస్తారని, నటనలో జీవిస్తారని-

మ : నిజమే చిన్నమ్మా? ఈ కళలూ, కవితలూ నా కందించిన తల్లి ఎవరో తెలుసా? అభినందనలూ అంతక్యం.

గీత . చూడండి బాబూ.

మ . ఏమిటి చిన్నమ్మా?

గీత . మిమ్మల్ని ఒకమాట అడగాలని వుంది.

మ . అర్థమయింది చిన్నమ్మా గీతలేకుండా, మహాశిల్పిగా నటించి, ఆపాత్రకు సరియైనన్యాయం చేకూర్చలేను.

గీత . మీకేమీ అభ్యంతరం లేకపోతే, ఆ పాత్రలో నేనుంటాను చిన బాబూ.

మ . చినమ్మా?

గీత . ఒకసారి శిల్పిగా మిమ్మల్ని చూడాలని వుంది బాబూ.

మ . అలాగే చినమ్మా? నీ యిష్టప్రకారమే నటిస్తాను ఒక పాడుబడిన దేవాలయ ప్రాంగణంలో నల్లరాతికి నాజ్యుతలుచెక్కే శిల్పిగా నన్ను చూడు చిన్నమ్మా నేను చెక్కుతున్న శిల్పం పేరేమిటో తెలుసా నీకు?

గీత . "మానవత"

మ . అవును చిన్నమ్మా "మానవత" అదే ... నా మానవత, అక్కడికి నన్ను నడిపించుకు వెళ్ళు చిన్నమ్మా.

గీత . అలాగే చినబాబూ, అలాగే (అంటూ చేయి పట్టుకుని ఓ ప్రక్కకు నడిపించుకు వెళ్ళింది, మధు కూర్చున్నాడు]

మ . చిన్నమ్మా?

గీత . ఏమిటి బాబూ?

మధు: మానవత జీవించవాలి కళలతో కలోన్నత్య శాహాన్ని పూజాను

గీత : తెలుసు బాబూ!

మధు: అనడు వున్నమిరేయి

గీత : కాదు . వెనెత్తిలరేందు
మధు: మానవతను గుళ్లో ప్రతిష్ఠింపజేయాలని పూజారులూ పురప్రము ఖులూ సిద్ధమయ్యారు. మానవతను ప్రాణమాడించి-గుడికి నడి పించారు-

గీత : కాని మిమ్మల్ని గుడికి దూరంగా నెట్టివేశారు
మధు : ఎందుకో తెలుసా చిన్నమ్మా?
గీత : మానవతను సృష్టించారని-మానవతను బ్రతికించారని మానవతను బ్రతికించాలని బ్రతుకంతా అర్పణ చేశారని మానవతకు మరుజన్మ ప్రసాదించిన ఓమహాశిల్పి-కడజాతివారని చినబాబూ!

మధు: సమతలూ—మమతలూ కలబోసి-కళాప్రతిభనంతా కరిగించి మాన వతను మంచిని నేను కడజాతివాణ్నయితే సంఘం ఒప్పుకోలేదు చిన్నమ్మా!

గీత , మిమ్మల్ని శిక్షించారు చినబాబూ!

మధు. అవును చిన్నమ్మా! అప్పుడు దూరంనుండి కళ నన్ను పిల్చింది మానవత నన్ను కేకవేసింది అన్నయ్యా అంటూ గావుకేకపెట్టింది. ఏదీ ఆ పిలుపు? ఎక్కడ నా మానవత నిలబడింది? ఆ గుండెలో దీనాలాపం? విషాదం నిండిన నా కళగొంతు నాకు వినిపించలేదు? (అంటూ తడుముకుంటూ పడబోయి హాలంతా వెదికాడు అప్పుడు గీత ఓ ప్రక్క-నిలబడింది మానవతలా)

గీత . అన్నయ్యా!
మధు. తల! కళా! (అంటూ మానవత వేపునడవడానికి ప్రయత్నించాడు ఇబ్బందిగా)
గీత . నా కాళ్లు పగిలి పోతున్నాయన్నయ్యా.
మధు. నాగుండె పగిలిపోతుం దమ్మా నా హృదయమే ముద్దలై పోతుంది వద్దు..నా కళను కాళ్ళు ఇద్దలు కొట్టొద్దు మానవతను మానభంగం చేయొద్దు. మీకు పుణ్యం వుంటుంది

గీత. పాపాన్ని నా ముఖమ్మీద చల్లుతున్నారన్నయ్యా

మను. నేనెంత పొరపాటు చేశానమ్మా మానవత్వాన్ని యెప్పుడో మట్టి పాలు చేసిన యీ మనుషుల్లో నవతను కలిగించడానికి మూగలై మొగ్గలై పడి వున్న వీరు రూపమిచ్చి ప్రాణమిచ్చి జీవకళను ప్రసాదించి "మానవత" అని ముద్దుగా పేరుపెట్టి మూర్ఖుల చేతుల్లో పెట్టిన పాపినమ్మా నేను.

గీత. అన్నయ్యా నా గుండెలు పగిలిపోతున్నాయ్. నా ప్రాణం విలవిలా కొట్టుకుంటుంది, కొబ్బరికాయలు నాముని [illegible]దేకొట్టి ఆ పాపిష్టి వీళ్ళు అందంగా నువ్వు మలిచిన పసిడి ముఖమ్మీద చల్లుతున్నారన్నయ్యా. నిన్ను తృప్తిగా చూసే నా కళ్లలో ఆ పాపాన్ని చిమ్ముతున్నారు నన్ను చీకట్లో బంధించారన్నయ్యా.

మను. అవునమ్మా. నిన్ను చీకట్లోనూ నన్ను వాకిట్లోనూ బంధించారమ్మా ఈ కసాయివాళ్ళు మీకూ నాకూ అంతస్తుల తేడా కల్పించారమ్మా. కడజాతివాణ్ణని నన్ను నా మానవతకు దూరంగా నెట్టారమ్మా. నేను నీ దాకా రాలేను కదా. నువ్వే బయటికి రా చెల్లీ

గీత. తలుపులు బిగించారనయ్యా.

మను. ఈ దుస్థితికి కారణం నేనమ్మా. పండు వెన్నెల నీడల్లో వెలగడంలా మెరిసే నిన్ను ఈ పాపిష్టి మూకలపాలు చేశానమ్మా మా నవతను చంపుకుని నన్ను వీధిలోకి నెట్టివేశారు కదా. అ[illegible]కదా నువ్వే కదలిరా–కదలిరా.

గీత. రాలేనన్నయ్యా. తిరిగి నిన్ను చూడలేను. నేను చచ్చిపోతాను. చచ్చిపోతాను.

మను. చావ కూడదమ్మా: నిన్ను చంపుకోవడానికా నేనింత శ్రమపడింది? మానవత చచ్చిపోతే- యీ దేశం జన్మ జన్మలకూ బాగుపడదమ్మా మానవతను బ్రతికించడానికేనమ్మా ఇన్నాళ్ళు కన్నీళ్లు దిగమింగి కష్టాలు భరించాను.

గీత , అన్నయ్యా! గబ్బిలాలు చెవ్వులమీద గింగుర్లు పెడుతున్నాయ్ పాతె పురుగు ముక్కుమీద చెక్కిళ్ళ మీద నాట్యం చేస్తున్నాయ్ ఈ హింస నేను భరించలేను. ఈనరకం నేను భరించలేను. అన్నయ్యా నేను చచ్చిపోతాను చచ్చిపోతాను

మధు. వద్దు కళా వద్దు నువ్వు చావడానికి వీలు లేదు. అయ్యా పూజారి గారూ, మీ పవిత్రం పెడతాను నా బిడ్డంతా ముద్దవేసి ముద్దుగా మలిచిన మానవత- చచ్చిపోతానంటోంది, ఒక్కసారి ఆ గుడి తలుపులు తెరవాం బాబూ కిరజాతివాళ్ళయితే కళాకైవల్యం పొందగూడదా? కళకూ కవితలకూ కులాలు మతాలు అడ్డంగా వున్నాయా? అయ్యా ప్రెసిడెంటుగారూ, మీరైనా చెప్పండి. అవతల నా మానవత చచ్చిపోతానంటోంది. పాతెపురుగులు మానవత వంటిమీద గాయాలు చేస్తున్నాయి గబ్బిలాలు పొడుస్తుంటూ మానవత గుండెల్ని చీల్చి ఆడుకుంటున్నాయి. మున్సిబుగారూ, మానవత చచ్చిపోతానంటోంది, తలుపు తీయండి బాబూ. తలుపు తీయండి.

గీత . అన్నయ్యా ఏడుస్తున్నావా? నీ కళ్ళనుండి కారే ఆ కన్నీరు దోసిలినింపి నా ముఖమ్మీద చల్లన్నయ్యా. ఈ మూర్ఖులు పులిమిన మురికిని కడుక్కుంటాను.

మధు. కళా

గీత . అవునన్నయ్యా ఇప్పుడు నేను... నువ్వు సృష్టించిన మానవతను కాను ఈ నరరూప రాక్షసుల చేతులలో నలిగిపోయిన పతితను. నీ చేతి వులితో నగిషీలు దిద్ది- పన్నొకపసిడిముద్దగా మలిచిన మానవతను కాను ఆ స్వార్థపరుల కులతత్వాల వూబిలో కూరుకు పోయిన కులటను నీ పవిత్రతను ప్రాణంపోసి పలుమారులు నన్ను పరామర్శించిన మానవతను కాను. ఆ దుష్టుల ఆలోచన వెంపేరాలని కొల్పరి మిగిలిపోయిన కులస్థను. మూగనన్నయ్యా. మూగదాన్ని.

మ . వీల్లేదమ్మా! నేను మలినమైనమానవత మూగదైపోవడానికి వీల్లేదు
మానవత మలినం కావడానికి వీల్లేదు పూజారిగారూ! మానవతను
బ్రతికించండి, మానవత లేని లోకంలో నేను జీవించలేను పాపా
లకు ప్రతిరూపాలయిన మీమధ్య నా మానవత మరణిస్తుంటే
చూస్తూ వూరుకోలేను. బ్రతికించండి. బ్రతికించండి బాబూ మీకు
పుణ్యముంటుంది.

గీత . అన్నయ్యా! నాకు వూపిరాడటం లేదు, నేను మారిపోతాను.

మ . కళా,

గీత . ఆ దుర్మార్గులు చేస్తున్న దురంతాలుచూస్తూ నేను జీవించలేను. ఆ
పాపిష్టిమూకల పరిహాసాలతో నా ప్రాణం నిలుపుకోలేను.
పసుపు ముద్దల్నీ పాపపుముద్దల్నీ తిని బ్రతకలేనన్నయ్యా

మ . వద్దుకళా. నువ్వాపాపాన్ని తినొద్దు.

గీత . మరి నీ మానవత జీవించాలంటే నాకు నీతినితినిపించాలి సత్యాన్ని
త్రాగించాలి నిజాయితీలో స్నానమాడించాలి కాని ... నీళ్ళు
కుళ్ళు కుతంత్రాలువిండిన కొబ్బరినీరు చలి మానవతను మచ్చలు
చేస్తున్నారు అందుకే ... నాకు బ్రతకాలని లేదు. చచ్చిపోతాను.
మూగదాన్నయిపోతాను. నేను మూగదాన్నయిపోతా నన్నయ్యా!

మ . కళా! కళా! కళా! (బాధగా పిలిచాడు మానవత మాట్లాడలేదు)
అయ్యో భగవాన్ మానవత మూగదయిపోయిన తర్వాత నేను
ఎవరికోసం బ్రతకాలి? కళా మాట్లాడుతల్లీ. నా వూపిరి నీలో
వుంది. నా ప్రాణాల్లో నిన్ను మలిన మానవతాన్ని మనుగువరిచిన
యీ మానవ మృగాలకు మరల క్రొత్తజన్మ ధరించిన మానవతను
ప్రకాశింపచేయాలని కలలుగన్నానమ్మా కాని .... ఈ కరకుగుం
డెలవారు నీ కనులుపొడిచారు. నిన్ను గుడ్డిదాన్ని చేశారు,
మూగదాన్ని చేశారు నా కళ్ళముందే నిర్మింతనీచంగా వికృతంగా
బంధించి ఒడలు పిల్లులుండేలా కొట్టికొట్టి నీ పవిత్రరక్తం
చిందించి నవ్వుతూనిలబడితే నాకీ కళ్ళెందుకు? ఎవరిని చూడాలి?

ఈ పాపాన్ని నేను తొడలేను ఈ పాపిష్ఠిముఖాలు నేనుచూడలేను అందుకే ... అందుకే నాకీకనులు వద్దు నేనూ గుడ్డివాణ్నై పోతాను నేనూ గుడివాణ్నయిపోతాను [అంటూ బాగాకాలుతున్న లావుపాటి సాంబ్రాణికడ్డీలు అందుకుని రెండుకనులు కాల్చుకున్నాడు "అబ్బా" అంటూ చేతులలో కనులు దాచుకున్నాడు. "చినబాబూ" అంటూ గీత పట్టుకుంది]

గీత . చినబాబూ చినబాబూ

మ . (తేరుకున్నాడు గతంమంతి] విన్నావుగా చినమ్మా. గీతకూ- నాకూ స్పర్థలువచ్చాక- నా మిత్రులకోరికపై మళ్ళీ ఈ నాటిక ఆడవలసి వచ్చింది. గీత నటించవలసిన పాత్రలో మరో క్రొత్త అమ్మాయి నటించడంవలన నిజంగానే నాకనులు పోయాయి చిన్నమ్మా.

గీత . మధూ [అంటూ బావురుమంది, బ ు టను ుడి కరుణాకరంవచ్చాడు. గీత దుఃఖాన్ని దిగమింగి లోనికివెళ్ళింది]

కరు . ఎంతసేపయింది బాబూ వచ్చి?

మ . యిప్పుడే నాన్నా

కరు . నీకోసం... నేను ఆస్పత్రిదాకా వెళ్లాను,

మ . ఆ లోనికివెళ్ళింది ఎవరునాన్నా?

కరు . అన్నట్టు చెప్పడమేమర్చిపోయాను, ఆమె నీపినతల్లి బాబూ

మ . మళ్ళీ మీరు పెళ్ళిచేసుకున్నారా నాన్నా?

కరు . అదే నేనుచేసిన తప్పు బాబూ

మ . తప్పేముందిలే నాన్నా యింటిలో జ్యోతినివెలిగించాడు.

కరు . చీకటి విడిపోవాలని- చీకూ చింతలు మాసిపోవాలని నేని పనిచేయలేదుబాబూ .అయినా అమ్మను కరువుచేసుకున్న నీకు- మరో అమ్మనుతెచ్చి ఆలోటుతీర్చాలని నేని ప్రయత్నం చేయలేదు. తప్పయితే నన్నుక్షమించు మధూ.

మ . అంతమాట అనకండినాన్నా. అలామాట్లాడి ఈ గుడ్డివాడి గుండె

అలో మనుతను చంతకంది. [యింతలో గీత కాఫీ(క్రే)తో వచ్చి టీపాయ్‌మీద పెట్టింది ]

కరు . కాఫీ తీసుకో బాబూ! (అంటూ కాఫీకప్పు చేతికిచ్చి తనొకటితీసుకు న్నాడు యిద్దరూ(తాగి కప్పులు టీపాయ్‌మీద పెడితే, అవి తీసుకుని గీత లోనికి వెళ్ళిపోయింది] చూడుగీతా. మధును యికనుంచి నువ్వే స్వయంగా చూసుకోవాలి. తల్లిని పోగొట్టుకుని యింత కాలం చీకట్లోనే కాలంగడిపాడని, నేను తపించాను. కాని ఇప్పుడు ఈ (పపంచాన్నే చీకటి చేసుకున్నాడు యికమీదట ... ఏ రెండు కళ్ళూ బాబుకిచ్చి, (బతుకును పూలబాటచేసే బాధ్యత, కారం నీదే–

గీత . అలాగేనండి ... అలాగే,

కరు . వినావా మధూ! గీతకు నువ్వంటే ఎంత అభిమానమో–

మ . భగవంతుడు చాలా మేలుచేశాడు నాన్నా. నాకి లోకాన్నే చీకటి చేశాడు.

కరు . మధూ!

మ . అవునాన్నా. పాపాలనూ, మోసాలనూ చూడకుండా కళ్ళుతీశాడు, ఆత్మీయతనూ, అనురాగాన్ని పంచుకోవడానికి యింకా (ప్రాణా లనుమా(తం వుంచాడు,

కరు . మధూ,

గీత . చిన్నబాబును స్నానానికి తీసుకురండి. (లోనికి వెళ్ళింది)

కరు . పదబాబూ! వి(శాంతి తీసుకుందువుగాని [అంటూ మధును లోనికి తీసుకెళ్ళాడు చేయిపట్టుకుని. క్షణంనిశ్శబ్దం. యేదో విషాదగీతం వినిపిస్తుంటూవుంది, మధు తడుముకుంటూ బయటకొచ్చాడు గీత వెంటవచ్చింది)

గీత . యిలా అన్నంపెట్టి మానేసి, నామీద పగ తీర్చుకుంటావా మధూ?

మ . ఏమిటి నాకు పగేమిటి?
గీత . అన్నం తి కుండా లేదావేం?
మ . ప్రాప్తం వుండాలిగా-
గీత , మధూ!

మ . నేపుడు చాలా తెలివయినవాడు గీతా.
గీత , అవును నిన్ను గుడివాణ్ని నన్ను మూగదాన్ని చేశాడు.
మ . చాలా అదృష్టవంతురాలివి గీతా?
గీత . నామీద నీకు అసహ్యంగా లేదూ,

మ . (పెదాలమీద నవ్వాడు) ఎందుకుగీతా? ఆశలు నాదోపిలివిండా వోగా వనా, మమతలు నా మనసులో నింపావనా? చేతికొచ్చిన హృదయాన్ని నేలవేసి విసిరికొట్టావనా? ఎందుకు నీమీద అసహ్యం.
గీత . నాపరిస్థితి నీ కర్థంకాలేదు మధూ?

మ . నీకుమాత్రం ఏమర్థమయిందని, యింత త్యాగానికి పూనుకున్నావు?
గీత , నేనుచేసిన తెలివిమాలిన పనికి త్యాగం అని పేరుపెడుతున్నావా మధూ!
మ . అసలు నేను నీకేం అపకారం చేశానని, నన్నింత అన్యాయం చేశావు?
గీత , మధూ!

మ . నేనేం పాపంచేశానన్న నన్నిలా నవ్వులపాలు చేశావు?
గీత . లేదు మధూ? నేనేం చేయలేదు అంతా విధే చేసింది.
మ . విచిత్రమయిన విధిచేతిలో మనం ఓడిపోయాం, నిన్ను నమ్ముకున్నందుకు నన్ను గుడ్డివాడిని చేశావు

గీత . లేదు మధూ? అంత అభాండం మాత్రం నామీద వేయకు,
మ . మట్టిలావున్న నిన్ను మణినిచేస్తే నన్ను మట్టిలోకి నెట్టివేశావు. ...తకతినంగా శిక్షించడానికి... నేనేం ద్రోహంచేశాను?
త . పాపం చేసింది నేను మధూ! అందుకు తగినశిక్ష నేననుభవించాలి.

క్షమించమని అడిగే అర్హతను కూడా పోగొట్టుకున్న నాకు శిక్ష కావాలి మధూ?

మ . ప్రేమపేరుతో మమతల మందిరాలు కూలదోశావు, తాళికట్టించుకో వలసినదానివి తల్లివయి, నా కళ్ళముందే నిలిచావు? యింతకన్నా నీకు మరో శిక్ష ఏముంటుంది గీతా?

గీత . తల్లిని గాకపోయినా ఆస్థానంలో వున్నదానికి: మారుతల్లిననే. అవ వాదుమాత్రం నాకురానివ్వకు మధూ, నీకు పుణ్యముంటుంది-

మ : నిజం చెబుతావా గీతా?

గీత : ఎప్పుడయినా నీకు అబద్ధం చెప్పానా మధూ-

మ : పెళ్ళిచేసుకుందామని చేతిలో చెయివేసి, ఎదలో ఎదనుకలిపి, ఎందుకిలా దూరమయ్యావు?

గీత : మధూ.

మ : చెప్పుగీతా, ఇప్పుడయినా నిజంచెప్పు,

గీత . చెప్పలేను మధూ, ఇప్పుడు నేనేం చెప్పలేను.

మధు: అయితే నేనీఇంట్లో వుండటంకూడా నీ ఇష్టంలేదన్న మాట?

గీత . మధూ:

మధు. గీతా? నేనీయింట్లో వుండాలన్నా- తల్లిస్థానంలో వున్న నిన్ను గౌరవించాలన్నా- నాకీ నిజం చెప్పితీరాలి.

గీత : అయ్యో భగవాన్?

మధు. నీమీద నాకున్న ప్రేమ విరిగిపోకముందే చెప్పుగీతా.

గీత : ఏమని చెప్పను మధూ? నాకు జరిగిన అన్యాయాన్ని దౌర్భాగ్యాన్ని నీకేమని చెప్పను? ఎలా చెప్పను

మధు: అంటే... మరేమైనా తప్పుచేశావా?
గీత: నా మీద నమ్మకం లేదా నీకు?
మధు: మరేం మిగిలింది?

గీత. తోటలో అందాల గులాబీలు పరిమళాలు వెదజల్లే విరిసిన మల్లెలుండగా అవి రాలిపోవడానికి వాటి బ్రతుకులు కాలిపోవడానికి - కారణం ఎవరంటావ్,

మధు: ఆడవాళ్ళు

గీత. నిజమే, ఆడవాళ్ళే కాని ఆడదాన్ని పువ్వులా వాడుకునేది మగవాళ్ళు కాదా మధూ?

మధు. అంటే నువ్వు?

గీత. నలిగిపోయాను మధూ పూజకు నివేదనగా పడవలసిన పువ్వు పతితుల కాళ్ళ క్రిందపడి నలిగిపోయింది. మధూ

మధు: గీతా

గీత అవును మధూ అపవిత్రం అయిన యీ శరీరాన్ని నీకు అర్పణ చేయలేక విషాదాన్ని నీకు మిగిల్చాను నిన్న పెళ్ళికి అర్థం బలిచేసుకోవడం మోసమనే చీకటిని నీకు మిగిల్చాడు.

మధు. అర్థమయింది గీతా! ఇక నువ్వేం చెప్పకు-

గీత. వాడిన పువ్వు లేని నవ్వు తెచ్చి పెట్టుకుని పరమాత్మని పాద పద్మాల మీద పడితే దేవుడు క్షమిస్తాడా? పూజకర్త మేసని చిరునవ్వులు చిందిస్తాడా చెప్పు మధూ. హృదయపూర్వకంగా నువ్వే చెప్పు

మధు. ఇంత అన్యాయం జరిగినా విషాదాన్ని గుండెల్లో ఎలా దాచుకున్నావ్ గీతా?

గీతా. చెప్పుకునే అవకాశంలేక,

మధు: చేతులారా నిండు బ్రతుకును అర్పణ చేశావన్నమాట
గీత : తలదాచుకోవడానికి ఏ చెట్టు నీడయినా కావాలిగా మధూ!
మధు: గీతా!

గీత : దేవుడునన్ను శాపగ్రస్తురాలిగా సృష్టించాడు మధూ అందుకే...
చేదును మింగుతూ తీపి అనుకుంటూ నేను, చీకటి ముసుగు వేసు
కుని, వెలుగు రేఖలే అనుకుంటూ నవ్వా. ఇలా విడిపోయే
భాగ్యమే కాదు. ఈ మసిగుండంలో ఇలా కలుసుకునే భాగ్యమే
కాదు.

మధు: లేదు గీతా! మనిద్దరం విడిపోవడం వలన-మంచికి దూరమై
పోతున్నా. నాన్నగారికి, మళ్ళీ వెలుగు దారి చూపించావు! నీ
నిర్ణయంలో తప్పులేదు గీతా

గీత . నీకంతవరకే తెలుసు మధూ తాళి గట్టారన్నమాటేగాని... ...
హృదయంలో నాకింతచోటు యివ్వలేదు భార్యగా బాధ్యతలు నెర
వేర్చడానికి, అవకాశం యివ్వడం లేదు మధూ

మధు: అదేమిటి గీతా! ఆయననిన్ను కావాలనే చేసుకున్నాడుగా....
గీత . లేదుమధూ! గులాబి గాలికి, ఎగిరి ఎక్కడోపడుతుందని, ఓ గుడి
ముంగిట పడవేశాడు అంతే మధూ

మధు: నాన్నగారు... న్యాయానికి అన్యాయం చేయడుగీతా!
గీత . ఆదేవునికి నేను అన్యాయం చేయలేను మధూ! అందుకే....
మధు: ఏం చేస్తావు!

గీత : కడుపులో కలుషితాన్ని కలిపి, బ్రతుకును విషమయం చేసుకో
లేను-

మధు. అంటే...

గీత . పవిత్రదేవాలయంలో పాద రేణువుగానైనా పనికిరాని నేను, పాపా
నికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను.

మధు. పారిపోతావా?

గీత. దూరంగా వెళ్ళిపోతాను.

మధు. తాతకా? లోకానికా?

గీత. రెంటికీ-

మధు. నన్ను గుడ్డివాణ్ని చేశావు? గుడ్డిగా నిన్ను పెళ్ళాడిన నాన్నగారిని మళ్ళీ త్రాగుబోతునే చేస్తావా గీతా?

గీత. మధూ

మధు. ఆయన సర్వనాశనానికే పునాది వేస్తావా?

గీత. మధూ- ఛు

మధు. చెప్పు గీతా? ఏం చెస్తావు?

గీత. తాతకి తలొంచానుగాని...యీలోకానికి, సంఘానికి తలొంచి, మిగిలిన జీవితాన్ని యీదలేను మధూ నాకాశక్తి లేదు,

మధు, చూడు గీతా? గతాన్ని మర్చిపోయినవాళ్ళు, తప్పుత్తును దిద్దుకున్న వాళ్ళు ధన్యులని పెద్దలంటారు. అలాగే...మనిద్దరి మధ్య జరిగిందంతా ఓ పీడకలగా, చెరిగిపోనీ, అప్పుడు నాకు పరచ పై ప్రేమపాలు త్రాగించిన గీతవు కాదు నువ్వు. ఉగ్గుపాలు త్రాగించి, ఉయ్యాలలో పడుకోబెట్టి-జోలపాడి, జోకొట్టిన తల్లివి నువ్వు-

గీత. మధూ

మధు. రాగాలూ- అనురాగాలూ- వొలికించి- యెదలో యెదను పరిచిన గీతవు కాదు నువ్వు- మాతృత్వపు పాలలో అమృతాన్ని కలబోసి - బ్రతుకిచ్చిన మాతృమూర్తివి నువ్వు- అందుకే ....నువ్వు బ్రతకాలి-నూరేళ్ళు బ్రతకాలి.

గీత. ఎవరికోసం మధూ.

మధు. నాన్నగారికోసం ఇంటి గౌరవం మంట గలిసి పోకుండా వుంచటం
కోసం ఈ చీకటిని వెలుగులోనికి నడిపించడంకోసం

గీత. నాకు శిక్ష కావాలి మధూ శిక్ష కావాలి.

మ : ఏ దేవుడయినా నిన్నింతకన్నా యింకెలా శిక్షించగలడు గీతా!
గీత : మధూ.

మ : నన్ను మేడమీదకు తీసుకువెళ్ళగలవా గీతా!

గీత : అలాగే మధూ, అలాగే (అంటూ చెయ్యిపట్టుకుని మేడమీదకి నడి
పించుకువెళ్ళింది క్షణం నిశ్శబ్దం. మదన్ బయటినుండి వచ్చారు.
హాలంతా పరీక్షించాడు టీపాయిమీదున్న యాపిల్ పండు అందుకుని
కూర్చున్నాడు. చెప్పరెండూ టీపాయిమీదపెట్టి పండును కత్తితో
తరుగుతున్నాడు కరుణాకరం లోపలినుంచి వచ్చి మదన్ని చూసి
నిర్ఘాంతపోయాడు]

మద: యింటిదాకా వచ్చానని బాధగావుందా!

కరు : ఎందుకొచ్చావు!

మ : ఎందుకొస్తానో తెలుసుగా కూర్చోండి.

కరు : నాయింట్లో నాకు మర్యాదేమిటి?

మ : (నవ్వాడు) నీయిల్లా! మనిల్లు మనిల్లు అనండి, బావుంటుంది.
కరు : నోర్ముయ్!

మ : నోరుమూయించటం మదన్కు అలవాటయినా- యిప్పటిదాకా నోరు
మూసుకునే వూరుకున్నాడు. ఎందుకో తెలుసా.

కరు : [చూసి వూరుకున్నాడు)
మ : చెప్పలేవు కరుణాకరం, నీకోసం నీ క్షేమంకోసం.

కరు : యింటికి నువ్వొచ్చిన పనిచెప్పు.

మ : చచ్చినవాని చిత్రం చచ్చినవాడికే చిత్రం జరుగుతూనే వుంటుందిగా.

కరు : అయినా నీకేం తక్కువచేశాను?

మ : ఏముందని- అవతల నాకేం మిగిలిందని?

కరు : మదన్

మ : చెప్పు కరుణాకరం. నాకేం మిగిల్చావు? భయంకరమైన ఒంటరి తనంలో పడిమంటికి భయపడుతూ- బ్రతుకును నరకం చేసుకు న్నాను భవిష్యత్తును చీకటి చెరసాలను చట్టానికి భయ పడుతూ సంఘానికి జంకుతూ యిలా యెవరికి కానివాడిలా యేమీ లేనివాడిలా జీవిస్తున్న నా అభాగ్యజీవితానికి బాధ్యు లెవరు? నువ్వు.... నువ్వు....

కరు : నన్నెందుకు మాటలతో చంపుతావు?

మ : కత్తులతో చంపడం యిష్టంలేక.

కరు : ఒకరికి అన్యాయం చెయ్యడం నాకిష్టంలేదు.

మ : యిప్పటిదాకా నువ్వు ఎవరికి న్యాయంచేశావు?

కరు : అందరికి అందరికి మదన్

మ : మరి నన్నెందుకిల చేశావు?

కరు : కొందరు చేతులారా బ్రతుకును బజారుపాలు చేసుకుంటారు.

మ : బజారుజీవితాలను దాగుచేసేవాళ్ళు కొందరుంటారుగా-

కరు : మదన్,

మ : చెప్పు కరుణాకరం నేనిలా బజారుబిడ్డగా బ్రతకటానికి కారణం యెవరు?

కరు : నేనుమాత్రం కాదు.

మ : నువ్వే నువ్వే నువ్వే

కరు : కాదూ కాదూ కాదు.

మ : పిలొవాడించి లాభంలేదని యిదివరకే నిర్ణయించుకున్నాను.

కరు : అయితే యిప్పుడెందుకొచ్చావు?

మ : తెగతెంపులు చేసుకుందామని.

కరు : నేను ఆలోచించుకోవాలి.

మ : ఏమిటి? ఏమిటి నువ్వాలోచించేది.

కరు : భవిష్యత్తును ఎలా బంగారంచేయాలా అని?

మ : కాదు నా నరనాడుల్లో ప్రవహించేది ఎవరి రక్తమోనని-

కరు : కాదు మదన్ అలా కానేకాదు.

మ : ఈ కత్తి తీసుకోండి. శరీరంలో ఎక్కడకావాలో కోసి చూడండి
అణుఅణువులో నరనరాల్లో ఎవరిరక్తం గడ్డకట్టివుందో తెలుస్తుంది

కరు : నన్నెందుకురా చంపుతావ్.

మ : చంపడం నాకెంత సులభమైనా- ఏ బంధానికో నా చేతులు కట్టబడి
పోతున్నాయ్ కరుణాకరం. అందుకే. నువ్వింతకాలం బ్రతికావు
ఇంకా బ్రతుకుతున్నావు. బ్రతుకుతావు కూడా త్వరలో....ఆ పని
చేస్తే....

కరు . ఎంతివ్వమంటావు?

మ . ఎంతిస్తే సరిపోతుందో నువ్వే ఆలోచించు.

కరు , పాతిక వేలిస్తాను వెళ్ళిపో.

మ . (నవ్వుతూ హేళనగా) ఒక అమాయకురాలి శీలం ఖరీదు పాతిక వేలన్న
మాట?

కరు : మదన్

మ : తొమ్మిది నెలలు మోసినందుకు కని చనుబాలిచ్చి జోకొట్టి జోల పాడినందుకు ఏమిస్తావు కరుణాకరం ఎంతిస్తావు?

కరు : మదన్.

మ : శీలానికి ఖరీదు కట్టావుగాని. కన్నతల్లి మాతృత్వానికి వెలగట్ట లేదేం? ఆమె నిండు జీవితం కుండలా పగిలిపోయినందుకు ఎంతిస్తే సరిపోతుందో ఆలోచించు అందరిలా గుండెమీద చెయ్యేసుకుని నిండుగా బ్రతికే అవకాశాన్ని అదృష్టాన్ని కరువు చేసుకున్న నేరానికి నువ్విచ్చేది. పాతికవేలా? నా బ్రతుకు ఖరీదు ఒక్క పాతికవేలా? చెప్పు కరుణాకరం.

కరు : మదన్, ఇప్పుడు నా మనసేం బాగుండలేదు, నన్ను ఆలోచించుకోని విశ్రాంతి తీసుకోనీ వెళ్ళు.

మ : చూడు కరుణాకరం. నేను ఆస్తిపంచమని అడగడానికి రాలేదు ఆత్మీయత పంచిపెట్టు.

కరు : అదే నేను ఆలోచించుకోవాలి.

మ : కరుణాకరం నీ చేతిలో వున్న న్యాయ శాస్త్రాన్ని అస్త్రంలాగా మీద ప్రయోగించి నా దౌర్భాగ్య జీవితాన్ని ముక్కలు చేశావు బ్రతుకంతా మచ్చలు చేశావు ఈ కలుషితాన్ని కడిగివేసుకోవడానికి కాలం. కరుణించదని నాకు తెలుసు. అందుకే ... దారిమార్చుకున్నాను. నన్ను చూస్తే ఈ దిక్కుమాలిన సంఘం బెదిరిపోయేలా మారిపోయాను నేనూ మనిషినైనా సంఘం నన్ను వేలెత్తి చూపింది ఎగతాళి చేసింది. హేళనగా చూసింది గేలిచేసింది గోలచేసింది నాలో పగను పదింతలు చేసింది. అందుకే కరుణాకరం నేను మనిషికాని మనిషిగా మారిపోయాను, ఈ కత్తి నా చేతిలో వున్నంతకాలం చట్టానికి సమాజానికి న్యాయానికి ధర్మానికి భయపడే దుస్థితి లేకుండా చేసుకున్నాను. అందుకే... అందుకే ... కరుణాకరం నా గుండె అగ్నిగుండంగా మారిపోయింది ఇప్పుడు

నా కర్తవ్యం అత్యసాధన మనిషికీ మనిషికీమధ్య దేశానికీ దేశానికీమధ్య వర్గానికీ వర్గానికీమధ్య స్వార్థాన్ని అగాధంలా చేసిన మీలాంటి న్యాయమూర్తుల కసాయితనాన్ని కత్తిరించి వేయడమే ప్రస్తుతం నేను చేయవలసిన పనిఇప్పుడు నేను ప్రశ్నించేవాణ్ని చేతులు కట్టుకుని బదులు చెప్పవలసిన వాణివి నువ్వు నేను శిక్షించేవాణ్ని నా యెదుట తలొంచే నేరస్తుడివి నువ్వు

కరు : కాదు ... నేను నేరస్తుణ్ని కాదు మదన్.

మ : ఎందుకాదు? అందర అధికారం అహంకారం కలబోసిన్యాయం అనే పేరుతో ప్రభుత్వ బలంతో నన్ను నేరస్తుణ్ణిచేసి. నాచుట్టూ విషవలయాన్ని వన్ని, వన్నిలాచేసిన నువ్వు... యింకేమవుతావ్,

కరు : మదన్

మ : చెప్పు కరుణాకరం? మనిద్దరినమన్యగా కాకపోయినా-న్యాయమూర్తి ఒక నేరస్తునివట్ల చూపవలసిన కనీససానుభూతితో చెప్పు, ఇందులో నా తప్పేమిటో, అందుకు శిక్షేమిటోకూడా నువ్వే చెప్పు-

కరు : చెప్పలేను మదన్, ఇప్పుడు నేనేం చెప్పలేను నామనసుమసలిగి పోయింది, రగిలి పోతుంది-

మ : ఆ మాటలమీద ... నా సానుభూతిని పమ్మరించ మంటావా?

కరు : వద్దు మదన్? ఇప్పటికీ... సినహానంతో నా బ్రతుకంతా తడిసి పోయింది.

మ : ఇంకేం చేయమంటావ్?

కరు : ప్రస్తుతం... యిక్కడనుండి వెళ్ళిపోవాలి.

మ : మళ్ళీ ఎప్పుడు రమ్మంటావు?
కరు : నేనే కబురుచేస్తాను?

మ : చూడు కరుణాకరం? ఆత్మీయతనూ, అభిమానాన్ని దూరం చేసుకుని నన్ను మానవతకు దూరం చేశావు? అయినా-నిన్ను క్షమించాను. ఇంకా క్షమిస్తున్నాను నీ సుఖం, నీ ఆనందం, నీ తృప్తి కూడా కని, చరిత్రలో ఒక తీయని దుర్మార్గుడుగానే మిగిలిపోయావు నువ్వు నమ్ముకున్న న్యాయానికీ, ధర్మానికీ, నీ తప్పులకు ఎప్పుడో క్షమార్పణ చెప్పుకోవలసిన దుస్థితి, నీకూవస్తుంది, గుర్తుంచుకో, వస్తా. [వెళ్ళబోయిఆగాడు]

కరు : ఆగిపోయావేం?

మ : ఈసారి నేను యింటికి రావడం జరిగితే, బంధాలు తెంచుకోవడం, ఆస్తులు పంచుకోవడం జరిగితీరుతుంది,

కరు . అలాగే-

మ : వస్తా? (వెళ్ళబోయి, ఆగాడుమళ్ళీ)

కరు : ఇంకేం కావాలి?

మ : ఒక్క-సారి నువ్వు పెళ్ళాడిన తల్లి కాని తల్లిని పిలూ చూసివెళ్తాను

కరు : మదన్

మ . నా తల్లిని ఆమె కళ్ళలోచూసి- తృప్తిగా నిట్టూర్చి వెళ్ళి పోతాను కరుణాకరం

కరు . మదన్?

మ . ఇన్నాళ్ళూ కరువైన మాతృత్వాన్ని- తల్లిప్రేమలో నిండిన ఆత్మీయత తను, ఆ చల్లతల్లిని చూసి,వెళ్తాను-

మ . అలాగే మదన్? అలాగే, కాని... కాని... ఒక్క షరతు-

మ . నాకు తెలుసు కరుణాకరం మనిద్దరమున్న సంబంధం ఆమెకు తెలీ కూడదు. అంతేకదూ?

కరు . అంతే మదన్ అంతే, [ఇంతలో గీత బయటికొచ్చింది. మదన్ని చూసి, నిర్ఘాంతపోయింది. మదన్ కూడా ఓ కెవ్వుపాటు ప్రాణావులా అయిపోయాడు) అ... మదన్ ఈమె... ఈమేనయ్యా నా భార్య... గీత,

మ . గీత... బాగా పరిచయమైన పేరులావుంది.

గీత . వీడే... వీడేనండి-(అంటూ పడిపోయింది. కరుణాకరానికి పరిస్థితి అర్థంగాక... ఆమెను సోఫాలో పడుకోబెట్టాడు]

మ . కరుణాకరం పాపం ఆమెకు మూర్ఛలరోగం వున్నట్టుంది. డాక్టర్ని పిలిచి చూపించు, వస్తా; [అంటూ చరచరా బయటివెళ్ళాడు]

కరు . గీతా గీతా ఏం జరిగింది? రత్నాలూ? ఒరేయ్ రత్నాలూ? (కంగా రుగా పిలిచాడు, రత్నాలు వచ్చాడు) ఒరేయ్... ముందు గీతను లోనికి తీసుకు వెళ్దాంపద -

ర : ఏమయింది బాబుగారూ? అమ్మగారెందుకిలా పడిపోయారు?

కరు : జీవితమే అరుగున పడిపోయింది రత్నాలూ? ముందు గీతను లోని కితీసుకు వెళ్దాంపద; (అంటూ యిద్దరూ ఆమెను చేతులమీదగా యింట్లోకి తీసుకు వెళ్ళారు-హడావుడిగా కరుణకరం ఫోను అందు కున్నాడు) హలో....కరుణకరం స్పీకింగ్? మీరు వెంటనే బయలు దేరిరావాలి...మా ఆవిడ అకస్మాత్తుగా పడిపోయింది అబ్బె.... అబ్బేంలేదండీ, వూరికే పడిపోయింది. నో... నో... అలాటిదేమీ లేదూ. ప్లీజ్, . వెంటనే రావాలి-"(రిసీవర్ పెట్టేసి-లోనికివెళ్ళాడు రత్నాలు బయటికొచ్చాడు. డాక్టర్ బయటనుంచి రాగానే. ఆయన

చేతిలో బ్యాగ్ రత్నాలు అందుకున్నాడు ఇద్దరూ లోనికి వెళ్ళారు, క్షణం నిశ్శబ్దం డాక్టర్ బయటికొచ్చారు. కరుణాకరం వెంటవచ్చారు

దా : మరేం కంగారుపడకండి కరుణాకరంగారూ

కరు . ఏమయింది డాక్టర్?

దా పియాజ్ ఆల్‌రైట్ మిష్టర్ కరుణాకరం బట్..,

కరు , బట్? బట్ హేపెన్డ వాట్ హేపెన్డ టుహర్? టెల్ మి డాక్టర్ ప్లీజ్ టెల్‌మి

దా :షియీజ్ ప్రిగ్నెంట్-

కరు . డాక్టర్ [నిర్ఘాంతపోయాడు]

దా : యూ ఆర్ యే లక్కీ ఫెలో కరుణాకరం (రత్నాలు బయట కొచ్చాడు,)

కరు , డాక్టర్ మరేం చెబుతున్నారు?

దా : త్వరలో మీరు... ఓ బిడ్డకు తండ్రి కాబోతున్నారు.

కరు : నో-డాక్టర్ అలా జరగడానికి వీలేదు-వీలేదు. డాక్టర్

దా : కరుణాకరంగారూ తండ్రికావటం మీకిష్టంలేదా?

ర : డాక్టర్‌గారూ మా బాబుగారు తండ్రి కాబోతున్నారా?

దా : అవును రత్నాలు

ర : బాబుగారూ నిజమేనా? డాక్టర్ బాబు చెప్పేది నిజమేనా?

కరు : లేదు డాక్టర్ ఇది నిజం కాదని ఒక్కమాట చెప్పండి.

దా : నిజాన్ని అబద్ధంగా మార్చడానికి-నేను పోలీసు అఫీసర్ని కాదు కరుణాకరం డాక్టర్ని బయాం ఏ డాక్టర్,

కరు : అయితే... గీత..

జా : త్వరలో ఒకమంచి బిడ్డను కనబోతుంది- కలవు-

(అంటూ బయటికి వెళ్ళారు)

ర : బాబుగారూ చినబాబుగారికి... రత్నంలాంటి తమ్ముడు పుడతాడు,
కరు : లేదు రత్నాలూ గీత తల్లి కావడానికి వీల్లేదు.
ర : బాబుగారూ ఏమంటున్నారు?
కరు . నిజం... మాటికి మూడుపాళ్ళు నిజం రత్నాలూ

ర . అదేమిటి బాబూ పసిబిడ్డ పారాడితే- ఇల్లంతా పచ్చగా ఉంటుందంటూ లోపినవ్వులు కురుపిస్తే, మనసులు మమతలు పిరులతో నిండి పోతా యంటారే మీరు వద్దంటున్నారా! వెన్నెలాటి చల్లని ముద్దులు — వద్దంటున్నారా?

కరు . ఒరేయ్ నన్ను కాస్త విశ్రాంతి తీసుకోనీ-నీ ఉక్తి నా గుండెల్ని గాయం చేయకు- వెళ్ళు—వెళ్ళరా-

ర : అలాగేబాబూ అలాగే ఆ తల్లి కడుపున చిన్నివ్వుల పంట పండితే కనులపండుగ్గా చూడాలని- ఏవేవో కలలు గన్నాను. ఇప్పుడా కలలన్నీ చంపివేసుకుని కళ్ళు మూసుకుని వెళ్ళిపోతాను బాబూ వెళ్ళిపోతాను [అంటూ బరువు కళ్ళతో లోనికి వెళ్లాడు ఏదో విషాద గీతం వినిపిస్తుంది, కరుణాకరం చెమటతో తడిసిపోయాడు బరువెక్కిన గుండెలమీద చెయ్యేసుకుని కూలబడిపోయాడు. తెర మున్నితంగా జారింది]

# అయిదవ రంగము

[అలంకరణ మామూలుగానే వుంది. రమణ [illegible] వర్ణాల
గోడలకు తగిలించిన చిత్రాల వేపు మహాపటుడులా పరీక్షగా
చూస్తాడు. దాదాపు అతని వాలకం పౌరాణిక నాటకంలో మహా
రాజులా వుంది ఒకటి రెండుసార్లు అటూ యిటూ తిరిగాడు]

రమ. అహా ఏమి భవన రమణీయకము ఈ సుందర సౌధమ్ములో నివ
సించు వారలెంత ధన్యులు ఈ వయ్యారి భామ ఎవరై యుండును?
ఓహో అజంతా శిల్ప సుందరి కాబోలు. యీమె యేకదా. విశాఖ
మ్నుల కిన్నెలపాలి? ఓహో ఈ అమ్మలమిన్న ఎవరై యుండును?
[తలగోక్కుంటూ బాగాఆలోచించాడు] తెలిసినది తెలిసినది- తెలుగు
సంస్కృతివిపణికి వచ్చు కున్నసందూరివారి వెలవంక ఎంకి
కాబోలు అర్ధనిమీలిత నేత్రాలతో అందమయినొ కోరికలు నింపుకుని
యెదురుచూస్తున్న యీ నయగారి ఎవరో? ఓహో... నవ్వులొ
ఉవ్వరువరసాంప్ని గ్లాసునిండా నింపిఎర్రని బుగ్గలతో నాకు
పోటికందించడానికి? ఉబలాటపడుతున్నసాకి కాబోలు. ...అహా..
ఏమిప్రాభవమిందలి నివసించువారలుగంధర్వులు కారుగదా ఓయీ
నీవుఎవ్వరవు? ఏకాంతంబున ఒంటిగా తపించు చున్నావు? ఓడి
పోయిన మంత్రివి కాదుగదా ఏమనుచున్నావు? ఓడిపోయిన
మొదల ఏకముగా వెంకటేశ్వరస్వామి సన్నిధికి ఏగువాడవా

ఉంటేనో అపునపుడు ఇళ్ళల్లో నా విజయగ్రహాలని ఏమేళాళ స్త్రీ నాతో పాడుతూ. (ఇంతలో గీత బయటకొచ్చింది)

గీత : ఎవరూ?

రమ: ఎవరైనదీ అర్థం చేసుకోలేని నీ దౌర్భాగ్యమునకు నేనెంతయో చింతించు చుంటిని మిత్రమా ఏమీ మిత్రమా అని సంబోధించిన అవమానము కలుగునా? ఓయీ సిగ్గుచేటు. వేలకు వేలు దొంగ నోట్లు వెదజల్లి ఓట్లు కొనుక్కుని ప్రజల చేతుల్లో ఓడిపోయిన నిన్ను మిత్రమా అని సంబోధించిన నాతెలివి తక్కువతనానికి నేనే చింతించి చుంటిని నేనేచింతించుచుంటిని. [అంటూ ముక్కు చీదాడు]

గీత . వద్దుబావా. నువ్వు చింతిస్తే నేను చూడలేను.

రమ. ఓ ఇంతసేపు నేను మాట్లాడినది..., నీతోనా గీతా?

గీత . కాదు... గోడల మీదవున్న బొమ్మలతో.

రమ. బొమ్మల్లాంటి మనుషులతో మనసువిప్పి మాటాడి మనుషులగోడు వినిపించే కాలికంటే కోరుకోవి ఆ గోడమీద బొమ్మలే నయం గీతా,

గీత . బావా

రమ. బియ్యం పారి గీతా నిన్ను చూసిపోదామని ఇక్కడిదాకా వచ్చాను కాని నీకన్నా ముందుగా గోడల నలంకరించిన యింతులు వింత వింతగాచూసి వళ్ళు పులకరించేలా చేశారు. ఆ ఇంతకీ మీవారు?

గీత . ఇప్పుడే బయటికి వెళ్ళారు. వాపి తెస్తాను. కూర్చో బావా [వెళ్ళి పోయింది]

రమ. ఆ,. గీతా. నేను కాఫీ త్రాగడం మానేశాను.

గీత . అదేమిటి బావా.

రఘు. నేను జీవితంలో మొదటిసారిగా చేసిన మంచి పని అదే గీతా.
గీత . కాఫీ మానేయడంలో మంచితనం బయటపడదు బావా మనిషిలా బ్రతకాలి. మానవతను అందరికి పంచి పెట్టాలి అప్పుడు నువ్వు నిజంగా మారావని ఒక్క అడుగు ముందుకు వేశావని అనుకుంటాను.

రఘు ,నిజంగా ఆ ప్రయత్నమే చేశానుగీతా కాని పడిపోయాను. నను వ్యాల ప్రవంతిలో పూర్తిగా మునిగిపోయాను.
గీత . ఏమిటి బావా నువ్వనేది?

ర : ఇది కలత నీతో చెప్పరాదు అదని మాట అనలేను గీతా.
గీత . అంటే
ర . మత్తయిన కోరికలలో మెత్తని కౌగిలిలో పడ్డాను.
గీత : బావా
ర : ఎన్నోసార్లు పడ్డానుగీతా. గుండెకు దెబ్బగాని మనసుకు నొప్పిగాని తగలేదు. కాని ఇప్పుడు హృదయానికే బలమైన దెబ్బతగిలింది గీతా.

గీత . బావా.

ర : ముక్కలై కొంత పక్కలై మిగిలింది గీతా.
గీత . ముందు చూపు లేకుండా ఎందుకలా చేశావు బావా.
ర : ముందుచూపే అలా చేశాను. ముందుగా కలిపించే అంశాలను చూసి తొందర పడటంలో తప్పేమీలేదుగా.

గీత : వద్దు బావా ఈ ప్రేమలూ ఆరాధనలూ బూటకాలు ప్రేమించటం తర్వాత లభించటంలేదు. పొందించేదేమీలేదు అందుకే ఎవ్వరిని ప్రేమించను ఈ ఆరాధనలో మనముకు కావలసిన లభిన విశ్రాంతి

గీత . ఏమిటి మీరనేది?

కరు . విషం

గీత . ఏమిటా విషం?

కరు . నామెళ్ళో మూడుముళ్ళు వేసినవిషం. మూఢవిశ్వాసాల నా. విశ్వాన్ని అంతానికి కట్టివేయలేక పోయిన విషం- మూడు వేలుగా నీలో పెరుగుతున్న పసివిత్తుకు తండ్రివి కాలేనివిషం గీతా?

గీత : లేదండీ? మీ మాటలు విషంకావు.

కరు . పోనీ ...అబద్ధం ఎలావుంటుందో నువ్వుచెప్పు.

గీత . నేను గర్భవతినా

కరు : డాక్టర్ చెప్పినమాట.

గీత . మీ మాటలు నాకేమీ అర్థంకావటం లేదండీ

కరు . భవిష్యత్తులోకి మనిషిలా నడుగు వేయాలి. జీవితానికి క్రొత్త అర్థాలు తొడుక్కుంటే గతంయింకా నన్ను వెంటాడుతూనే వుంది గీతా?

గీత . ఒక్కవిషం చెప్పండి,

కరు . చెబుతాను గీతా? తప్పకుండా చెబుతాను ఎందుకో తెలుసా?విన్నా నేనుకున్నాను గనక. విషం చెబితే-యింకెవరూ వినేవాళ్ళులేరు గనుక.

గీత . మదన్ మీకేమవుతాడు?

కరు , ఊపిరి- నాకేమవుతుందంటావు గీతా?

గీత , ఏమండీ?

కరు . విషమయమైన...నా బ్రతుకు నాకేమవుతుంది?

గీత . ఏమండీ?

కరు . విస్కీ-పి. విషాదాన్ని. తృప్తిగా త్రాగిన తర్వాత. కైపెక్కిన అనుభూతి, అన్నీ మరచే గీతా? వెళ్ళు ఇకనువ్వు నన్నేం అడక్కు. నడుము కాపేవు... గతాన్ని, లోకాన్ని మర్చిపోనీ- (అంటూ త్రాగేప్రయత్నం చేశాడు. ఆమె అడ్డుచేసింది)

గీత. నేను చచ్చినా మిమ్మల్ని బ్రతకనివ్వను.

కరు. నేను బ్రతికినా- నిన్ను మాత్రం చావనివ్వను గీతా. నువ్వు బ్రతకాలి మారేందుకు నువ్వుగా బ్రతకాలి. ఆ బ్రతుకులో నందువెన్నెల పండాలి. న్యాయానికి ఏదేశమైనా అన్యాయం చేస్తాదేమోగాని, ఈ కరుణాకరం, ఎప్పుడూ ఎవ్వరికీ అన్యాయం చేయడు గీతా! చేయలేడు... అందుకే.... నువ్వు- బ్రతకాలి. న్యాయంకోసమైనా బ్రతికితీరాలి. [అంటూ బయటకి వెళ్ళిపోయాడు ]

గీత ; ఏమండీ! ఏమండీ! (అంటూ ఏడుస్తూ వెంబడించింది మధు [illegible] బయట కొచ్చి అంతా విన్నాడు.)

మధు. చిన్నమ్మా!

గీత. మధూ! (బావురుమంది)

మధు. ఏమైంది చిన్నమ్మా?

గీత, అంతా చీకటైపోయింది మధూ!

మధు, నాన్నగారు .... మళ్ళీ త్రాగుతున్నారా?

గీత. తప్పత్రాగుతున్నారు మధూ! తప్పిపోతున్నారు.

మధు. ఆయన న్యాయవాది చిన్నమ్మా అందుకే... న్యాయమైన దారి వెదకుతున్నాడు.

గీత. నన్నెందుకిలా చిత్రవధ చేస్తున్నారు? నేనేం పాపం చేశానని చంపుతున్నారు?

మధు. నువ్వెప్పుడో చచ్చిపోతావుగా చిన్నమ్మా.

గీత. మధూ.

మధు. అవును చిన్నమ్మా నిన్ను బ్రతికించాలని నీ బ్రతుకు మోడులా చిగురించాలని నేనూ నాన్నగారు... కోరుకోవడంలో తప్పేం లేదుగా-

గీత. లేదు మధూ మీ తప్పేం లేదు. తప్పంతా నాది. ఇంకా నేను జీవించి వుండటమే తప్పు ఈ విషాదాన్ని ఇంకా దాచుకొని ఈ అగ్నిని గుండెల్లో రగిలించుకుంటూ- బ్రతకడం నాదే తప్పు- [అంటూ తన గదిలోనికి వెళ్ళింది.)

మ. చిన్నమ్మా చిన్నమ్మా [అంటూ కదుముకుంటూ వెక్కిరోయి కదలోయాడు అప్పుడే బయటనుండి వచ్చిన మదన్ పట్టుకున్నాడు] ఎవర్నువ్వు?

మద. నాపేరు మదన్.

మ. మదన్ నువ్వేనన్నమాట.

మద. లోగడే నాపేరు తెలుసా నీకు?

మ. తెలుసు- జీవితాల్లో నిప్పులు పోస్తావని ఆ నిప్పుల్లో కాలిపోయి బ్రతుకుల్ని చంపి నవ్వుతావని తెలుసు.

మద. నీకు తెలిసింది చాలతక్కువ.

మ. అవును చాలతక్కువే నీకు మానవత్వం లోపించిందని ఇప్పుడు తెలిసింది.

మద. ఆలస్యంగా అర్థం చేసుకున్నావు.

మ. ఛీ నువ్వు మనిషివికాదు.

మద. పశువును కూడా కాదు.

మ. ఎందుకిలా అకృత్యాలు చేస్తున్నావు,

మద. మంచిచేస్తే చూసేవాళ్ళులేరు గనుక.

మ. వెలుగును చూద్దాం ఇష్టంలేదా నీకు?

మద. బ్రతుకంతా చీకటిగానే మిగిలిపోయింది అందుకేచెడి పోతూవు ఆశలూ అన్నిచంపుకున్నాను, మమతా మానవతలూ అన్నిచంపుకున్నాను.

మ. నేను గీత తెలుసుకదూ?

మద. నాకు చాలామంది ఆడవాళ్ళు తెలుసు అందరితోనూ అంతో ఇంతో పరిచయంవుంది అందుబాటులోవున్న అందాలను అనుభవింతో దానికి నేనెప్పుడూ వెనుకాడలేదు.

మ. నీ సుఖాన్ని నేనెప్పుడూ కాదనలేనుకాని గీతవట్టి అమాయకురాలు ఆమె జీవితంలో యెందుకు కలుషితాన్ని చల్లావు? ఆమెనెందుకిలా నరకంలో త్రోసివేశావు?

మద. దానికి కారణం మీనాన్న.

ము . ఏమిటి నువ్వనేది?

మధ . అవును... నేనిలా చెడిపోవడానికి ఇలా వ్యర్థంగా జీవించడానికి మీ నాన్నే కారణం.

ము . నో నేన్నమ్మను ఆయన చాల మంచివారు — ఒకరికి అన్యాయం చేయడమంటే మా నాన్నకిష్టంలేదు,

మధ . చెడితే తీరనంత అన్యాయం నాకు చేశాడు.

ము . ఏం చేశాడు?

మధ . మధూ. నేనూ మనిషిలా బ్రతకాలని మానవతను పుద్ధరించాలని ఎన్నోసార్లు ప్రయత్నించాను, కాని మీనాన్న నన్ను సుఖంగా వుండనీలేదు.... అందుకే, అందుకే,

ము , విషయం చెప్పు (ఇంతలో గీత బయటకొచ్చింది)

గీత . మధూ. మళ్ళీ ఎందుకొచ్చావు? ఇంకేం సాధించాలని ఇక్కడికి వచ్చావ్? మధూ. వీడే— వీడే మధూ వెలుగుతున్న నా బ్రతుకును ఆర్పింది వీడే మధూ.

ము . గీతా!

గీత . మధూ! ముందీ దుర్మార్గుణ్ణి బయటికి వెళ్ళమను- బ్రతుకుల్ని అగాధంలో నెట్టి ఆనందంగా నవ్వుతూ తిరిగే యీ కసాయివాణ్ణి వెళ్ళిపొమ్మని చెప్పు. వాడిమొఖం చూస్తేనే మహాపాపం మధూ! మహా పాపం.

మధ . అవును గీతా! నేను పాపిని కసాయివాడిని దుర్మార్గుడిని అంత వరకే తెలును మీకు కాని— నేనలా మారడానికి నరకం అనుభవించడానికి— కారణం ఎవరు? మీరు మీరు మీరు?

ము , మదన్.

మధ . అవును— మీరే మీరే మీరే మీరే.

గీత . వద్దు.... ఇకనువ్వేం చెప్పొద్దు. కల్లి బొల్లి మాటలతో మాకళ్ళు కప్పడానికి యింకా ప్రయత్నించవద్దు. దయచేసి వెళ్ళిపో పో [అంటూ లోనికి పరుగుదీసింది.]

మ . మదన్, మళ్ళీ చెడిపోవడానికి కారణం మానాన్నా?

మద . అప్పను గిరను పాడుచేయడానికి పికళ్ళు పోవడానికి కారణం ఎవరు? మీనాన్న:

మ . మదన్!

మద . అవును మధూ నువ్వు నమ్మలేవు పెద్దరికం పేరుతో న్యాయం అనే ముసుగు వేసుకుని నన్నెంత అన్యాయం చేశాడో నీకేం తెలుసు?

మ . మానాన్న యింత అపకారం చేశాడా?

మద . అంతా యింతా కాదు. ఆ వెలితి పూడ్చుకోవడానికి, తన బ్రతుకంతా అర్పణ చేసినా తీరని లోటే చేశాడు.

మ . ఏం చేశారు.

మద . నాకూ ఓ తల్లి వుంది ఆ తల్లి వట్టి అమాయకురాలు కల్లా కపటం ఎరుగని ఉత్తమ యిల్లాలు, మీనాన్నను నమ్మింది. లేదు— నమ్మించాడు. పెళ్ళాడుతానని ప్రమాణం చేశాడు ఆమె జీవితంలో ప్రవేశించాడు శీలం హరించి పెదాలు తుడుచుకున్నాడు. ఆ తల్లి తల్లి తన సర్వస్వం మీనాన్నకే అర్పణచేసి పెళ్ళాడమని కాళ్ళ మీద పడింది. ఒక్కసారి తన మెడలో కట్టి యిల్లాలును చేయమని ప్రార్థించిందికాని— మీనాన్న ఏంచేశాడో తెలుసా మధూ?

మ . ఏం చేశాడు మానాన్న ఏం చేశాడు? [ఇంతలో కరుణాకరం బైటినుండి వచ్చాడు.]

కరు . నేను చెబుతాను మధూ మిగిలిన కథ నేను చెబుతాను, ఆరు నెలల గర్భవతిని నిరాకరించాను. సంఘం సాంప్రదాయం అడ్డొస్తాయని కులాలూ మతాలూ వెక్కిరిస్తాయని ఆమెను తిరస్కరించాను, ఆశ్రయం లేకుండా చేశాను.

మ . నాన్నా!

కరు . అప్పుడు మధూ, చేతులారా ఆమె జీవితాన్ని చీకటిచేసి మీ అంతటి బతుకుల్లో వెలుగును కరువుచేసిన కసాయివాడిని నేనే బాబూ, నేనే,

మధు . ఈ పెద్ద మనిషి మూలం తప్పిపోయిన తర్వాత ఆమె పట్టణంలోకి
చేరింది. కాని ఎక్కడా పుట్టగతులేకుండా చేశాడు గిరి తండ్రి.
"మనవ్వ చెడిపోయావే. నీకీ యింట్లో స్థానంలేదు. నీ ముఖం
నాకు చూపించకు" అని తరిమేశాడు అప్పుడు అప్పుడు కన్నా
చెట్టు నీడన కన్నది. ఆ చెట్టు కొమ్మలకు ఊయలవేసి నన్ను
పడుకోబెట్టి జోలపాడింది. తన కడుపు కట్టుకుని ప్రతియింట్లో
ఊడిగంచేసి నన్ను బ్రతికించింది. ఇలా పదేళ్ళు గడిచాయ్. ఒక
రోజు ఆమె జ్వరంతో పడిపోయింది దిక్కులేనిదాని తన అక్కున
చేర్చుకుని తలనిమిరా ఏడ్చి ఏడ్చి ఏడుస్తున్న నా కళ్ళలో నీళ్ళు
తుడిచి నీకూ ఒక తండ్రి వున్నాడు బాబూ ఆయన నిన్ను గొప్ప
వాడిని చేస్తారు వెళ్ళు బాబూ అని అడ్రసు యిచ్చి కన్ను మూసింది.
ఐదేళ్ళ పసివాడిని నడిరోడ్డున వదేసి ఐనాయ బిడ్డగా తయారు
చేసింది: కాని .. మీనాన్న అప్పటికీ ఇప్పటికీ నేనే నీ తండ్రిని
అని ఒక్కమాట చెప్పలేదు. అందుకే కసితీర్చుకున్నాను మీ అం
దమీద పగతీర్చుకున్నాను. చెప్పువదూ. నేను చేసిన తప్పేమిటో
చెప్పు. నాకు జరిగిన అన్యాయంలో ఏ ఒకంతైనా జరిగితే మీరేం
చేస్తారో చెప్పువదూ

మదు. నేనేం చేస్తానో తెలుసా. తృప్తిగా నిన్ను అన్నయ్యా అని
పిలుస్తాను.

మ : మధూ

మదు. అవునన్నయ్యా మళ్ళీ మళ్ళీ పిలుస్తాను కరువైన ఆత్మీయత నీతో
వింటేంత వరకూ పిలుస్తానన్నయ్యా

మ . తమ్ముడూ

మదు. అన్నయ్యా

కర . బాలా బాబూ ఇప్పుడు నా మనసు చల్లబడింది. న్యాయం దాటినేను
చేసిన నేరాలు క్షమించగలిగే యిద్దరు కొడుకులు నాకున్నారు ఇక

నాకు చింతలేదు బ్రతుకు మీద ఆశలేదు. గీతా! గీతా [గీతలోప
లినుంచి తూలుతూ వచ్చింది] ఏం జరిగింది గీతా?

గీత . ఏం లేదండీ మీ యిద్దరి కొడుకుల్ని చూసి ఆనందంతో హృదయం
పొంగిపోయి ఏదో మైకం వచ్చింది

కరు . గీతా ఇటు చూడు నేనేం చేయబోతున్నానో చూడు (అంటూ ఆమె
మెళ్ళో తాళి తెంచాడు)

గీత . నాకు తెలుసండి పసుపు కుంకాలతో నన్ను సాగనంపాలని ఆశపడు
తున్నారు వద్దండీ...నాకేమీవద్దు. మీపాదాల చెంత యింత చోటిస్తే
చాలండీ సంతోషంగా వెళ్ళిపోతాను [అంటూ ఆయన పాదాల
మీదపడింది కరుణాకరం లేపడానికి ప్రయత్నించాడు కాని...
ఆమె అప్పటికే చనిపోయింది "గీతా" అంటూ ఒక గావుకేకవేసి
కరుణాకరం పడబోయాడు. మదన్ పట్టుకుని కుర్చీలో కూర్చో
బెట్టాడు అంతే...ఆయన కూడా యీ లోకాన్ని విడిచాడు.]

మ . నాన్నా [పెద్దగా పిలిచాడు]

మదు: అన్నయ్యా ఏం జరిగింది? నాన్నగారికి ఏం జరిగింది.

మ . నాన్న [బావురు మన్నాడు. ఇంతలో సత్యం . నారే చీరెపూలు
తీసుకుని వచ్చాడు విభ్రాంత పోయాడు]

స . గీతా అమ్మాగీతా

మదు. గీతను చూసి పోదామని వచ్చావా సత్యం!

స . అవును వచ్చాను జైలునుండి విడుదలై సారే, చీర తీసుకుని పసుపు
కుంకాలతో సాగనంపడానికి వచ్చాను మీ పశుత్వానికి అమానుషా
నికి బలైపోయిన నా చెల్లిని కళ్ళారా చూసుకుందామని వచ్చాను.
అమ్మా గీతా నేనమ్మా నీ అన్నయ్యను వచ్చాన్ని! నువ్వు బ్రతికి
నంత కాలం నా బ్రతుకంతా జైల్లోనే గడిపాను కాని నేను బయట
కొచ్చాను. నువ్వు తిరిగి రానిమరో లోకానికి వెళ్ళిపోయావ్ నే
నెంత దౌర్భాగ్యుణ్ని గీతా

మధు: గీతా మాట్లాడదు. సత్యం మరోలోకపు హద్దులు దాటి వెళ్ళిపోయింది. అక్కడ స్వార్థంలేదు. కసితో వేటాడే మానవమృగాలులేవు. ఆకలిలేదు. నిద్రలేదు. చీకటిలేని శాశ్వతమైన వెలుగులోకి వెళ్ళిపోయింది. ఆమెంతో అదృష్టవంతురాలు చాలా అదృష్టవంతురాలు (రమణ మహర్షి వచ్చారు. ఒకరి చేతిలో పూలదండ మరొకరి చేతిలో కప్పువుంది.)

ర. నువ్వు వచ్చావా బావా? గీతా నేనే గెలిచాను ఉత్తమ నటుడుగా గెలిచాను ఎంత పెద్ద పూలదండ వేశారో చూడు. గీతా ఈ గెలుపు నిజంగా నాది కాదు నీదే అందుకే ఈ దండ నీ మెళ్ళో వేస్తాను గీతా గీతా నువ్వు నవ్వుతున్నావా [అంటూ నవ్వుతూ ఏడ్చాడు]

మహ. గీతా నేను వ్రాసిన "శీలానికి శిక్ష" నాటకానికి ఉత్తమ రచన యిచ్చారు గీతా ఇదిగో వెండికప్పు ఈ గెలుపు నీదే గీతా తీసుకో [ఆమె చేతులో పెట్టాడు. బయట నుండి దానిమ్మ పండుతో రత్నాలు వచ్చాడు.

ర. అమ్మాయిగారూ ఈ దానిమ్మ పండు తిని ఎర్రటి బుల్లిబాబాయిగారిని కనాలి. తినండి.

మధు. గీత చనిపోయింది రత్నాలూ ఆమె ప్రాణవాయువులు అనంత విశ్వంలో కలిసిపోయాయ్

మ, గీత చావుకు కారణం నేను (అనగానే మధు రమణ మహర్షి రత్నాలూ స్థబ్దులై పోతారు) మీరెవరూ ఆమె చావుకు కారకులు కారు నేను శిక్ష అనుభవిస్తాను ఇంతమంది మంచివాళ్ళ ముందు ముఖం ఎత్తుకుని నేను తిరగలేను మీకు అన్యాయానికి శిక్ష అనుభవించి తీరాలి, అందుకే వెళ్తున్నాను. క్షమించమని అడిగే అర్హత నను కూడ పోగొట్టుకున్నవాడు శిక్షకావాలి, శిక్షకావాలి [అంటూ బయటికి వెళ్ళిపోయాడు, తెరజారింది]

